# కృతజ్ఞత.

ఈ గ్రంథ ప్రకటనకు రాజపోషకులు.

1. శ్రీ మంతెన వెంకటరాజుగారు M. L. A., మద్రాసు
2. శ్రీ కూకల వీరరాఘవయ్యగారు M. L. A., కానుమోలు.
3. శ్రీ మెర్ల వెంకటరాజు గారు
   జిల్లాబోర్డు అండ్ పంచాయితీబోర్డు మెంబరు, మండపేట.
4. శ్రీ వల్లూరి పాపారాయుడు గారు
   పంచాయితీబోర్డు ప్రెసిడెంటు, మండపేట.
5. శ్రీ నూనె సోమారావు గారు
   పంచాయితీబోర్డు వైస్ప్రెసిడెంటు, మండపేట.
6. శ్రీ జంబ్బా వాసుదేవప్రసాదరామయ్య గారు
   జిల్లాబోర్డు మెంబరు, ముస్తాబాద, కృష్ణాజిల్లా.
7. శ్రీ అట్లూరి సీతారామయ్య బి. ఏ., గారు
   రామప్రసాద్ అండ్ కో., విజయవాడ
8. పచ్చిపులుసు సుబ్బారావు గారు
   టెక్స్టైల్ హోల్‌సేల్ మర్చంటు, విజయవాడ
9. శ్రీ యార్లగడ్డ బలరామయ్యగారు కైకలూరు.
10. శ్రీ పి. వి. రెడ్డి బి, ఏ. బి. యల్. గారు
    ప్రొప్రయిటరు, వివేకానంద టెక్స్టైయిల్సు, నెల్లూరు
11. శ్రీ ఆర్. వి. కృష్ణయ్య పంతులుగారు.
    యార్న్ డీలర్సు, కావలి. నెల్లూరుజిల్లా,
12. శ్రీ కాకంగి సుబ్బరామయ్యగారు
    సూలూరుపేట. నెల్లూరుజిల్లా.
13. శ్రీ కె. రామకృష్ణయ్య నాయుడుగారు
    టెక్స్టైయిల్ మర్చంటు, వెంకటగిరిటౌన్ నెల్లూరుజిల్లా.
14. శ్రీ మాగంటి వెంకటసుబ్బారావుగారు.
    రాచపట్నం. కైకలూరు తాలూకా కృష్ణాజిల్లా.
15. శ్రీ కానుమూరి వెంకయ్యగారు.
    వరహాపట్నం, కైకలూరు తాలూకా కృష్ణాజిల్లా.

# పంచాయితీ రాజ్యం


సంపాదకులు.

విశ్వజ్ఞ మండలి

తెనాలి.





గౌరవపరిశీలకులు

శ్రీ చిత్రాపూరి నాగభూషణాచార్యులు బి. ఏ., బియిడి.

గా ణ కం బి.

[illegible] తాలూకా, కృష్ణాజిల్లా.



ప్రకాశకులు

శ్రీ కోట వెంకటేశ్వర్లు

వీరభద్రగ్రంథమాల

శ్రీ సత్యానంద శిల్పాశ్రమము

మంగళగిరి (P. O) గుంటూరుజిల్లా.

# తొలిపలుకు

## శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారు.

అధ్యక్షులు. ఆంధ్రదేశ గ్రామపంచాయితీల సంఘము.

ఎడిటర్ "గ్రామపంచాయితీ పత్రిక"

[illegible]

గ్రంథ ప్రకటనకు ప్రోత్సాహకులు.

1. శ్రీ సారంపాటి వీరన్నాచార్యులుగారు

తహసీల్దారు, కృష్ణాజిల్లా.

2. శ్రీ వి. వీరబ్రహ్మంగారు

ఆనగడాగ్రామము, మైదుకూరు, కడపజిల్లా.

వికృతి, శరత్.


| సర్వహక్కులు | మొదటికూర్పు | మూల్యం |
|---|---|---|
| ప్రకటనకర్తవి | ప్రతులు 1000 | రు 2—8—0 |

మద్రాసు ప్రభుత్వ

స్థానిక స్వపరిపాలన శాఖామాత్యులును

నూతన గ్రామ పంచాయితీ చట్టనిర్మాతలును



గౌరవనీయులు

శ్రీ కల్లూరి చంద్రమౌళి బి. యస్. సి. గారికి

స మ ర్పి త ము

షులు కలుగజేయబడినవో, ఆరీతిగనే గ్రామ పంచాయితీలకు గ్రామ పరిపాలనా విధానమునందు గ్రామములో అధికారము, అవకాశము కలిగి యుండవలెను.

“ఢిల్లీకి ఢిల్లీ పల్లికి పల్లి” అన్నట్లు ఢిల్లీ పరిపాలనము దేశ సంతతను స్వాతంత్ర్య వాతావరణమున స్వయంపోషకత్వము కల్గి నిర్వహింపబడుటకు తోడ్పడునట్లు ప్రతిపల్లెటూరు గ్రామపంచాయితీ పరిపాలనమున స్వయంపోషకత్వము కల్గి ప్రజల సుఖసంపదలు వర్ధిల్ల జేయుటకు తోడ్పడవలెను. అప్పుడే సుస్థిర పంచాయితీ రాజ్యపరిపాలము వలన గ్రామసీమలు వాసయోగ్యములు కాగలవు. రామరాజ్యము లభింపగలదు. మహాత్ముని కలలు యీడేరగలవు.

జై హింద్

ఆలమూరు<br>
తా 10-11-50

నరసింహదేవర సత్యనారాయణ

# మండలివారిమాట.

స్వతంత్ర భారతదేశములో గ్రామపంచాయితీలు దేశాభ్యుదయమునకు మూలకందములు కాగలవు. ప్రాచీన కాలము నాటినుండి నేటివరకు గ్రామ పంచాయితీల పరిణామములను వివరించి గ్రామపంచాయితీ నిర్వహణమునకుప యుక్తముగు సూచనలుగావించి, సుస్థిర పంచాయితీ రాజ్య స్థాపనకు తోడ్పడుటయే ఈగ్రంథరచన యందలి ముఖ్యోద్దేశము. ఈ గ్రంథ ప్రాశస్త్యమును చదువరులే నిర్ణయింతురుగాక!

ఈ గ్రంథరచనకు మూలకారకులు శ్రీ చిర్రావూరి నాగభూషణాచార్యులు. బి. ఎ. బియిడి. గారు. పంచాయితీ పరిపాలన యందు వీరికి గల విశేషానుభవమే ఇందు మూర్తీభవించినది. శ్రీ ఆచార్యులు వారికి మా ప్రత్యేక కృతజ్ఞత.

ఆంధ్రదేశ గ్రామ పంచాయితీల సంఘాధ్యక్షులుగను, గ్రామ పంచాయితీ పత్రికా సంపాదకులుగను, నూతన గ్రామపంచాయితీ చట్టమును రూపొందించిన వారిలో నొకరగు శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారి తోలిపలుకు ఈ గ్రంథమునకు మెరుగుతీర్చి దిద్దినది. శ్రీ సత్యనారాయణగారికి మా ధన్యవాదములు.

ఈ గ్రంథప్రకటన కర్తలకును, ప్రకటనకు ప్రోత్సాహకులకును, రాజపోషకులకును మా కృతజ్ఞతాభివందనములు.

గ్రామవాసుల్లో నొకరై, స్థానిక స్వపరిపాలనలో విశేషానుభవముపొంది, పంచాయితీ రాజ్య స్థాపనకు పునాదియనదగు నూతన గ్రామ పంచాయితీ చట్టమును నిర్మించి, రామరాజ్య స్థాపనకు కలలుగనిన పూజ్యబాపూజీ ఆశయములను ఫలవంతము చేయుటకు నిరంతరము కృషిచేయుచున్న స్థానిక స్వపరిపాలన శాఖామాత్యులగు శ్రీ కల్లూరి చంద్రమౌళిగారికి ఈగ్రంథమును కృతజ్ఞతతో సమర్పించి ధన్యులమైతిమి.

మా మండలి దొరకొన్న పనులన్నియు ఇట్టివియగాన ఈ గ్రంథమును వెలువరింప జేయుటలో మా సేవాతత్పరతతప్ప మా కెట్టి ప్రత్యేకతలేదని మనవి.

ఓంతత్సత్

10-11-59 తెనాలి.

— వతేశ్వరాచార్యులు, కార్యదర్శి.
విశ్వజ్ఞ మండలి

# ప్రాచీన గ్రామపంచాయితీలు - వాటి ప్రాముఖ్యత.

దక్షిణభారతదేశంలో ప్రాచీనకాలమున గ్రామపంచాయితీలు గ్రామాభ్యుదయమునకై కృషిచేసినట్లు చరిత్ర చాటుచున్నది. కొట్టు, తిట్టు మున్నగు క్రిమినల్ కేసులనుండి ఆస్థిపంపకపు సివిల్ వ్యవహారముల వరకు వీరు న్యాయముగ పరిష్కరించుచుండెడివారు. గ్రామమునకు సంబంధించిన సమస్తవ్యవహారములు వీరుచర్చించి నిర్ణయించవలసినదే. వీరితీర్పునకు తిరుగులేదు. గ్రామసౌభాగ్యమే వీరి ఆదర్శము. గ్రామ సమిష్టి జీవనవిధానమునకే పంచాయితీలు ఎంతయో తోడ్పడినవి.

ప్రాచీన పంచాయితీల పరిపాలనా విధానమునుగురించి అనేక శాసనములలో ఉదహరింపబడినది. 1908 సంవత్సరములో కనుగొన బడిన 600 నెంబరు శాసనములో తిరుప్పూదేవరు గ్రామములో పన్నెండు నాడుల పంచాయితీలు సమావేశమై ఆయానాడుల సమిష్టి వ్యవహార ములను పరిష్కరించుకొనినట్లు పేర్కొనబడినది. వ్యవసాయాభివృద్ధికి కొన్ని నిర్ణయములు గావించుకొనినట్లు తెలుపబడినది. రాళ్ళపడికొండ చోలవాల నాడులో (పుదుకోట) ఒకమండల పంచాయితీ సమా వేశమై ఆమండలములోని పంచాయితీలన్నియు ఎట్టిపన్నులు వసూలు చేసికొనవలసినది తీర్మానించుకొనినట్లు పై శాసనములోనే వ్రాయబడి నది. 'నాడు' అను పదము ఒకజిల్లా లేక ఒక విస్తీర్ణమైన ప్రదేశమునకు వర్తించే పంచాయితీల సంఘమని అర్థమిచ్చుచున్నది. కళింగదేశపు రాజులు గ్రామపంచాయితీలకు విశిష్టమగుస్థానమొసగిరి. * చోళ

* It is significant that such Local Bodies and Assemblies retained their autonomy even during the heyday of Chola Imperialism. (985–1013 A. D.)

సామ్రాజ్యాంతము నందును గ్రామపంచాయితీలు స్వయంపరిపాలనా సిద్ధాంతమును నిలువబెట్టుకొని చక్కగ పనిచేయుట గమనింపతగినది. * ఉత్తరమునలక్కదీవులు, మాల్దీవులు, అండమాను, నికోబార్ ద్వీపముల నుండి దక్షిణమున మలబారుతీరము, కూర్గునుండి పేగువరకు తమసామ్రాజ్యమును విస్తరించుకొనిన రాజరాజ, రాజేంద్ర చోళదేవులు గ్రామ పంచాయితీలకుగల సివిల్ క్రిమినల్ విచారణాధికారములను భూములపై వారికిగల సంపూర్ణ హక్కులను, పన్నులను విధించు విశేషాధికారములను అంగీకరించుటయేగాక ప్రభుత్వమునకు సంబంధించిన భూములను, వశపరచి స్వల్పవాయిదాలలో వడ్డీతో తీర్చుకొనునట్లు కొంతడబ్బు పెట్టుబడియుపెట్టి ప్రోత్సహించెడివారు.

ప్రాచీన పంచాయితీలలో వికేంద్రీకరణ (decentralization) సిద్ధాంతము అమలులోనున్నది. ఈపద్ధతిప్రకారము అధికారము వికేంద్రీకరణము కావాలని గాంధిమహాత్ముడు చాటియుండెను. హిందూమహాయుగములోపూర్తిగా, మహ్మదీయ మహాయుగములో కొంతవరకు గ్రామములలోని పంచాయితీలపద్ధతి చెక్కుచెదరక యుండెను. గ్రామములు సుభిక్షంగా వర్ధిల్లినవి. తెలుగునాడున గ్రామపంచాయితీల చరిత్ర ఎప్పుడు ప్రారంభమైనదో స్పష్టముగతెలియదుగాని ఎనిమిది

---

* "Raja Raja, the great and his son Rajendra Chola Dev, whose Conquests ranged from Kalinga in the North to the Lakkadives and Maldives, the Andaman and Nicobar Islands in the South from the Malabar coast and Coorg to Pegu tolerated the independent civil and criminal Jurisdiction of these bodies, their absolute rights to lands and to self-taxation and even entrusted them with crown lands or money as investment for interest as long as they paid regularly a small charge on the land and some petty imports."

నుండి పన్నెండవ శతాబ్దమువరకు పంచాయితీలు సక్రమంగా పనిచేసిన వని తెలియుచున్నది. * ప్రాచీనకాలములో వ్యక్తిజీవనవిధానమునకు తావులేకుండెను. సమిష్టిజీవనవిధానమే శ్రేయస్కరమని నమ్మబడి ఆచరణయందుంచబడినది. వ్యక్తికి ప్రాధాన్యతేలేదు. సంఘమునకే స్థానము. ఈసంఘముల పరిపాలనకు నిర్దుష్టమైన నిబంధనలులేవు. ఇవి సంఘసేవకై నిర్దేశింపబడిన ప్రత్యేకసంఘములుగ వ్యవహరించుచు, సమిష్టివ్యవహారములను పరిష్కరించుటకు మాత్రమే అప్పుడప్పుడు ఈసంఘముల సమిష్టి సమావేశములు జరుగుచుండెడివి.

'పంచాయితీ' అనగా అయిదుగురు పెద్దమనుష్యులతో కూడిన సంఘమని అర్థము. గ్రామమధ్యన యున్న రచ్చబండపై ఈపెద్దమనుష్యులు కూర్చొని గ్రామవ్యవహారములను సరిదిద్దెడివారు. ఇప్పటికిని మారుమూల గ్రామములలో ఈపంచాయితీపద్ధతి అమలులోనున్నది. అయిదుగురుకంటె ఎక్కువమంది సభ్యులున్నను పంచాయితీయేయని పిలుచుట పరిపాటియైనది. ఎందరు సభ్యులున్నను గ్రామసంఘమునకు పంచాయితీపేరు ప్రసిద్ధిపొందినది. ఇందు అవసరమునుబట్టి ఎంతమంది సభ్యులైనను ఉండినట్లు తెలియనగును.

గ్రామపరిపాలనా నిర్వహణ మంతయు పంచాయితీకి ఇవ్వబడినది. గ్రామమునకు సంబంధించిన సమిష్టివ్యవహారములన్నియు వీరువిచారించి

"* Almost every sphere of life was dominated by group organisations that the individual was of little account and had to function through some group or other. There was no written law or even a distinctly formulated principle intended to govern the conduct of these groups. They acted for the most part in their separate spheres of social work and came together occasionally for considering specific qualities of common concern."

తీర్పు చెప్పవలసినదే. ఈతీర్పునకు అప్పీలు లేదు. వీరినిర్ణయమునకు ఎంతటి వాడైనను తలఒగ్గవలసినదే. వ్యతిరేకించిన వాడెవడైన ఉన్న వానిపై బహిష్కారణాయుధము ప్రయోగించి లొంగదీయుదురు. అందువలననే గ్రామవ్యవహారములు ఎట్టిప్రతిఘటనలేక సాఫీగా నడచెడివి. గ్రామ పెద్దలు ప్రతివిషయమును విశాలదృష్టితో విచారించి పరిష్కరించెడి వారు. స్వార్థచింతనలేక, గ్రామశ్రేయస్సే తమలక్ష్యముగ నుంచుకొని వారుపరిపాలించిరి.

ప్రాచీన పంచాయితీ నిర్వహణము సక్రమపద్ధతిని జరిగెడిది. ఒక్కొక్కశాఖను ఒక ఉపసంఘము పరిపాలించెడిది. పంచాయితీలలో సాధారణముగ ఈక్రింది ఉపసంఘములు కలవు.

1. వార్షికసంఘము 2. ఆర్థికసంఘము 3. న్యాయసంఘము 4. వనసంఘము 5. తటాకసంఘము 6. క్షేమసంఘము. గ్రామపరిస్థితుల ననుసరించి ఇవిగాక ఇంకను ఇట్టి సంఘములుండుటయు కద్దు.

గ్రామసంఘముల ఎన్నికలు పెద్దపిన్నలతో కూడిన గ్రామస్థులందరి మహాసభలో జరిగెడివి. గ్రామమంతటిని గ్రామవిస్తీర్ణతనుబట్టి ముప్పదివార్డులకు మించక విభజించెడివారు. ఒక్కొక్క వార్డులో సభ్యునిగా నిలుచుట కర్హులగువారి పేర్లను తాళపత్రములుపై వ్రాసి కట్టలుగా కట్టెదరు. వార్డుల అన్నికట్టలను ఒకపాత్రలోఉంచి సభవారి యెదుట ఒకబాలకునిచే ఒక్కొక్కకట్ట తీయించి ఆకట్టలోని పత్రములను విప్పి ఇంకొక పాత్రలోఉంచి దానిలోనుండి ఆబాలకునిచే ఒకపత్రమును తీయించెదరు. అనుమానమునకు తావివ్వకుండుటకుగాను ఆపత్రముపై గలపేరును సభాసదులలో చాలమంది చదివి సభలో ప్రకటించెదరు. నిర్ణీతమగు సభ్యులనందరిని ఈవిధముగా ఎన్నుకొనెదరు. ఈసభ్యులందరు

పంచాయితీ లేక గ్రామసంఘముగ వ్యవహరించెడివారు. వీరు పైచెప్పిన ఉపసంఘములక్రింద ఏర్పడి గ్రామపరిపాలనను కొనసాగించెడివారు.

పంచాయితీసభ్యునిగా ఎన్నికకు నిలుచువాని అర్హతలు తెలిసికొన తగినవి. పన్నుకట్టుభూమి కనీసము ఒకటెన్నర ఎకరమైనను ఆయనకు పట్టాకలిగి యుండవలెను. స్వంతయిల్లు ఉండవలెను. వయస్సు 35 సంవత్సరములకు మించి 70 సంవత్సరములకు లోపు ఉండవలెను. గ్రామవ్యవహారములయందు అనుభవముకలిగి ధర్మవర్తనకు పేర్వడసి ఉండవలెను. గతమూడు సంవత్సరములలో సభ్యుడుగా ఉండియుండ రాదు. ఒకసభ్యుడు వరుసగా ఎక్కువకాలము గ్రామపరిపాలనను నిర్వహించరాదను నియమము ఈవిధముగ అనుసరించెడివారు. అన్యాయముగ ధనము నార్జించువాడుగాని అవిశ్వాస పాత్రుడుగ ప్రజలచే ఎన్నబడిన వాడుగాని ఎన్నికలలో నిలచుటకు అర్హుడుకాడు. అనుమానమున్నవాని డబ్బు సంపాదనపు లెక్కలను పెద్దలచే తనిఖీచేయబడెడివి. పంచాయితీ సభ్యులుగ స్త్రీలుకూడ కొన్ని గ్రామములలో ఎన్నకొనబడినట్లు శాసనములలోగలవు. ఎన్నికలకై గ్రామ మహాసభ సంవత్సరమున కొకసారి, అత్యవసర పరిస్థితులలో సంవత్సరము లోపుననే సమావేశమగుటయు కద్దు. గ్రామ మహాసభ జరుగు ప్రకటన, దండోరామూలమున గ్రామస్థులందరికి తెలియ జేయబడెడిది. జాతి, మత, కుల విచక్షణలేక ఎన్నికలు జరుపబడు చుండెడివి. కులాలవారీ, మతాలవారీ ప్రాతినిధ్యములేదు. గ్రామ మహాసభా సమావేశము సాధారణముగా దేవాలయమువద్దనే జరుగుచుండెడిది. దీనికి గ్రామపెద్ద లేక గ్రామపురోహితుడు అధ్యక్షత వహించి కార్యక్రమము జరిపించుచుండును.

ఈ పంచాయితీఎన్నిక ప్రజా స్వామికమైనదని చెప్పుటకు వీలులేదు. అధికారులచే నామినేషనూకాదు. మాయ మర్మము తెలియని

కాలునిచే లాటరీలోవలె పత్రములు తీయించుటచే ఇందు సాధ్యమై నంత వరకు మానవశక్తిని తగ్గించి దైవీశక్తిచే ఎన్నుకొనబడునట్లు చేయుటయే ఈ ఎన్నిక విధానములోగల ముఖ్యోద్దేశము. దీనిని 'దైవాధీనం ఎన్నిక' అనిపిలుచుట ఎంతయో తగియున్నది. సంఘ సమావేశములలో మెజారిటీ తీయవలసిన సందర్భములే కలిగి యుండవు. విషయముపై తర్జన భర్జన తీవ్రముగ జరుగునేగాని నిర్ణయము ఎప్పుడును ఏకగ్రీవముగ నుండును.

మంచి ఆహారము, మంచినీరు, మంచిగాలి గ్రామస్థులకు సమకూర్చుట గ్రామ పంచాయితీవారి ముఖ్యమగు పనులు. వ్యవసాయోత్పత్తికి వలయు అన్ని సౌకర్యములు కలుగజేసి అధికాహారోత్పత్తికితోడ్పడుచుండిరి. ఎగుమతి దిగుమతి సౌకర్యములు కలుగజేసి ప్రజలకు ఎట్టి ఇబ్బందులు కలుగకుండ చూచుచుండిరి. గ్రామములలో కలహములకు తావివ్వక ఐకమత్యముగ నుండుటకు ప్రోత్సహించుచుండిరి. ఇవి యవి యననేల గ్రామ సౌభాగ్యమునకు వలయు అన్ని ఏర్పాట్లను చేయుట పంచాయితీవారిపని. ఇప్పటివలె చట్టములు, నిబంధనలు, ఉపనిబంధనలు, అపైని జి.ఓ. లులేకున్నను సాంప్రదాయ ధర్మములను తు.చ. తప్పకుండ ఆచరించెడువారు. న్యాయవర్తన, విశాలదృష్టి, ధర్మశీలత గలవారికి చట్టములెందుకు?

వార్షికసంఘము కేవలము సలహా సంఘముగ వ్యవహరించెడిది. ఈసంఘమునందు, అనుభవము, విజ్ఞానము, కలిగిన వయోవృద్ధులు సభ్యులుగ నుందురు. అత్యంత క్లిష్టపరిస్థితులయందే ఈసంఘము వారి సలహాలు పొందపడుచుండెడివి. వీరికి నిర్దుష్టమైన పని నిర్ణయింపబడలేదు. పోర్టుఫోలియో లేని మంత్రివలె ఈసంఘము పనిచేయుచుండెడిది. వీరిసలహాలు అమూల్యములైనవిగ భావింపబడి ఆచరింప

బడెడివి. ఆర్థికసంఘమువారు పన్నులను వసూలుచేసి గ్రామ ఉమ్మడి సొమ్మును భద్రముగనుంచి ఆయా సంఘములకు కావలసిన డబ్బును పంచి జమాఖర్చు లెక్కలనుంచెదరు. డబ్బును ఏమాత్రము అన్యాక్రాంతము కాకుండ చూచుట వీరివిద్యుక్తధర్మము. ఇది కడు బాధ్యతతో కూడుకొనినపని. కొట్టుతిట్టు నేరములను విచారించి నిందితులను శిక్షించుట న్యాయ సంఘమువారివిధి. సివిల్ క్రిమినల్ అధికారములు గల కోర్టయిది. ఈకోర్టు తీర్పుకు అపీలులేదు. బాటలప్రక్కను ఖాళీస్థలములలోను చెట్లనునాటి వనములను పెంచి సంరక్షించుట వనసంఘముచేయుపని. ప్రతిపల్లెలోను సాధారణముగా ఒక పెద్ద వనముండుట మనము చూచు చున్నాము గదా! గ్రామమునకు కనీసము ఒక వనమైనను ఉండవలెనను మన పెద్దల నిర్ణయము ఎంత హర్షనీయమైనది. దీనిని బట్టి మనపెద్దలు చెట్లను నాటుటయందును వాటిని సంరక్షించుట యందును ఎంతటి శ్రద్ధ వహించి యుండిరో తేటతెల్లమగుచున్నది. ఇప్పటి ప్రజలకు చెట్లప్రయోజనము బొత్తిగా తెలియ నందుననేగదా ప్రభుత్వము వనమహోత్సవములు జరిపి ప్రబోధింవ వలసిన దుర్గతి పట్టినది. మంచినీటి వసతిని కలుగజేయుట తటాకసంఘమువారు చేరు వలసిన విధాయక కృత్యము. నూతులను, చెరువులను ఎప్పటి కప్పుడు మరమ్మతులను చేయుచు ప్రజలకు ఆరోగ్యవంతమైన నీటిని సమకూర్చుట వీరిపని. మానవునకు అత్యవసరమగు వాటిలో నొకటియగు నీటిని వీరు సరఫరా చేయవలసియున్నది. గ్రామారోగ్యము వీరిశ్రద్ధాసక్తులపై ఆధారపడియున్నది. వ్యవసాయోత్పత్తికి అన్ని సౌకర్యములను కలుగ చేయుచు క్షామము కలుగకుండ వేయి కండ్లతో చూచుచు ప్రత్యేక పరిస్థితులలో క్షామము కలిగినపుడు గ్రామస్థులందరికి తిండి దొరకు సదుపాయములు క్షామసంఘము చేయుచుండును. ఒక్కొక్క గ్రామస్థితిగతుల ననుసరించి 'ఎగుమతి దిగుమతులసంఘము' 'రాకపోకల

సంఘము' మున్నగునవి కూడ కలవని తెలియుచున్నది. ఈసంఘము లన్నియు తమ విద్యుక్త ధర్మములను సక్రమముగ నెరవేర్చుచు గ్రామాభ్యుదయమునకు సమిష్టిగ కృషిచేయు చుండెడివారు.

పంచాయితీలకు జప్తుచేయు అధికారము లుండెడివి. పన్నులు వసూలుచేసి రాజునకుచెల్లించవలసిన కప్పము వీరే చెల్లించుటయుకలదు. ఇందు వలన గ్రామ పంచాయితీలకు రాజానుమతి ఉన్నదనియే భావించవలెను.

పోరంబోకు లన్నియు గ్రామసంఘముల అధీనమందే యుండెడివి. ఉమ్మడి భూములను గ్రామమున కనవరతముసేవచేయు కమ్మరి, వడ్రంగి, అర్చకుడు, కుమ్మరి, చాకలి మున్నగు వారికి సర్వీస్ ఈనామములుగ ఇచ్చి యుండిరి. ఇవి ఇప్పటికీని గ్రామములలో నిలచి యున్నవి. దేవాలయనిర్వహణమునకు కొంతభూమిని ప్రత్యేకించెడివారు. ప్రాచీన పంచాయితీస్వరూపములు ఇప్పుడంతగా కానరాకున్నను అవిచేసినకొన్ని ప్రజోపయోగకరములగు ఏర్పాట్లు చిరస్థాయిగా నిలచియున్నవి. వీటివలన పంచాయితీ సభ్యుల పరిపాలనాదక్షత, దూరదృష్టి విదితమగుచున్నది. విద్యాభివృద్ధి కూడ ఈసంఘముల విధులలో నొకటిగ పరిగణింప బడినదియే గాని దీనికంత ప్రాముఖ్యత ఇచ్చినట్లు కనపడదు. పురాణములు, హరికథలు, బుర్రకథలు చెప్పించుచు, భాగవతములు, తోలుబొమ్మలు ఆడించుచు జన సామాన్యమును విజ్ఞానవంతులను చేయుటకు మాత్రమే వీరు ప్రయత్నించిరి. మొత్తముమీద విద్యాభివృద్ధి విషయములో సార్వజనికదృష్టి కుంటుపడినదనియే చెప్పవచ్చును. విద్యాభ్యాసముచేయుట కవకాశము కలవారికి ఉచితభోజన వసతి కలుగజేసి మాతృభాష, సంస్కృతము నేర్పబడినవి. ఉద్దండులగు పండితులు తర్కము, వ్యాకరణము, మీమాంస మున్నగు ఉన్నత విద్యయు నేర్పెడివారు. గ్రామ

దేవాలయములు కేవలము దేవదర్శనము కొరకే వినియోగింపబడక విజ్ఞానాభివృద్ధికి మూలస్థానములుగ పరిగణింపబడినవి. "దేవాలయము లేనాటిగ్రంథాలయములు" అను వాక్యములో నిజములేక పోలేదు.

ప్రాచీన పంచాయితీలు ఆర్థికముగ సౌష్ఠవముగ నుండెడివి. గ్రామసంఘమునకు ప్రభుత్వమునకు చెల్లించవలసిన కప్పము చెల్లించు షరతుపై గ్రామములోగల భూములన్నిటిపై సర్వాధికారములుకలవు. రైతునకు ఈడివరం హక్కుమాత్రమేగలదు. సక్రమముగ పన్ను చెల్లించకున్న భూమిని ఇంకొకనికి మార్చుటకు వీరికి అధికారముకలదు. కరువులు, కాటకములు సంభవించినపుడు పన్నుల రిమిషన్ఇచ్చు అసాధారణాధికారములు వీరికికలవు. సర్వీస్ ఈనాములకు పూర్తిపన్ను మినహాయింపుగలదు. పంచాయితీలు వసూలుచేసిన పన్నులవివరములివి. (1) భూమిపై పన్ను (2) వృత్తిపన్ను (3) నీటిపన్ను (4) గానుగులపై పన్ను (5) వ్యాపారములపై పన్ను మున్నగునవి. పన్నులేగాక కొన్ని రుసుములు (Fees) కూడ వీరు వసూలుచేసినట్లు తెలియుచున్నది. (1) పెండ్లిండ్లపై రుసుము. (2) చాకలిబండకు రుసుము. (3) గొర్రెల పెంపకముపై రుసుము. (4) నూనెఅమ్మకముపై రుసుము. (5) గ్రామ కావలాకై కొంతరుసుము. (6) తీర్పులకు కొంతరుసుము వసూలు చేసెడివారు. ఇదియంతయు గ్రామసంఘములకు ఆదాయమే. ప్రభుత్వ మునకు చెల్లించవలసిన ముడుపుపోను మిగిలినదంతయు పంచాయితీ ఖజానాలోచేరును. పన్నులు, రుసుములు వసూలుచేయుటకు తగిన సిబ్బందిని నియమించుటకు పంచాయితీ అధికారము కలిగియున్నది. పన్నులలోనేమి, రుసుములలోనేమి కొంతభాగముమాత్రమే రొక్కరూప మున వసూలు చేసెడివారు. ఎక్కువభాగము ధాన్యరూపముననే వసూలయ్యెడిది.

గ్రామ ఉమ్మడి స్థలములను ఈక్రిందివాటికి ప్రత్యేకించెడివారు. (1) తటాకములకు (2) దేవాలయసరస్సులకు (3) వనములకు (4) స్మశానములకు (5) పంటకాలువలకు (6) మురుగుకాలువలకు (7) బాటలకు (8) బీడులకు (9) పశునివాసస్థానములకు (10) వ్యవసాయపనిముట్ల ఉత్పత్తిదారుల వసతిగృహములకు (11) బీదల వసతిగృహములకు. ప్రాచీన గ్రామ నిర్మాణ సౌష్ఠవము వీటివలన స్పష్టపడుచున్నది. గ్రామసౌకర్యర్థగ పరిగణింపబడు పురోహితులు, వాయిద్యము వాయించువారు, నృత్యముచేయువారు, వీధిదీపములు వెలిగించువారు, ఉపాధ్యాయులు మున్నగువారికి కొంత రొక్కరూపమునను కొంత ధాన్యరూపమునను జీతము చెల్లించెడివారు. వీరిజీవనభృతికి కొంతభూమిని ఇచ్చుటయు కొన్నిగ్రామములలోగలదు. తినుటకుతిండి, కట్టుటకుగుడ్డ గ్రామస్థులందరికి అందునట్లు పంచాయితీలు అతిజాగ్రతతో కనిపెట్టుచుండెడివి.

గ్రామాభ్యుదయమునకు సమిష్టిగ కృషిచేయుచు, గ్రామనైతిక జీవనమునకొక అధినేతగ పంచాయితీలు వ్యవహరించినవి. గ్రామస్థుల మత, సాంఘిక, నైతిక పరివర్తనమును చుక్కానివలె నడపుచు ప్రసిద్ధిగాంచిన మహాసంస్థయే గ్రామపంచాయితీ. ప్రజావాణియే వీటియందు ప్రతిధ్వనించినదని చెప్పుటకు సందియములేదు. ఇట్టి గ్రామసంఘము లిపుడు నామమాత్రముగనైననులేవే?

గ్రామపంచాయితీలు స్వయంసంపూర్ణములై సర్వాధికారములు కలిగియుండెడివి. చోళరాజుల కాలములో మాత్రము వీటినిప్రభుత్వాధీనముక్రింద తీసికొని రాబడినవని తెలియుచున్నది. గ్రామసంఘములకును రాజునకును సన్నిహిత సంబంధములుకలవు. గ్రామ ఆంతరంగిక వ్యవహారములలోను, గ్రామగ్రామమునకుగల సంబంధములలోను రాజు జోక్యము కలుగజేసికొనెడి వాడుకాడు. గ్రామపరిపాలనను ప్రభుత్వో

గులు పరిశీలించుచు అక్రమములున్న ప్రభుత్వపు దృష్టికి తీసికొని వచ్చుటయు ఆందుపై తగుచర్య తీసికొనుచుండుటయు జరిగెడిది. గ్రామపంచాయితీలుకూడ ప్రభుత్వోద్యోగుల అక్రమములను ప్రభుత్వమునకు తెలుపుటయుకద్దు. రాజద్రోహులను గ్రామసంఘముల సహాయముతో ప్రభుత్వోద్యోగులే శిక్షించెడివారు.

గ్రామపంచాయితీలు మహమ్మదీయ పరిపాలనలో కొంతబలహీనములైనవని తెలియుచున్నవి. మహమ్మదీయ ప్రభువులు గ్రామసంఘ వ్యవహారములలో అంతగా జోక్యము కలుగజేసికొనకున్నను రాజ్యపరిపాలనలో గలిగిన అసాధారణ మార్పులవలన వీటికి దెబ్బతగిలినది. తరువాతవచ్చిన చోళ, పాండ్య, పల్లవ రాజులుకూడ అంతబలవంతులు కాకుండుటచే ప్రభుత్వమునందు పటిమలేని కారణమున గ్రామసంఘములు తమ విధులను సక్రమముగ నెరవేర్చలేకపోయినవి. ముఖ్యంగా 16, 17 శతాబ్దములలో ఈమార్పులు జరిగినవి. స్వార్థపరులు కొందరు ఈఅదను కనిపెట్టి గ్రామపంచాయితీలను తమస్వార్థమునకై వినియోగించుకొనిరి. బీదలను అణచుటకై గ్రామసంఘములను ఉపయోగించుకొనిరి. తమ ఆధిక్యతను నిలువబెట్టుకొనుటకై వీటినిస్వాధీనపరచుకొనిరి. ఎక్కువ తక్కువలు కల్పించి సాంఘికవ్యవస్థలను కలుషభూయిష్టము చేసిరి. న్యాయాన్యాయ విచక్షణలేని ప్రభువులగుటవలన స్వార్థపరుల చేతులలో కీలుబొమ్మలై బలహీనులను అణచివేసిరి. రాజుల అండ సంపాదించి ప్రభుత్వోద్యోగులను ఆకట్టుకొని వీరుగావించిన అక్రమములకు మేరలేదు. విద్యాజ్ఞానములేని పామరులు ఇప్పట్ల చాలకష్టములకు లోనైరి. స్వార్థపరులుకొందరు ఈసమయముననే విషపూరితమైన వాతావరణాన్ని సృష్టించగలిగిరి. ఐనను, ప్రాచీన పరిపాలనాసృష్టిలోగలపటిమ, మానవుని సహజపరిణామములోగల నైతికదృష్టి వీటిని సమూలంగా ఛేదింపలేక పోయినవి. బ్రిటిష్ ప్రభుత్వరాకతో ఇవి చాలవరకు నాశ

మైనవి. బ్రిటిష్ ప్రభుత్వముచే ప్రవేశపెట్టబడిన పరిపాలనామార్పులు వీటిని పూర్తిగా బలహీనపరచినవి. అంతరంగికపోరాటములు, శతృవుల విపరీతదాడులు, గ్రామస్థునికి ప్రభుత్వముతో సన్నిహిత సంబంధము కలుగచేసినవి. గ్రామసంఘములను ఆత్మరక్షణకై వినియోగించుకొనునట్లు ప్రభుత్వము పురికొల్పినది. గ్రామపరిపాలనకు గ్రామాధికారులను ప్రభుత్వము నియమించినది. వీరు గ్రామసంఘముల అదుపాజ్ఞలలో నుండవలసిన పనిలేకపోయినది. ప్రభుత్వముచే నెలకొల్పబడిన కోర్టులు గ్రామసంఘముల నడుగంట చేసినవి. ఇవియన్నియు గ్రామస్థులను స్వాయంసహాయముపై ఆధారపడనివ్వక, ప్రసహాయముకైనను ప్రభుత్వమునే అర్థించునట్లు చేయగలిగినవి. విద్యాభివృద్ధి వలన గలిగిన జ్ఞానోదయమువలన దినదినప్రవర్ధమానమగుచున్న వ్యక్తిస్వాతంత్ర్యేచ్ఛ గ్రామస్థునిలో ఒక వినూత్నమైన మార్పుకలిగించినది. పాశ్చాత్యనాగరికతావ్యామోహము వలన ప్రజలు పల్లెలనుండి పట్టణములకు ప్రాకజొచ్చిరి. గ్రామసమిష్టి జీవనవిధానముదీనితో నశించినది. గ్రామ వృత్తులకు తీరని దెబ్బతగిలినది. దేశస్థుని మాటకు ప్రభుత్వము లక్ష్యపెట్టలేదు. విదేశపరిపాలన, విదేశవిద్య, విదేశవ్యామోహము, విదేశతంత్రాంగము గ్రామములపై తాండవించినవి. గ్రామమును పునరుజ్జీవింపజేయుటకై ప్రయత్నములు ప్రభుత్వముచే అప్పుడప్పుడు చేయబడుచున్నవియే కాని ఇవిహృదయపూర్వకముగ జరుగలేదు. 1909 సంవత్సరములో నియమింపబడిన రాయల్ కమిషన్‌వారి "డిసెంట్రలైజేషన్‌రిపోర్టు" వెలువడిన తరువాతనే ప్రభుత్వపుదృష్టి గ్రామములపై కొద్దిగా ప్రసరింపసాగినది. ఐనను, గ్రామపంచాయితీలను పునరుద్ధరించుపని 1920 సంవత్సరములోగాని ప్రారంభముకాలేదు. అటుతరువాతనైనను పంచాయితీలఅభివృద్ధి చాలమందముగనే జరిగినది. బ్రిటిష్ పరిపాలనకు పూర్వమే గ్రామ సాంఘికవ్యవస్థ ఛిన్నాభిన్నమగుటచే దీనిని సరిచేయుట ప్రభుత్వమునకు దుస్సాధ్యమయ్యెను.

“ గాంధియన్ ప్లాను ” అను గ్రంథములో ఆచార్య అగర్వాలా గారు ప్రాచీన గ్రామపంచాయితీల నెట్లుపునరుద్ధరింపవలెనో వివరించిరి. * భారతదేశమును శాంతియు మైన, ప్రజాస్వామ్యమైన పునాదులపై పునర్నిర్మించవలెనన్న స్వయంపరిపాలనాధికారములుగల ప్రాచీన గ్రామ పంచాయితీలను నవీన పరిస్థితులకు అనుగుణ్యమగు మార్పులతో పునరుద్ధరించవలెననియు, గ్రామములను స్వయంసమృద్ధికలిగిన సహకారసంఘములుగ నిర్మాణముచేసి తద్వారా నవీనశాస్త్రము ననుసరించి వ్యవసాయాభివృద్ధి, గృహపరిశ్రమల అభివృద్ధి గావించవలెననియు, వీటివలననే దేశసంపద అభివృద్ధికాగలదనియు గాంధిమహాత్ముని ఆశయములను అగర్వాగారు వెల్లడించిరి.

---

* In order to reconstruct India on peaceful and Democratic foundations, it is desirable to establish self-Governing Village communities or Gram Panchayats as of old with necessary modifications to suit modern conditions.

By organising the villages into more or less self-sufficient Co-operative communities and by undertaking the development of agricultural and cottege industries on scientific lines, the wealth of the country can be increased and salvation of India lies there

(GANDAIAN PLAN)

# బ్రిటిష్ పరిపాలనలో గ్రామపంచాయితీలు—వాటి పరిణామము.

బ్రిటిష్ ప్రభుత్వపుదృష్టి చాలాకాలము వరకు గ్రామములపైకి ప్రసరింపలేదు. పట్టణముల అభివృద్ధికి మాత్రమే వారు కొంత వరకు కృషిచేసిరి. పల్లెలలోనున్న వారి పాట్లను చూచుచు ఉపేక్షించిరి. మన దేశంలో గ్రామస్వపరిపాలనకు బ్రిటిష్ వారు పూర్తిగా వ్యతిరేకులు కదా! గ్రామీణుల బాగోగులను విచారించుటకు వారు హృదయ పూర్వకముగా పూను కొనలేదు. ఇందుకు రాజకీయ కారణములే ప్రధానములు.

## 1863 మద్రాసు విద్యాచట్టము.

గ్రామ పంచాయితీలను స్థానిక స్వపరిపాలనకు ఉపయోగింప వచ్చునను సిద్ధాంతము 1863 సం॥ మద్రాసు విద్యాచట్టము (Madras Education Act of 1863) ద్వారా మొదటిసారి మద్రాసు ప్రభుత్వము ఆమోదించినది. ఈ చట్టము ద్వారా గ్రామసంఘములకు పన్నులను విధించి, వసూలుచేసి, ప్రాథమికపాఠశాలలను నడపుకొనుఅధికార మొసగబడినది. ప్రభుత్వము గ్రాంట్లుఇచ్చి ప్రోత్సహించుటకు అంగీక రించెను. కాని ప్రజాభిప్రాయము వ్యతిరేకముగ నున్నచో పాఠశాలలను ఎత్తివేయుటకు కూడ వీరికి అధికార మొసగబడినది. పన్నులు విధించు కొని పాఠశాలలను నడపుకొనునంతటివిజ్ఞానము ప్రజలలో అప్పట్లో లేకపోయెను. చదువు కేవలము అనవసరమని నమ్మిన రోజులవి. ఈచ ట్టము మొట్టమొదట తూర్పుగోదావరి జిల్లాలో ప్రవేశ పెట్టబడినది. కొన్నిచోట్ల "యూనియనులు" ఏర్పరుపబడినవి. ఇండ్లపన్నువిధించుకొను టకు యూనియనులకు అధికార మొసగబడినది. పంచాయితీ ఆదాయ

ములో ఎక్కువభాగము పాఠశాలా నిర్వహణమునకు వినియోగించవలసి వచ్చెను. పన్ను లిచ్చుకొనుట ప్రజలకొక భారమయ్యెను. పైగా, విద్య యందుగ్రామీణులకు అభిరుచిలేక పోయెను. అందువలన యూనియనులు మద్రాసు విద్యాచట్టముక్రింద సరిగపనిచేయలేదు. పన్నులు సరిగ వసూలు కాలేదు. పంచాయితీలలో తగినంత డబ్బులేక పాఠశాలలను మూయవలసిన పరిస్థితి ఏర్పడినది. 1870 సంవత్సరాంతమునకు అయిదు జిల్లాలలోనే ఈచట్టము అమలుచేయబడినది. ప్రారంభించిన 271 పాఠశాలలలో 101 మాత్రమే నిలిచినవి.

## 1871 లోకల్ ఫండ్ చట్టము

మద్రాసు విద్యాచట్టము ఫలప్రదము కాలేదని ప్రభుత్వము త్వరలోనే గ్రహించినది. అందువలన 1871 లో 'లోకల్ ఫండ్ చట్టము' (Local Fund Act of 1871) ప్రభుత్వముచే గావింపబడినది. ఈచట్టము ననుసరించి గ్రాంటు పాఠశాలలున్నచోట నాల్గణాలనుండి అయిదురూపాయలవరకు ఇంటిపన్ను విధించుకొనుటకు యూనియనులకు అధికారము కలిగినది. ఈపన్నుకు గ్రామస్థులు తమ తీవ్రఅసమ్మతిని వెల్లడించిరి. ప్రజల ఆందోళనాఫలితముగ ఈచట్టము ప్రభుత్వముచే 1873—74 సంవత్సరములో ఆపుచేయబడినది. యూనియనులలో డబ్బు లేకుండుటచే ప్రభుత్వమే తమ జనరల్ ఫండ్సు నుండి ఖర్చుపెట్టవలసిన దుస్థితి ఏర్పడినది.

## 1884 లోకల్ బోర్డులచట్టము

గ్రామసంఘముల స్థితిగతులను విచారించుటకై ప్రభుత్వముచే నియమింపబడిన "మద్రాసు స్థానిక స్వపరిపాలనాసంఘము" వారు పరిస్థితులను విచారించి స్థానికసంస్థలే ప్రజలలో రాజకీయ

చైతన్యము కలుగజేయగలవని తమ దృఢాభిప్రాయమును వెల్లడించుచు యూనియనుల పరిపాలనను గురించి కొన్ని సూచనలు గావించిరి. వీరి రిపోర్టును ప్రభుత్వము పరిశీలించి 1884 లోకల్ బోర్డుల చట్టము. (Local Boards Act of 1884) చేసిరి. యూనియనులను మేజరు, మైనరు పంచాయితీలుగ విభజన జరిగినది. మేజరు యూనియనులకు విద్యాభివృద్ధి, రోడ్లసౌకర్యము మున్నగుపనులను చూడమనిరి. మైనరు యూనియానులను గ్రామారోగ్యము మాత్రమే చూడమనిరి. ఈచట్ట ప్రకారము యూనియనుల సభ్యులను ప్రభుత్వమే నామినేటు చేసినది. గ్రామ మునసబుతో సహా అయిదుగురు సభ్యులతో యూనియనులు ఏర్పరుపబడినవి. యూనియనుకు గ్రామకర్ణము గుమస్తాగా నియమింప బడెను. ఇంటిపన్ను పునరుద్ధరింపబడినది. బోర్డు ఆదాయమునుండి గ్రామారోగ్యము తదితర గ్రామ సౌకర్యముల వినియోగమునకు అవ కాశ మేర్పరుపబడినది. ఈచట్టమునకు 1900 సంవత్సరములో సవరణ చట్టము గావింపబడినది. ఈసవరణ చట్టము ననుసరించి మేజరు మైనరు పంచాయితీల భేదము తొలగింపబడినది. అన్ని పంచాయితీలకు ఒకేవిధ మైన విధులు నిర్ణయింపబడినవి. కాని 20వ శతాబ్దపు ప్రారంభములో యూనియనుల నిష్ప్రయోజకత్వమును ప్రభుత్వము గుర్తించినది. ప్రభు త్వముచే నియమింపబడిన రాయల్ కమిషనువారు యూనియనులను వెంటనే రద్దుచేయవలసినదని ప్రభుత్వమునకు సిఫారసుచేసిరి. మద్రాసు రాజధానిలో 54000 గ్రామములుండ అప్పటికి 400 యూనియనులు మాత్రమే ఏర్పడినవి. అనాదినుండియు పనిచేయుచున్న గ్రామపంచా యితీలను పునరుద్ధరించిననే గాని గ్రామములు బాగుపడవని రాయల్ కమిషనువారి సూచనను ప్రభుత్వము ఆమోదించెను. 1915 సంవత్సర ములో కేంద్రప్రభుత్వము రాష్ట్రప్రభుత్వములకు ఒక తాఖీదు పంపుచు గ్రామములలో పంచాయితీలను ఏర్పాటు చేయవలసినదిగ సూచించుచు వీటికి గ్రామపరిపాలనాధికారము, న్యాయాధికారమివ్వవలసినదిగ ఆదే

శించిరి. ఈ ఆదేశానుసారము 3000 జనాభాకు పైబడిన గ్రామములలో యూనియనులను తక్కిన గ్రామములలో ఎక్స్పరిమెంటల్ పంచాయితీలు (Experimental Panchayats) ఏర్పాటు చేయుటకు ప్రయత్నములు జరిగినవి. అడవులను చూచుటకు ఫారెస్టు పంచాయితీలు ఏర్పరుపబడినవి. 1920 సంవత్సరము వరకు 572 యూనియనులు, 1000 గ్రామ పంచాయితీలు, 310 ఫారెస్టు పంచాయితీలు ఏర్పాటు చేయబడినవి. వీటినిర్వహణము తలచినంత సక్రమముగ జరుగలేదు.

## 1920 గ్రామ పంచాయితీ చట్టము.

గ్రామ పంచాయితీల చరిత్రలో 1920 సంవత్సరమునందు ఒక నూతనాధ్యాయ మేర్పడినది. 1920 గ్రామ పంచాయితీ చట్టము (The Village Panchayat Act of 1920) ప్రభుత్వముచే గావింపబడినది. పంచాయితీలను ఏర్పరిచి అభివృద్ధి గావించుటకు ఈచట్టమువలన పంచాయితీల రిజస్ట్రార్ జనరల్ నియామకము జరిగినది. గ్రామస్థుల అంగీకారముపైననే పంచాయితీలు ఏర్పరుపబడినవి. తమ గ్రామములో పంచాయితీని ఏర్పరుప వలసినదిగా ప్రభుత్వమును మహజరుద్వారా గ్రామస్థులు కోరినగాని పంచాయితీలను ప్రభుత్వము ఏర్పరచలేదు. పంచాయితీరిజస్ట్రార్ జనరల్ ఆఫీసు 1921 డిసెంబరులో ఏర్పాటుచేయ బడినది. ఈ పదవికి మొట్టమొదట బహుమేధావంతులును, అనన్యకార్యదీక్షాపరులును నగు సర్. యస్. గోపాలస్వామి అయ్యంగారిని నియమించిరి. శ్రీ అయ్యంగారు పెక్కేండ్లు ఈపదవిని నిర్వహించి తన అసాధారణ ప్రతిభా విశేషమువలన తీవ్రముగ కృషిచేసి పంచాయితీలను అనేక విధముల అభివృద్ధిజేసి గ్రామస్థులలో నూతనోత్తేజము, గ్రామపరిపాలనయందు అభిరుచి కలుగజేసి కృతార్థులైరి.

రిజస్ట్రార్ జనరల్ ఎంత కృషిచేసినను, ప్రభుత్వము పంచాయితీలపై సవతితల్లి ప్రేమ చూపుటచే, అనుకొనినంత ఫలము కలుగలేదు.

పంచాయితీల ఆర్థిక సౌష్ఠవమునకు ప్రభుత్వము తగు ప్రోత్సాహ మివ్వ లేదు. అందువలన పంచాయితీలు సరిగపనిచేయలేదు. ఆరంభ పూరత్వ ముగ చాల పంచాయితీలు ఏర్పడినవేగాని స్థానికతగాదాలవలన కలహాల ములకు నిలయములైనవి. జిల్లాలలో పంచాయితీల తనిఖీకై సరియైన సిబ్బంది ప్రభుత్వము నియమించుటకు నిరాకరించినందున పంచాయితీ లపై సరియైన అజ్మాయిషీ లేనందున పంచాయితీ పరిపాలన సక్రమంగా జరుగలేదు. పంచాయితీల నిర్మాణము మందముగనే జరిగెను. గౌరవ పంచాయితీ ఆర్గనైజర్లు పలుజిల్లాలలో పనిచేసిరి. ఇందు కొందరు ప్రశంసనీయమగు పనిచేసి ప్రజలలో నిరంతరప్రబోధము గావించి అనేక పంచాయితీలను ఏర్పాటు చేసిరి. మరికొందరు వేతనములు లేనందున ఉత్సాహముగ పనిచేయలేదు. ఈక్రింద ఆయా సంవత్సరములలో ఏర్పాటు చేయబడిన పంచాయితీల సంఖ్యలను వివరించడమైనది.

| | | | |
|---|---|---|---|
| 1924_25 | సంవత్సరమువరకు | 579 | గ్రామపంచాయితీలు |
| 1931_32 | ,, | 4474 | ,, |
| 1937_38 | ,, | 5812 | ,, |
| 1945_46 | ,, | 7237 | ,, |

పై వివరముల ప్రకారము 1920_30 మధ్యకాలములో పంచా యితీలు ఎక్కువ ఏర్పడినవని తెలియుచున్నది. పంచాయితీలకు నిర్ణ యించిన పనులలో కొన్నిటినైనను చాల పంచాయితీలు చక్కగ చేయ గలిగినవి. కొన్ని తాలూకాబోర్డులు తమక్రిందనున్న చాల పంచాయితీ లకు రోడ్లను వేసికొనుటకు అధికారమిచ్చెను. 1300 పంచాయితీ పాఠ శాలలు నెలకొల్పబడినవి. మంచినీటి వసతి కలుగజేయుటకు కొన్ని పంచాయితీలు కృషిచేసినవి. దాదాపు అన్నిపంచాయితీలు గ్రామ పారి శుద్ధ్యము విషయమై శ్రద్ధ తీసికొనినవి. పల్లపు ప్రదేశములలో పంటచే లకు నీటి వసతి చేకూర్చు పని కొన్ని పంచాయితీలు బాగుగచేసినవి.

వసములను నిర్మించి వాటిని సంరక్షించుపనిని తగు శ్రద్ధతో చేసిన పంచాయితీలు కొన్ని గలవు. ఆరోగ్యవారములు జరిపి ఆరోగ్యాభివృద్ధికై కొన్ని పంచాయితీలు ప్రబోధించినవి. ఈకాలములో పంచాయితీ ఉద్యమము అభివృద్ధి గాంచినది. పంచాయితీలు చెప్పుకోతగిన పని అప్పుడే జరిగినది. ఇందుకు పేర్కొన తగిన కారణములు మూడు. మొదటిది గ్రామ పంచాయితీ చట్టములోని నిబంధనలు పంచాయితీల అభివృద్ధికి దోహదమొనగునవియై యున్నవి. కార్యదీక్షా పరతంత్రులగు సర్. యన్. గోపాలస్వామి అయ్యంగార్, సర్. టి. విజయాదరుఘర్దవంటి రిజస్ట్రార్ జనరుల నిర్విరామకృషి రెండవది. గౌరవ ఆర్గనైజర్లలో కొందరు గావించిన ప్రశంసనీయమగు ప్రబోధము మూడవది. మొత్తముపై 1920—30 మధ్యాకాలములో పంచాయితీలు ప్రజోప యోగకరములగు పనులచేసినట్లు ప్రభుత్వ నివేదికలు తెలుపు చున్నవి.

కాని, పంచాయితీల ఆర్థిక సౌష్ఠవమునకు నిర్దిష్టమగు మార్గములను తెలపకుండుట గ్రామ పంచాయితీ చట్టములోని ముఖ్యలోపము. పన్నులను విధించుకొనుట పంచాయితీల ఇష్టానిష్టములకు వదలిరి. అందువలన చాల పంచాయితీలు పన్నులను విధించుకొనుటకు నిరాకరించినవి. చట్టప్రకారము బలవంతమునకు తావులేకుండుటచే ప్రభుత్వ మేమియు చేయలేకుండెను. పంచాయితీలకు ముఖ్య ఆదాయమగు గ్రామ ఉమ్మడి పాటలవలన వచ్చు ఆదాయము స్వల్పముగనే యుండెను. గవర్న మెంటు ఇచ్చు గ్రాంట్లు లేకుండెను. స్థానికముగ విరాళములు ఇచ్చువారే కనపడకుండెను. ఎటు చూచినను పంచాయితీ ఆర్థికాభివృద్ధికి తగు సదుపాయములు లేకుండెను. కొన్ని పంచాయితీలు ఐచ్ఛికముగ పన్నులు విధించుకొని ప్రభుత్వానుమతికి వ్రాసికొనిన సందర్భములును లేకపోలేదు. వీటిని వ్రేళ్ళపై లెక్కిడవచ్చును.

పంచాయితీ ఆదాయము ఈక్రిందిరుసుములవలనను వచ్చుచుండె డిది. (1) వివాహములపై రుసుము (2) ధాన్యపుబండ్లపై రుసుము (3) మిల్లుల మీదరుసుము. (4) మార్కెటురుసుము. (5) తాత్కాలిక కట్టడములపై రుసుము. ప్రజలలో విజ్ఞానమంతగా లేకుండుటచే పన్నుల వసూళ్ళకు కొన్నిచోట్ల కఠినపద్ధతులు అవలంబింపక తప్పినదికాదు. భూమిపన్నులో కొంతభాగము పంచాయితీల కివ్వవలెనని చట్టము నిర్దే శించినను అదిపంచాయితీలకు ప్రభుత్వముచే సరిగ జమకట్ట బడలేదు బలవంతముగ పన్నులు వసూలుచేయుట పంచాయితీలకు ఇష్టమైన పని కాదుకదా! పన్నులు వసూలుచేయుపని గ్రామ మునసబుదగుటచే, కఠి నపద్ధతుల నుపయోగించి వసూలుచేయుటకు ఆయన సాధ్యమైనంతవరకు తప్పించుకొనుచునే యుండెను. అందువలన పంచాయితీల అదాయములో స్థిరత్వములేకపోయినది.

1928 సంవత్సరాంతమునకు రాష్ట్రములో 3000 పంచాయితీలు పనిచేయుటచే రిజిష్ట్రార్ జనరలుకు పని ఎక్కువగుటచే పంచాయితీలపై పెత్తనం జిల్లాకలెక్టర్లకు అప్పచెప్పబడినది. 1930 సంవత్సరములో పై చట్టమునకు సవరణగావింపబడినది. ఈసవరణవలన 'యూనియన్' పదము రద్దుగావింపబడినది. అన్నియు 'పంచాయితీలు'గానే పిలువబడెను. పంచా యితీ సభ్యులసంఖ్య 8నుండి 16వరకు పెంచిరి. మైనారిటీ వర్గములకు ప్రత్యేక ప్రాతినిధ్యమిచ్చిరి. ఇదివరకంటె ఎక్కువమందికి ఓటుచేయు అవ కాశమొసగబడినది. రిజిష్ట్రార్ జనరల్ పదవి రద్దుచేయబడినది. పంచా యితీలను లోకల్‌బోర్డుల ఇన్స్పెక్టరు, జిల్లాబోర్డుల ద్వంద్వపరిపాలన క్రిందికి తీసుకొనిరాబడినవి. పంచాయితీల అభివృద్ధినిబట్టి జిల్లాపంచాయితీ ఆఫీసర్లను, అసిస్టెంటు పంచాయితీ ఆఫీసర్ల నియామకముజరిగినది. 1/6 వంతు భూమిపన్నును పంచాయితీలకిచ్చుటకు అంగీకరింపబడినది. 1934 సంవత్సరములో తాలూకాబోర్డులు రద్దుగావింపబడినవి. మేజరు పంచా

యితీలలో ఇంటిపన్ను, వృత్తిపన్ను విధించవలెనని ప్రభుత్వము సూచించినది. అవకాశముకొద్దీ, ఇతరపన్నులనుకూడ విధించుకొనుటకు అవకాశమివ్వబడినది. ఈమార్పులవలన ఆంగ్లదేశములోని స్థానికసంస్థలవలె మన పంచాయితీలు తయారగుటకు అవకాశము కల్పింపబడినది. ఆరోగ్యము, పారిశుద్ధ్యము, నీటివసతి, మరుగుకాలవల నిర్మాణము, విద్యాభివృద్ధి, దీపములను వెలిగించుట, గ్రంధాలయములు, రేడియోలు స్థాపించుట మున్నగుపనులలో పంచాయితీలు శ్రద్ధచూపసాగినవి. పంచాయితీలకు మార్కెట్లపై కంట్రోలు, కార్టుస్టాండు, పశువధశాల మున్నగువాటిపై అధికారము ఇవ్వబడినవి. పంచాయితీలు దినదినాభివృద్ధి గాంచుటకు అవకాశమేర్పడినది.

## 1930 తరువాత పంచాయితీల స్థితిగతులు

లోకల్ బోర్డుల ఇన్స్పెక్టరుకు పంచాయితీలు అప్పచెప్పబడిన తరువాత పంచాయితీలు తగినంత అభివృద్ధికాలేదు. ఈఅధికారికి రాష్ట్రములోగల జిల్లాబోర్డులను, మునిసిపాలిటీలను చూచుటయేగాక వేల సంఖ్యలోగలపంచాయితీల పరిపాలనను పరిశీలించుటకష్టసాధ్యమయ్యెను. ఇవియన్నియు ఇన్స్పెక్టరుకుబహుళకార్యభారము కలుగజేసినవి. పైగా, పంచాయితీలపై జిల్లాబోర్డుల పెత్తనంపీటని కుదించగతీసినవి. ద్వంద్వపరిపాలన ఏరూపములోనున్నను అనర్ధదాయకముకదా! పంచాయితీ ఆఫీసర్లు జిల్లాబోర్డుల క్రిందఉండునట్లు చేయబడినది. పంచాయితీ ఆఫీసర్లు జిల్లాబోర్డుల రాజకీయములలో నలిగి ఎక్కువ పనిచేయ లేకపోయిరి. పైగా, అప్పట్లో వీరికి ఎలక్షనులు జరుపుపనియే ఎక్కువ అప్పచెప్పిరి. సరియైన అజ్మాయిషీలేనందున గ్రామపంచాయితీలలో అనక తవక పరిపాలన ఎక్కువైనది. పంచాయితీ ద్రవ్యదుర్వినియోగము, ద్రవ్యాపహారణము కొన్ని పంచాయితీలలో జరిగినవి. ప్రభుత్వము ఈపరిస్థితులను విచారించి కొందరు ప్రెసిడెంట్లను పదవీ భ్రష్టులను గావించిరి. కొన్ని

బోర్డులను రద్దుగావించిరి. నిర్మాణాత్మకమగు పనికన్న, విచారించి పర్య వేసికొనుపనియే ఇన్స్పెక్టరుకు సరిపోయెడిది. 1937 సంవత్సరములో రాష్ట్రీయ స్వాతంత్ర్యము సిద్ధించగనే పంచాయితీ ఉద్యమమునకు నూత నోత్తేజము కలిగించుటకు ప్రయత్నములు జరిగినవి. ఆంధ్రకేసరి శ్రీ ప్రకాశంపంతులుగారిచే పంచాయితీలను గ్రామ సర్వస్వతంత్రసంస్థలు (Villege Republics)గా చేయుటకు ఒక బిల్లు తయారు చేయబడినది. కాని, రెండవ యుద్ధమేఘచ్ఛాయలు ఆవరించగనే కాంగ్రెసు ప్రభుత్వ ము వైదొలకుటయు అడ్వైజర్ల ప్రభుత్వము పునః అవతరించుటచే ఈబిల్లు బుట్టదాఖలుచేయబడినది. పంచాయితీల పునరుద్ధరణకై అడ్వై జర్లప్రభుత్వము, వారిదృష్ట్యా, కొంత కృషి జరిగినది. ఆంధ్రకేసరిబిల్లు ఆచరణయోగ్యం కాదని వారుతలచిరి. అడ్వైజర్ల ప్రభుత్వము 1941 సంవత్సరములో ఒకబిల్లును ప్రజాభిప్రాయము కొరకు ప్రకటించిరి. ఈ బిల్లులోని ముఖ్యాంశములివి.

(1) పంచాయితీలలో గ్రామమునసబును ఎక్సాఫీషియో సభ్యునిగా నియమించి పంచాయితీ అధ్యక్షుడగుటకు కూడ అవకాశము కల్పింపబడినది.

(2) మేజరుపంచాయితీలకు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ల నియామకమును, మైనర్ పంచాయితీలకు గ్రామకర్ణములనే గౌరవ కార్యనిర్వాహణాధికారులుగ వ్యవహరింపచేయుటకు తలపెట్టబడినది.

(3) జిల్లాలలోగల పంచాయితీలను జిల్లాకలెక్టర్లపూర్తి అధికారము క్రింద చేర్చబడినవి. పంచాయితీలన్నిటిని రెవెన్యూబోర్డు పర్యవేక్షణక్రింద ఉంచుటకు నిర్ణయించిరి.

(4) ఇంటిపన్ను ప్రతిపంచాయితీ విధిగా విధించుకొనవలెనని ఆదేశించిరి.

(5) భూమిపన్నులో పంచాయితీలకై అదనముగా రూపాయకు ఒకపైసా విధించుటకు ఏర్పాటు చేయబడినది.

(6) నామినేటు చేయబడిన సభ్యులతో కూడిన పంచాయితీలను ఏర్పాటు చేయుటకు ఉద్దేశింపబడినది.

ఈబిల్లుపై ప్రజలలో తీవ్రమగు అసమ్మతి బయలుదేరినది. ఇది గమనించి అడ్వైజర్ల ప్రభుత్వము ప్రముఖులతో కూడుకొనిన ఒకసలహా సంఘమును నియమించి బిల్లుపై వారి అభిప్రాయములను తెలిసికొనిరి. సలహాసంఘము బిల్లులో ఈక్రింది మార్పులు చేయుటకు సిఫారసు గావించినది.

(1) జిల్లాకలెక్టరుకు పంచాయితీలపై ఎట్టి అధికారము ఉండకూడదు.

(2) పంచాయితీలపై రెవెన్యూబోర్డుకు ఎట్టి కంట్రోలు ఉండకూడదు. పంచాయితీలపై అధికారిగ పంచాయితీ రిజిస్ట్రార్ జనరల్‌ను నియమించవలెనని సూచించిరి.

(3) అయిదు సంవత్సరములలో ప్రతి గ్రామమునకు ఒకపంచాయితీ ఏర్పడుటకు అన్ని ప్రయత్నములు చేయవలెను.

(4) గ్రామాధికార్లకు పంచాయితీలలో ఎట్టి స్థానము ఉండరాదనియు అత్యవసర పరిస్థితులలో మాత్రమే గ్రామ మునసబు తాత్కాలిక అధ్యక్షుడుగ వ్యవహరించ వచ్చునని అంగీకరింపబడినది.

(5) 21 సంవత్సరములకు పైబడిన ప్రతిస్త్రీ, పురుషునికి ఓటింగు హక్కు ఉండవలెను. అన్ని పంచాయితీలలో బాలట్ పద్ధతినే ఓటింగు జరుగవలెను.

(6) 5000– రూ పైబడిన ఆదాయము కలిగిన పంచాయితీబోర్డులకే పూర్తికాలము పనిచేయు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లను నియమించవలెను.

(7) ఇండ్లపన్ను, బండ్లపన్ను ప్రతిపంచాయితీ విధించి తీరవలెను. భూమిపన్నుపై ఇంకొకపైసా విధించుకొనుట పంచాయితీల ఇష్టానిష్టములకు వదల బడినది.

(8) నామినేటెడ్ పంచాయితీలే ఉండకూడదు.

ఈసూచనలన్నియు మద్రాసు ప్రభుత్వము పరిశీలించి బిల్లును తాత్కాలికముగ నిలుపుదలచేసిరి. ప్రస్తుతమున్న లోకల్‌బోర్డుల చట్టమును సవరించి గవర్నమెంటు వారిచే నోటిపై చేయబడిన పంచాయితీలకు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లను నియమించుటకు ఏర్పాటు చేయబడినది. 1944 సంవత్సరములో కొన్ని పంచాయితీలకు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లను ప్రభుత్వము నియమించినది. తరువాత 1946 ఏప్రియల్ నెలలో గ్రామపంచాయితీచట్టము (Village Panchayat Act. of 1946) ప్రభుత్వము ప్రకటించినది. ఈచట్టములో జిల్లా కలెక్టరుకు పంచాయితీలపై పూర్తిఅధికారము ఉంచబడినది. కాని, రెవెన్యూబోర్డుస్థానే పంచాయితీల రిజిస్ట్రారుజనరల్‌ను నియమించుటకు ఏర్పాటు జరిగినది, గ్రామమునసబు పంచాయితీ ఎక్సఆఫీషియో మెంబరుగా ఉండుటకు అంగీకరింపబడినది. గాని గ్రామకర్ణమును పంచాయితీ కార్యనిర్వహణాధికారిగ నియమించుట తొలగింపబడినది. ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ల నియామకమిందు చేర్చబడినది. ఈచట్టము అమలు పరచక యేఅడ్వైజర్ల ప్రభుత్వము అంతరించినది.

## పంచాయితీల ప్రస్తుతస్థితి.

పంచాయితీలు రాష్ట్రములో అన్నిజిల్లాలలోను గలవు. నార్త్ ఆర్కాటు, సేలమ్, తంజావూరు, చెంగల్‌పట్, రామ్నాడ్, చిత్తూరు, పశ్చిమగోదావరి, గుంటూరు జిల్లాలలో పంచాయితీలు ఎక్కువగాకలవు. పంచాయితీలను మేజరు మైనరుపంచాయితీలుగ విభజించుట జరిగినది. లక్షకుపైబడిన ఆదాయముగల కొన్ని పంచాయితీలు గలవు, రాజధానియందంతటను దాదాపు 7200 పంచాయితీలు గలవు ఇందులో 4000వరకు మైనరుపంచాయితీలు. 1939—45 మధ్యలోపంచాయితీలను గురించిన ఈక్రింది స్టేటుమెంటు పంచాయితీల స్థితిగతులను కొంతవరకు తెలుపుచున్నది. దీనివలన ఎన్నిపంచాయితీలు సరిగాపనిచేయనందున

రద్దుగాబడినవో, ఎందరు ప్రెసిడెంట్లు సరిగా పనిచేయనందున తీసివేయబడిరో ఎన్ని పంచాయితీలు అక్రమపరిపాలనకు సూపర్ సీడ్ కాబడినవో, వివరముగ తెలియుచున్నది.

1939—45 మధ్య పంచాయితీలు

| సంవత్సరము | క్రొత్తగా నెలకొల్పబడినపంచాయితీలు | రద్దుచేయబడినపంచాయితీలు | రద్దుచేయబడి తిరిగినిర్మింపబడిన పంచాయితీలు | సూపర్ సీడ్ కాబడిన పంచాయితీలు | పదవీభ్రష్టులను గావింపబడిన అధ్యక్షుల సంఖ్య | పనిచేయుచున్న పంచాయితీలు |
|---|---|---|---|---|---|---|
| 1939 | 195 | 32 | 7 | 37 | 17 | 6614 |
| 1940 | 181 | 28 | 6 | 67 | 29 | 6767 |
| 1941 | 18 | 53 | 7 | 17 | 50 | 6732 |
| 1942 | 14 | 46 | — | 12 | — | 6672 |
| 1943 | 15 | 28 | — | 48 | — | 6660 |
| 1944 | 31 | 15 | — | 12 | — | 7084 |
| 1945 | 72 | 28 | 15 | 22 | 46 | 7129 |

జిల్లా మ్యునిసిపల్ చట్టములోని కొన్ని సెక్షనులు పంచాయితీలకు కూడ అనువర్తింప చేయబడినవి. పి. పి. ఆర్. చట్టము, పబ్లిక్ హెల్త్ చట్టము, టౌన్ ప్లానింగ్ చట్టము కొన్నిపంచాయితీలలో అమలులో నుంచబడినవి. ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ల నియామకము పంచాయితీల సక్రమనిర్వహణమునకు ఎక్కువ తోడ్పడినవని ప్రభుత్వ నివేదికలు తెలుపుచున్నవి.

రాష్ట్ర విస్తీర్ణతనుబట్టి చూడ ఇప్పుడున్న పంచాయితీల సంఖ్య చాలస్వల్పమని చెప్పవలెను. కొన్నిజిల్లాలలో ఎక్కువపంచాయితీలు

మరికొన్నిట తక్కినపంచాయితీలు కలవు. ఆర్థిక సౌష్టవము సరిగ లేక కొన్నిపంచాయితీలు చక్కగ పనిచేయుటలేదు. మొత్తముపై ఇంతవరకు సర్వతోముఖాభివృద్ధి చెందలేకపోయినవి. పంచాయితీ సభ్యులలో చాల మంది ఎక్కువ విజ్ఞానవంతులు కాకుండుటచే సక్రమపాలనకు తోడ్పాటు లేకుండిరి. పార్టీకక్షలు, కులతత్వములు వీటినిర్వాహణమునకు అడ్డుతగులు చున్నవి. పరిపాలనానుభవము, దూరదృష్టి, ప్రజాసేవాభిలాష నిర్వాహకులలో కుంటుపడుటచే ఇవిచేయతగినంత పనిచేయలేక పోవుచున్నవి. 1950 గ్రామపంచాయితీచట్టము పంచాయితీలలో నూతనోత్తేజము కలిగించి గ్రామాభ్యుదయమునకు తోడ్పడగలదని ఆశింపబడుచున్నది.

# 1949 గ్రామపంచాయితీ బిల్లు - శాసనసభలలో చర్చ.

రాష్ట్రములో ప్రజాప్రభుత్వ మవతరించగనే గ్రామములను సౌభాగ్యవంతముగ చేయుటకు కృషిప్రారంభింపబడినది. గ్రామములను పునర్నిర్మింప వలసిన ఆవశ్యకతను సేవా గ్రామమునుండి బాపూజీ తెలియజేయుచు రాష్ట్రప్రభుత్వములకు సూచనలందజేసియుండెను. అప్పటి వర్కు ప్రభుత్వముచే గావింపబడిన 1946 గ్రామ పంచాయితీ చట్టము నిరుపయోగమని త్రోసివేయబడినది. స్థానికశాఖామాత్యులగు గౌరవనీయులు శ్రీకల్లూరి చంద్రమౌళిగారు సమగ్రమగు పంచాయితీ శాసనము గావించుటకై నిరంతరము కృషిచేసిరి. తత్ఫలితముగ 1949 జూన్‌లో గ్రామపంచాయితీ బిల్లు ప్రభుత్వముచే ప్రకటింప బడినది.

## బిల్లు ప్రకటనకు ప్రభుత్వోద్దేశములు.

పంచాయితీబిల్లును ప్రకటించుచు ప్రభుత్వము యీబిల్లుగావింపవలసిన ఆవశ్యకతను వివరించు స్టేటుమెంటు తెలిసికొనతగినది. సారాంశమిది.

ప్రస్తుతము ఈరాష్ట్రములో 7200 గ్రామపంచాయితీలుగలవు. ఈపంచాయితీలజూరిస్‌డిక్షన్‌లోకి వచ్చెప్రజానీకముకోటిమంది. మద్రాసు స్థానికసంస్థల చట్టము ప్రధానముగా జిల్లాబోర్డులకు సంబంధించినది. ఐనను, గ్రామ పంచాయితీలకు కూడ దీనిని అనువర్తింప జేయబడినది. జిల్లాబోర్డుల, వాటి అధ్యక్షుల కంట్రోలులో గ్రామపంచాయితీలుఉండాలని ఈచట్టము నిర్దేశించుచున్నది. పరిపాలనకు సంబంధించిన అతిముఖ్య విషయములలో మాత్రమేగాక పంచాయితీల దైనందిన కార్యకలాపములో పాల్గొనుటకు గూడ ఈచట్టమువల్ల జిల్లాబోర్డులకు అధికారము

సంక్రమించినది. ఉదాహరణకు ఒక మార్కెట్టుగాని, ఒక కబేళాగాని నెలకొల్పవలెనన్న, మూసివేయవలెనన్న జిల్లాబోర్డు అనుమతిలేనిది పంచాయితీ చేయుటకు వీలులేదు. ప్రతి గ్రామపంచాయితీ బడ్జెట్టు జిల్లాబోర్డు ఆమోదించినగాని అమలుపరచుటకు వీలులేదు. క్రొత్తపన్ను లను విధించుటకు జిల్లాబోర్డుసమ్మతి అవసరము. వాస్తవమువిచారించిన గ్రామపంచాయితీలలో స్వయం నిర్ణయాధికారము, స్వాతంత్రత మృగ్య మైనది.

అసలు పంచాయితీలు నిర్వర్తించవలసిన విధులు కార్యభారము తో కూడుకొనునట్టివి కావు. కొన్ని పంచాయితీలు వాటినే సంతృప్తికర ముగా నిర్వర్తించలేకపోయినవి. పన్నులు విధించితీరవలెనన్న నిర్బంధ ములేనందున చాల పంచాయితీలు పన్నులు విధించుకొనుటకు సుతా రాము అంగీకరించలేదు. మద్రాసు స్థానిక సంస్థలచట్టము ప్రకారము గ్రామములో వసూలైన భూమిపన్నులో కొద్దిభాగము మాత్రమే పంచాయితీలకు చెందు చుండుటవలన పంచాయితీలకుఆదాయము బహు స్వల్పమయ్యెను. ఆర్థిక సౌష్టవము లేకుండుటచే పరిపాలన కుంటుపడ జొచ్చినది. రాకపోకలకు అనువైన రోడ్లను నిర్మించుట, వీధులనుపరిశు భ్రముగ నుంచుట, త్రాగుటకు మంచినీరు సరఫరా చేయుట మున్నగు అత్యవసరమగు సౌకర్యములనైనను పంచాయితీలు సమకూర్చలేకున్నవి. ఈనాడు గ్రామపరిపాలనను సాగించుచున్న పంచాయితీలు పరిమితాధి కారములు మాత్రమే కలిగి, పరిమిత ప్రయోజనములను మాత్రమే చేకూర్చ గలుగుచున్నవి. సాలుకు 3000 రూపాయలు కాని అంతకు పైబడికాని ఆదాయముగల పంచాయితీలకు కార్య నిర్వహణాధికారులు [ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లు] నియమింపబడిరి. అట్టి పంచాయితీలలో కొంత పని సాగుచున్నదికూడా. కాని, చిన్నచిన్న పంచాయితీలు మాత్రము ప్రస్తుత పరిస్థితులలో ప్రజోపయోగకరమైన కార్యమొకదానిని కూడ

నిర్వర్తించలేకపోవుచున్నవి మద్రాసు స్థానిక సంస్థలచట్టము పంచాయితీలకు వర్తించకుండ గ్రామపంచాయితీలకు ప్రత్యేక చట్టము నిర్మించు విషయము 1940 నుండి మద్రాసు ప్రభుత్వము ఆలోచించుచున్నది. అడ్వైజర్ల ప్రభుత్వము సిద్ధపరచిన పంచాయితీ బిల్లు 1941లో ప్రజాభిప్రాయార్థము ప్రకటింపబడినది. స్థానికసంస్థల పరిపాలనలో అనుభవముగల ప్రతినిధులతో కూడిన ఒక సంఘము ఈబిల్లును పరిశీలించిన మీదట 1946లో ఇది చట్టమైనది. కానిదీనిని అమలుపరచు బాధ్యత నూతన మంత్రివర్గమునకు వదలిపెట్టబడినది. స్థానిక పరిపాలనా వ్యవస్థకు పంచాయితీలనే ప్రాతిపదికగా గ్రహించలేదనియు, పరిపాలనలో అధికారుల అనవసరజోక్యమునకు అవకాశమున్నదనియు మున్నగు కారణములను పురస్కరించుకొని ఈబిల్లు సమగ్రముగా లేదని ప్రజా మంత్రివర్గము భావించినది. గ్రామపంచాయితీలు ఇతరుల జోక్యములేని పరిపాలనాదక్షతగల సంస్థలుగా నెలకొల్పగల ఒక చట్టము అవసరమని భావింపబడినది. ఇతరుల పెత్తనములేని, స్వయంనిర్ణయాధికారముగల సంస్థలుగా ఉండవలెను. ఈ అభిప్రాయమే స్థానిక సంస్థల మంత్రి సిద్ధపరచిన గమనికలో సూచింపబడినది. ఈగమనికను స్థానికసంస్థలమంత్రి, పబ్లిక్‌వర్క్సుమంత్రి, ఆర్థికమంత్రి, ప్రజారోగ్యమంత్రి, మద్యనిషేధశాఖలమంత్రులు సభ్యులుగా ఉన్న ఒకఉపసంఘము పరిశీలించినది. ఈఉపసంఘము సిద్ధపరచిన నివేదికను మంత్రివర్గము పరిశీలించి ఆమోదించిన మీదట ఈక్రింది నిర్ణయములు చేయబడినవి.

నూతనగ్రామపంచాయితీ బిల్లుసిద్ధపరచుటకును, ప్రజాభిప్రాయ సేకరణ తర్వాత శాసనసభా సమావేశములో ప్రతిపాదించుటకును నిశ్చయింపబడినది.

స్వయంసంపూర్ణమై, స్వయంపాలకమైన స్థానిక వ్యవస్థలుగా గ్రామపంచాయితీలను అభివృద్ధిపరచి, గ్రామములోని ఆర్థికవిధానమునకు

సంబంధించిన సకలవిషయములలోను స్వాతంత్ర్యాధికారములనుసంక్రమింప జేయుటయే ఈబిల్లుఉద్దేశ్యము. పంచాయితీపరిపాలన సామర్థ్యముతో కొనసాగుటకును, ఇతరుల అజ్మాయిషీ సాధ్యమైనంతవరకు తగ్గించుటకును ఈ బిల్లు లక్ష్యము.

'ప్రతిపల్లెకు ఒకపంచాయితీ' నిర్మింపబడవలెను. 500లేక అంతకన్న ఎక్కువ జనాభాకలిగిన ప్రతిగ్రామమునకు ఒకపంచాయితీ నెలకొల్పబడును. అంతకుతక్కువ జనాభాగల గ్రామములను కొన్నింటిని చేర్చి ఒక పంచాయితీ ఏర్పాటు చేయబడును. పంచాయితీలు తప్పని సరిగ నెలకొల్పబడును స్థానికాధికారులు లేక గ్రామప్రజల ఇష్టానిష్టములతో నిమిత్తము లేదు. బిల్లు చట్టంగామారి పొందిన రెండేండ్లలోగా రాజధానియందంతటను పంచాయితీల నిర్మాణము పూర్తికాగలదని భావింపబడుచున్నది. 5 వేలు అంతకు మించిన జనాభాగల గ్రామములలో పంచాయితీలను మొదటి తరగతి పంచాయితీలుగా వ్యవహరింపబడును. ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లను నియమించే అధికారము ప్రభుత్వానికే ఉంటుంది.

రహస్యపు బాలెట్ ద్వారా ఎన్నుకొనబడే ప్రజాప్రతినిధులే పంచాయితీలలో సభ్యత్వం వహించెదరు, ఎన్నికల నిమిత్తము అవసరమైన, గ్రామమును కొన్ని వార్డులుగా విభజింపబడును. గ్రామమునసబు పంచాయితీలలో ఎక్స్—అఫీషియో సభ్యుడుగా ఉండును. కాని ఆయనకు మీటింగులో ఓటుచేసే అధికారములేదు. పంచాయితీకి ఎన్నుకొనబడిన సభ్యులుగాక వోటింగు అధికారముగల గ్రామప్రజలందరును కలసి అధ్యక్షుని ఎన్నుకొనెదరు. కుల, మత వర్గాలకు పంచాయితీలలో ప్రత్యేకస్థానములుండవు. ప్రస్తుతమునకు రాష్ట్రశాసనసభల ఓటర్లే పంచాయితీల ఎన్నికలలో ఓటుచేయుట కర్హులు. పంచాయితీలలో నామినేషన్లకిక తావులేదు. పంచాయితీ వైస్ ప్రెసిడెంటును పంచాయితీ సభ్యులెన్నుకొనెదరు. పంచాయితీ తీర్మానాలన్నిటిని అసలు జరుప వలసిన

ప్రాచి పంచాయితీ అధ్యక్షునిది. ఏతీర్మానమైనను ఆచరణయోగ్యం కాదని తోచిన ప్రభుత్వానికి తెలిపి వారి నిర్ణయప్రకారము నడచుకొన వలెను. ఈ ప్రభుత్వ నిర్ణయమునకు అధ్యక్షుడు, బోర్డు కట్టుబడి యుండ వలెను.

ప్రత్యేకపరిస్థితులలో పంచాయితీబోర్డులను రద్దుచేయటానికిని, పంచాయితీ ధనమును దుర్వినియోగపరచినను లేక అధ్యక్షుడుగా తన అధికారములను దుర్వినియోగపరచినను అధ్యక్షుని తొలగించుటకు ఈ బిల్లు ననుసరించి అధికారము ప్రభుత్వమునకు సంక్రమించుచున్నది. ఈ విధముగ బర్తరఫ్ చేయబడిన అధ్యక్షుడు ఒకఏడాదివరకు ఎన్నికలలో నిలువకూడదు. ఒకవేళ అధ్యక్షుడు కోర్టులో అవినీతికి శిక్షబడినట్లయిన అయిదు సంవత్సరములవరకు ఎన్నికలలో అభ్యర్థిగా నిలువకూడదు.

అధ్యక్షుడు తనకిష్టమైన అధికారములను ఉపాధ్యక్షునకు సంక్రమింపజేయవచ్చును. అధ్యక్షుడు ఏపనిమీదనైనను పదిహేనురోజులకు పైబడి గ్రామాంతరములలో ఉండవలసివచ్చిన అయన అధికారము లన్నియు ఉపాధ్యక్షునకు సంక్రమించును.

## పంచాయితీ నిర్వర్తించవలసిన విధులివి

(1) గ్రామములో రోడ్లను వేయించుట, వాటిని మరమ్మతు చేయించుట, రోడ్లలో ఉన్నవంతెనల, తూముల నిర్మాణము.

(2) రహదారులలోను, బహిరంగస్థలములలోను దీపముల ఏర్పాటు చేయుట.

(3) మురుగునీటికాలువల నిర్మాణము, మురుగునీటిని, మురికిని తొలగించుట.

(4) పారిశుధ్ధ్యము :— గ్రామవీధులను ఊడ్పించుట, గ్రామ ప్రజోపయోగార్థమై పాయిఖానా దొడ్లను నిర్మించుట, అన్నివరుగు దొడ్లను ఊడ్పించుట.

(5) శవఖననానికి, శవదహానానికి ఉపయోగపడు శ్మశానవాటికలను నెలకొల్పి వాటిని జాగ్రత్తగా కాపాడుట.

(6) మంచినీటి వసతిని ఏర్పాటుచేయుట. నూతులను త్రవ్వించుట, గుడ్డలను ఉతుకు కొనుటకు చెరువులను త్రవ్వించుట, మంచినీటి సరఫరాకు వాటర్‌వర్క్సును స్థాపించుట.

(7) రోగనివారణకు, చికిత్సకు తగుచర్యలను తీసికొనుట.

పంచాయితీలకు ఈక్రింది అధికారములు కూడ ఉండును:—

(1) సివిల్ క్రిమినల్ కేసులువిచారణ:— సివిల్ క్రిమినల్ వ్యవహారములలో విలేజి కోర్టుల చట్టరీత్యా ప్రస్తుతము గ్రామీణన్యాయస్థానములకు ఉన్నవాటికంటెను గ్రామ పంచాయితీలకు అధికతరంగా అధికారము లొసగబడగలవు.

(2) దస్తావేజుల రిజిష్ట్రేషన్:— రిజిస్ట్రాఫీసులులేని ఒకటవ తరగతి పంచాయితీలుగల గ్రామాదులలో ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లకు నూరు రూపాయల కిమ్మత్తుకు మించని ఆస్తులకు సంబంధించిన దస్తావేజులను, స్టాంపుడ్యూటీ, ఫీజ్ అవసరములేని దస్తావేజులను రిజిస్టర్ చేయుటకు అధికారమివ్వబడును.

(3) ఇరిగేషన్‌వర్క్సు:—గ్రామములోగల నీటిపారుదల సాధనాలు, కాలువలు మున్నగువాటికి చిన్నచిన్న మరమ్మతులుచేయించుట, పంచాయితీల విధులలో ఒకటిగా పరిగణింపబడును. ఈసందర్భములో ఇరిగేషన్ సలహా సంఘములు పనిచేస్తున్న గ్రామములలో ఆగ్రామముల పంచాయితీలే సలహాసంఘముల విధులను

నిర్వహించును. అవసరమైనప్పుడు మున్ముందు రానున్న మరమ్మ తులను చేయించుటకయే ఖర్చులనిమిత్తము ఎకరమునకు నాలుగు మొదలు ఎనిమిది అణాలవరకు పన్నులు వసూలుచేసికొను అధి కారము పంచాయితీల కివ్వబడును.

(4) ధర్మసంస్థలనిర్వహణ:— గ్రామమునకుచెందిన ధర్మసంస్థలన్నిటి నిర్వహణాధికారము పంచాయితీలకు అప్పగించబడును.

(5) విద్యాభివృద్ధి:— ఇతరపాఠశాలలులేని చోట పంచాయితీలే ప్రాథ మిక పాఠశాలలను స్థాపించుటకును, నిర్వహించుటకును అనుమ తించబడును. ఇందుకు ప్రభుత్వమునుండి గ్రాంటులు పొందుటకు అర్హత గలిగియుండును.

(6) గ్రామములో సాముదాయకముగ ఉపయోగించు నాన్‌రెజర్వు భూములు, మేతబయళ్లు, నూర్పిడికళ్లాలు, తోపులు, పోరంబో కులు పంచాయితీ అధీనములో నుండును. ఈమధ్యపంచాయితీల స్వాధీనమునుండి తప్పించి పారెస్టుశాఖకు స్వాధీనముచేసిన రిజర్వు అడవులనుకూడ ఆయాపంచాయితీలు కోరినప్పుడు, తగినసామర్థ్య మున్నదని ప్రభుత్వముభావించిన పంచాయితీలకు స్వాధీనము చేయుటకు వీలుండును.

గ్రామ అవసరములను తీర్చుటకు ఈక్రింది విషయములలో పంచాయితీలు తమకు అవసరమని తోచిన చర్యతీసికొనవచ్చును.

(1) గ్రామములలో పబ్లిక్ రోడ్లప్రక్కలచెట్లనునాటించుట, పెంచుట.

(2) పబ్లిక్ మార్కెట్లను స్థాపించుట, వాటిని నిర్వహించుట.

(3) గ్రామములలో సంతలు, ఉత్సవములపై ఆధిపత్యము వహించుట.

(4) బండ్లు నిలిచేస్థలాలు, పశువులకు పాకలు నిర్మించుట వాటిని నిర్వహించుట.

(5) కసాయిశాలల స్థాపన, నిర్వహణ.

(6) వ్యవసాయ ప్రదర్శనములను ఏర్పాటుచేయుట, వ్యవసాయమును, అందుకు సంబంధించిన ఇతర వాంశములను అభివృద్ధిచేయుట.

(7) గృహపరిశ్రమలను అభివృద్ధిచేసి, ప్రోత్సహించుట.

(8) గ్రంథాలయములు, పఠనాలయములు స్థాపించి వాటిని నిర్వహించుట.

(9) వ్యాయామకేంద్రములను, క్రీడాస్థలములను, రేడియో సెట్లను నెలకొల్పి నిర్వహించుట.

(10) ఆసుపత్రులను, మాతాశిశు సంరక్షణ కేంద్రములను స్థాపించి వాటిని నిర్వహించుట.

(11) గ్రామస్థుల ఆరోగ్యము, సుఖము, సౌకర్యము, భద్రతలకు సంబంధించన ఇతరచర్యలు.

పంచాయితీల ఆదాయమునకు ఈక్రింది మార్గములను సూచింపబడినవి.

(1) పన్నుల విధింపు:— ప్రతిపంచాయితీ ఇండ్లపన్ను, బండ్లపన్ను, వృత్తిపన్ను తప్పక వసూలుచేయవలెను. అయితే, తాటాకు ఇండ్లవంటి కొన్నిరకముల ఇండ్ల విషయములోనేమి, పేదవారి విషయమ్యులోనేమి ఇంటిపన్నును మినహాయించుటకు పంచాయితీలకు అధికారముండును.

పంచాయితీలు ఈసందర్భములో విధించవలసిన పన్నుల గరిష్ఠప్రమాణములను ప్రభుత్వము నిర్ణయించును. అవసరమని తోచినట్లయిన అడ్వర్టయిజుమెంటు, గ్రామకావలి మున్నగు వాటి విషయములలో ముందుగా ప్రభుత్వానుమతిని పొంది పన్నులను విధించే అధికారముకూడ పంచాయితీలకు ఉండును.

(2) ప్రభుత్వాదాయములో కొంతభాగము పంచాయితీలకు కేటా యింపు చేయబడును.

(3) గ్రామములో వసూలుచేసిన భూమిసెస్సు నంతాగాని దానిలో కొంతభాగము గాని ప్రభుత్వనిర్ణయము ప్రకారము పంచాయితీ లకు యిచ్చివేయబడును.

(4) రాష్ట్రములో వసూలయ్యే భూమిపన్నులో (నీటిపన్నుతోసహా) నూటికి 12 1/2 పాళ్ళు, సాలుకు పదివేల రూపాయల కంటె తక్కువ జనాభాగల గ్రామములను పంచాయితీలకు పంచిపెట్టు నిమిత్తము ప్రభుత్వము ప్రత్యేకముగ కేటాయించి ఉంచును.

(5) గ్రామపంచాయితీలు తమప్రజోపయోగకర కార్యక్రమముల ప్రణాళికలను సక్రమంగా కొనసాగించగలుగు నిమిత్తము ప్రభు త్వము ప్రస్తుతమువలెనే అప్పుడప్పుడు అవసరమని తోచినప్పుడు అదనపు గ్రాంటులను మంజూరు చేయుచుండును.

ఆడిట్:— ప్రతిగ్రామపంచాయితీ లెక్కలు సంవత్సరాంత ములో తప్పనిసరిగ ఆడిట్ చేయబడును. ఈఆడిట్ లో పంచాయితీ నిర్వ హణతో సంబంధమున్నవ్యక్తు లెవరూ ఉండకూడదు. ఆడిట్ కు అయ్యే ఖర్చులు పంచాయితీలు భరించ నవసరములేదు.

జిల్లాబోర్డు అధికారములకు స్వస్తి: జిల్లాబోర్డులకు పంచాయితీ లపై అజమాయిషీ తదితర అధికారము లేమియు ఇకముందు ఉండవు. ప్రజలఆస్థి, ప్రాణములరక్షణ విషయములలోను శాంతిభంగం కలిగే సందర్భములలోను, ప్రస్తుతపు లోకల్ బోర్డుల చట్టము క్రిందగల అత్యావ సర అధికారములకు మించి కలెక్టరులకు పంచాయితీలపై వేరే అధికార ములుండవు. లోకల్ బోర్డుల ఇన్స్పెక్టరు ద్వారా ప్రభుత్వమే నేరుగా పం చాయితీల పరిపాలనపై అజమాయిషీచేయుచు వాటిని అదుపులో ఉంచును.

లోకల్ బోర్డుల ఇన్స్పెక్టరుకు, డిప్యూటీ ఇన్స్పెక్టరుకు, జిల్లాపంచాయితీ ఆఫీసర్లు, డిప్యూటీ పంచాయితీ ఆఫీసర్లు తోడ్పడుచుండగలరు.

పైన ఉదహరించిన ప్రతిపాదనలపై ప్రజాభిప్రాయం తెలిసికొనుటకుగాను వ్యక్తులు, ప్రజాసంస్థలు ఒకనెలలోగా తమతమ విమర్శలను అందజేయవలెనని ప్రభుత్వము ఒకప్రకటన ద్వారా కోరినది.

బిల్లుకు సెలక్టు కమిటీచేసిన మార్పులు.

వ్యక్తులు, ప్రజాసంస్థలు బిల్లుపై అభిప్రాయములను ప్రభుత్వమునకు తెలియపరచిరి. ఆంధ్రరాష్ట్ర పంచాయితీల మహాసభ, రాయలసీమ నెల్లూరు పంచాయితీల మహాసభ, తమిళనాడు పంచాయితీలమహాసభ, ప్రత్యేక సభలుగావించి బిల్లుపై అభిప్రాయములను తీర్మానముల ద్వారా ప్రభుత్వమునకు తెలియజేసిరి. పత్రికలు పంచాయితీ బిల్లును చర్చించి కొన్ని సూచనలు గావించెను. మొత్తముపై బిల్లును గురించి తీవ్రమైన చర్చ, పరిశీలన జరిగెను. ఉభయశాసన సభల సభ్యులుకలిగిన సెలక్టుకమిటీ స్థానిక సంస్థలమంత్రిగారి అధ్యక్షతను అనేక పర్యాయములు సమావేశమై బిల్లును పరిశీలించినది. బిల్లు పరిశీలనకు ముందుగా ఇద్దరు నిపుణులగు శ్రీ టి. ఏ. రామలింగచెట్టియార్, శ్రీ సి. వి. నాయుడుగార్ల అభిప్రాయములను తెలిసికొనిరి. బిల్లుపై సమగ్రపరిశీలన గావించి సెలక్టుకమిటీ ఈక్రింది ప్రధానమార్పులు గావించినది.

(1) కోఆప్షన్ పద్ధతిలో మైనారిటీ వర్గములకు, మహిళలకు ప్రాతినిధ్యము ఇవ్వవలెననియు, ఇండియా నూతన రాజ్యాంగము ననుసరించి హరిజనులకు పదిసంవత్సరములపాటు సీట్లు రిజర్వుచేయవలెనని సూచించిరి.

(2) వార్డుల పద్ధతికి చక్కగా నిర్వచనము చెప్పబడినది. దీనికొరకు పదియవ క్లాజును వివరించిరి.

(3) పంచాయితీ పనుల ప్రాముఖ్యతను దృష్టిలో నుంచుకొని ఒక పంచాయితీ లేదా కొన్ని పంచాయితీలు కలిసి ఇంజనీరింగ్ ఉద్యోగులను నియమించుకొనుటకు ఇన్స్పెక్టరు పంచాయితీలకు అధికారమివ్వవలెనని నిర్ణయించిరి.

(4) ఇన్స్పెక్టరుకు ఇద్దరు ప్రాంతీయ ఆఫీసర్లు సహాయముగా నుండవలెనని కమిటీ ఉద్దేశించినది. రాష్ట్రపంచాయితీల దర్యాప్తుకుగాను ఉత్తరాదికి ఒకరు, దక్షిణాదికి ఒకరు ప్రాంతీయ పంచాయితీ ఆఫీసర్లు నియమింపబడెదరు. దీనికిగాను 43 (1) క్లాజులో తగు మార్పులు గావింపబడినవి.

(5) పంచాయితీ సభ్యుల తీర్మానముల ప్రకారము తీసికొన్న చర్యల ఫలితముగా పంచాయితీ బోర్డును సూపర్‌సీడ్ చేసినను రద్దుచేసినను గ్రామ ప్రజలందరు కలిసి ఎన్నుకొన్న పంచాయితీ అధ్యక్షుడు మాత్రము పదభ్రష్టుడుకాకూడదు. కాగా, పంచాయితీ రద్దు అయినా, సూపర్‌సీడ్ అయినా, పంచాయితీ అధ్యక్షుడు పిమ్మట పంచాయితీదారుగను పంచాయితీ నిర్వాహణాధికారిగను వ్యవహరించవలెనని సూచించ బడినది. 49 వ క్లాజులోని 5, 6 సబ్ క్లాజుకు తగు సవరణలు గావింపబడినవి.

(6) గ్రామస్థుల వాడకమునకు, ఉపయోగమునకు లేక అమ్మకమునకు గ్రామమునకు వచ్చే ప్రతిసరుకుమీద పన్నువిధించుట మంచిదికాదని భావించబడి గ్రామమునకు రవాణా జరిగిన లేక అమ్మకమునకు కొనిరాబడిన వాణిజ్యపు పంటలమీద—వేరుశనగ, పుగాకు, ప్రత్తి వగైరాలుమీద సుంకము వసూలు చేయవలెనని సూచన జరిగినది. బిల్లుపై పూర్తిచర్చ జరిగినపుడు పన్నులు, ఆర్థిక సంబంధమైన క్లాజులకు తగుసవరణలుగావించుటకు నిర్ణయించడమైనది.

(7) ఆస్థుల ట్రాన్స్ఫర్ విూద, స్థిరాస్థులమార్పిడి జరిగినపుడు అట్టి వంటి ఆస్థులను నిరంతరము కౌలుకు యిచ్చుచు వచ్చిన సందర్భములలో సుంకముల విధింపుకు రెండు సూచనలు జరిగినవి.

(8) ప్రైవేటు మార్కెటులు, ధర్మకార్యాలకు, మతవిషయములకు, విద్యాప్రచారమునకు తమ ఆదాయమును ఉపయోగించునవి మినహా మిగిలిన వాటిపై సుంకముల సమస్యను గురించి కమిటీ సూచనల ప్రకారము 82, 83 క్లాజులు సవరింపబడినవి.

(9) జనాభాలెక్కలు వగైరాలు సులభముగా తయారు చేయుటకు వీలుగా గ్రామములలోని ఇండ్లకు నెంబర్లు వేయుటకును, వాటిని తగు స్థితిలో ఉంచుటకును ఏర్పాట్లు చేయబడినవి.

(10) ఒకటవ తరగతికి చెందిన పెద్దపంచాయితీలకు క్రిమినల్ సివిల్ విషయములలో న్యాయనిర్వహణాధికారములు అప్పగింతపెట్ట వలెనని అసలు బిల్లులో ఉన్నది. రెండవతరగతి పంచాయితీలకు కూడా ఈఅధికారము లుండవలెనని కమిటీ సూచించినది. 133 వ క్లాజులో ఈవిషయము పేర్కొనబడినది.

ఈచట్టము అమలులోనికి వచ్చినవెంటనే అన్నిగ్రామములకు పంచాయితీలు ఏర్పాటుచేయుట జరుగగలదనే ప్రాతిపదికతో అసలు ఈబిల్లు తయారుచేయబడినది. రాష్ట్రమంతట పంచాయితీల నిర్మాణ కార్యకలాపము క్రమక్రమముగ జరుగవలెనని ప్రస్తుతము భావింపబడు చుండుటచే ఈలోపుగ నాన్-పంచాయితీల పరిపాలనను ప్రస్తుతమున్న విధముగనే జిల్లాబోర్డులకు తగు అధికారము ఉంచబడినది. ఇందుకుగాను మద్రాసులోకల్ బోర్డుఆక్టు సవరణలతో నాల్గవ షెడ్యూలు ఈబిల్లుకు జతపరచబడినది. నాన్-పంచాయితీ ప్రాంతములలో పంచాయితీల నిర్మాణము జరిగినవెంటనే ఈ షెడ్యూలు నిబంధనలు రద్దుకాగలవని ప్రకటింప బడినది.

## బిల్లుపై అసెంబ్లీలో చర్చ.

సెలక్టుకమిటీచేసిన మార్పులతో గ్రామపంచాయితీబిల్లును చర్చకు తీసికొనవలసినదని స్థానికస్వపరిపాలన శాఖామాత్యులు అసెంబ్లీలో ప్రతిపాదించి నపుడు సభ్యులు పరస్పర విరుద్ధాభిప్రాయములను ప్రకటించి నను బిల్లును అందరు బలపరచిరి. గ్రామీణులకు సర్వసౌఖ్యములు చేకూర్చుటకు స్థానిక సంస్థల మంత్రి చేయుచున్న కృషిని ప్రశంసించిరి. బిల్లునిబంధనలు సక్రమంగా అమలుజరిగినయెడల భారతభావినాయకుల తర్ఫీదుకు గ్రామపంచాయితీలు ప్రాతిపాదిక వేయగలవని ఆశాభావమును ప్రకటించిరి. ఈసందర్భమున జరిగినచర్చకు మంత్రివర్యులు సమాధాన మిచ్చుచు ఇటుల ప్రసంగించిరి. పంచాయితీబోర్డులకు మరింత ఆదాయము చూపవలెనని చేయబడిన సూచనను ప్రస్తావించి గ్రామస్థులు శాంతియుత మైన సుఖజీవితము గడుపవలెనను లక్ష్యమును దృష్టిలోనుంచుకొని తదనుగుణమైన నిబంధనలు చేయబడినవని తెలియజేసిరి. అధ్యక్ష్యుని గ్రామస్థులే సరాసరి ఎన్నుకొనుటకు సభ్యులలో కొందరు ఎందుకు అభ్యంతరము తెల్పినది అనూహ్యమని పేర్కొనుచు, ప్రజాస్వామిక విధానములో నమ్మకమున్నవారే ఆక్షేపణతెల్పుట మరింత ఆశ్చర్యము కలిగించుచున్నదని నుడివిరి. నిత్యజీవితములో కనీసము కొన్నివిషయములలో నైనను గ్రామస్థులు ఇతరులపై ఆధారపడకుండ తమకాళ్ళపైననే నిలువబడుటకు ఈబిల్లు ఉద్దేశింపబడినదనిరి. గతములో గ్రామములపట్ల అశ్రద్ధచూపుటవలననే నేడు ఆహారకొరత తదితర నిత్యజీవితావసర వస్తువుల కొరతఏర్పడినదని తెల్పిరి. పట్టణవాసుల ప్రయోజనముల కొరకును, విదేశీయుల అవసరముల తీర్చుటకొరకును, ఇన్నాళ్ళు గ్రామ ములను దోచుకొనుట జరిగినదని హెచ్చరించి పల్లెప్రజల సామాజిక వ్యవస్థను ధ్వంసముచేయుట మనలను మనమే ధ్వంసము చేసికొనుటయని వెల్లడించిరి. పల్లెప్రజల సామాజిక వ్యవస్థాప్రాతిపదికలను భగ్నంచేయ

కూడదను సిద్ధాంతముమీదనే ఈబిల్లు తయారుచేయబడినదని తెల్పుచు ప్రజలు, కోరినందుననే దీనిని ప్రతిపాదించుచుంటినని తెల్పిరి. రాష్ట్రపు మారుమూలలలో ఉండే ప్రజలు తమ ప్రాథమిక స్వత్వాలు నెరవేర్చుమని కోరుట సమంజసమనిరి. మైనారిటీలు ఇకమీదట ప్రత్యేక నియోజక వర్గములపై ఆశలుపెట్టుకొనకుండ నూతన పరిస్థితులకు అలవాటుపడగలరనే ఆశాభావాన్ని ప్రకటించిరి. వయోజన నియోజికాధికార ప్రకారము ఎన్నికలు జరుగనుండుటచేత హరిజనులకు అనుకూలమైన పరిస్థితులు ఏర్పడగలవనియు త్వరలోనే తమ హక్కులను కాపాడుకొనగల శుభసమయము రాగలదనిరి. గ్రామస్థులే సరాసరి పంచాయితీబోర్డు అధ్యక్షుని ఎన్నుకొనుట మైనారిటీ వర్గములకు చాల శ్రేయస్కరమనియు, అధ్యక్షపదవి నాశించేవారు ప్రతిఓటరు సహాయము అపేక్షించి తీరవలెననియు, మైనారిటీల సహాయ సహకారములుకూడ ఆయనకు అవసరమనిరి. అన్నివర్గముల విశ్వాసమును చూరగొనినవారే అధ్యక్షులుగా ఎన్నుకొనుట గ్రామశ్రేయస్సుకు దారితీయుననియు, బోర్డుసభ్యుల దయాదాక్షిణ్యములతో అధ్యక్షునికి నిమిత్తములేదని వివరించిరి. గ్రామమొత్తముపై ఎన్నుకొనబడు అధ్యక్షుడు బోర్డుకార్యకలాపముల నిర్వహణకు అధినేతగా వ్యవహరించగలడని తెలియజేసిరి. జనాభాప్రాతిపదికపై పంచాయితీబోర్డులకు ధనసహాయము చేయబడగలదని ప్రకటించిరి. మంచినీటి సదుపాయము, కుటీరపరిశ్రమలకు ప్రోత్సాహము మున్నగు చిన్నచిన్న కార్యక్రమములను పంచాయితీబోర్డు ఆదాయముతోనే నిర్వహించుటకును నిత్యజీవితావసరములకు నగరములపై గ్రామస్థులు ఆధారపడకుండ ఉండుటకును, సాధ్యమైనంతవరకు గ్రామములను స్వయంపోషకములుగా చేయుటకు తగిన సదుపాయములు చూపుటకే ఈబిల్లు ఉద్దేశింపబడినదని మంత్రివర్యులు వెల్లడించిరి. తరువాత అసెంబ్లీలో క్లాజువారీచర్చ ప్రారంభమైనది.

500 జనాభాగల ప్రతిగ్రామమునకు పంచాయితీబోర్డు నెలకొల్ప వలెనని బిల్లులో పేర్కొనబడినది. దీనికి 5000 జనాభాకు మించిన ప్రతి రెవెన్యూ గ్రామమునకు ఈచట్టము వర్తింపచేయాలనే సవరణ వీగిపోయినది. రహస్యపు ఓటింగ్ పద్ధతిపైననే పంచాయితీబోర్డు సభ్యుల ఎన్నిక జరుపవలెనను ఏడవక్లాజుకు ప్రతిపాదించబడిన సవరణ ఉపసంహరించుకొనబడినది. బిల్లు మొదట ప్రతిపాదించినపుడు రహస్యపు ఓటింగ్ పద్ధతిని ప్రవేశపెట్టెదనని తాను తెలిపియుంటినియు, కాని సెలక్టు కమిటీ ఈవిషయమును సాకల్యముగ చర్చించి ప్రభుత్వమే ఈపద్ధతియొక్క సాధక బాధకములను దృష్టిలోనుంచుకొని తగుఏర్పాట్లు చేయగలరనే నిర్ణయమునకు వచ్చిరనియు, రహస్యపు ఓటింగ్ సూత్రము హర్షణీయమైనదనియు, అయితే దాని అనుపానులను శ్రద్ధగా పరిశీలించి దానికి సంబంధించిన ఇతరవివరములను కూడ దృష్టిలోపెట్టుకొని తగునిబంధనలు పొందుపరచుట శ్రేయస్కరమనియు, మున్ముందు ఈబిల్లు ననుసరించి నిబంధనలు చేయునపుడు వోటర్లకు తగురక్షణ కలుగురీతిని అవిరూపొందించబడగలవని మంత్రిగారు హామీయిచ్చిరి.

గ్రామమునసబు పంచాయితీలలో ఎక్సలఫీషియో సభ్యుడుగా ఉండవలెనను విషయముపై తీవ్రమైన తర్జనభర్జన జరిగినది. చివరకు మంత్రిగారి ఆమోదముతో 8 వ క్లాజును బిల్లునుండి మినహాయించుటకు సభవారు నిర్ణయించిరి. గ్రామపంచాయితీలో గ్రామమునసబు ఓటింగ్ హక్కులేని సభ్యుడుగా కూడ ఉండరాదని నిర్ణయము హర్షణీయమైనదని అందరుభావించిరి.

హరిజనులకు కొన్నిసీట్లు ప్రత్యేకించబడవలెనను తొమ్మిదవ క్లాజుకు సభ్యులందరు సంతసించిరి. ఎన్నికల నిర్వహణముకొరకు పంచాయితీలను వార్డులక్రింద విభజంపవలెనను పదియవక్లాజును బిల్లునుండి తొలగించవలెనను సవరణను మంత్రిగారు వ్యతిరేకించుచు వార్డులపద్ధతి

లేనున్న ఒకే ఒకపార్టీ పెత్తనము సాగుట కవకాశముకలదనియు, అల్ప సంఖ్యాకవర్గముల ప్రతినిధులుకూడ పంచాయితీ సభ్యులుగా ఎన్నుకొ బడుటకు పదియవక్లాజు తోడ్పడునని మంత్రిగారు వివరింపగా సవరణ ఉపసంహరించుకొనబడి అసలుక్లాజు ఆమోదింపబడెను.

18వ క్లాజు (సభ్యుల అనర్హతలు)కు సరియైన నోటీసు అనగా రిజిష్టరు నోటీసు పంపవలెనని ఒకసవరణ రాగా దానికి మంత్రిగారు గ్రామాలలో రిజిస్టరు పోస్టులో నోటీసులను పంపుట కష్టమనియు ఖర్చుకూడ అధికమనియు సూచించి, మీటింగు నోటీసులను సభ్యులకు ఇండ్లవద్ద అందజేసి, అందినట్లు సంతకము తీసికొనెద రనియు, సభ్యుడు ఇంటివద్దలేనపుడు నోటీసును తలుపుకు అంటించి ఇంటిలో ఉన్న పెద్దవారికి తెలియజేయగలరనియు, సభ్యుడు గ్రామాంతరమున నివసించుచున్నపుడు రిజిష్టర్ పోస్టులో పంపగలరని వివరించిరి. ఈవివరములన్నియు "రూల్సులో" పొందుపరచబడగలవని హామీ ఇచ్చిన పిమ్మట సవరణ ఉపసంహరించుకొనబడినది. క్లాజు ఆమోదింపబడినది.

పంచాయితీ అధ్యక్షుని ఓటర్లు సరాసరి ఎన్నుకొనుటకు సంబంధించిన 21 క్లాజుపై తీవ్రమైన చర్చజరిగినది. ఈఎన్నికవిధానము ప్రమాదకరమనియు, దానివలన పంచాయితీసభ్యులకు ప్రెసిడెంటుకు మధ్య వివాదములు పెరుగగలవని కొందరు సూచించిరి. గ్రామములలో తగాదాలు, నిరక్షరాస్యత ప్రబలంగాఉన్న ప్రస్తుత పరిస్థితులలో ఇట్టి తీవ్రమైన విధానము అమలుజరుప జూచుట ఎంతమాత్రము తగదనియు దీనివలన గ్రామములలో పార్టీకక్షలు మరింత పెరిగిపోయే ప్రమాదము కలదని కొందరు ఎరుకపరచిరి. గ్రామస్థులందరు కలిసి అధ్యక్షుని ఎన్నుకొనుట పంచాయితీరాజ్య పురోభివృద్ధికి తీవ్ర ప్రతిబంధకముకాగలదనియు, ఇందువలన గ్రామములలో నియంతృత్వ పరిపాలనకు దారి ఏర్పడగలదనియు, అల్ప సంఖ్యాకవర్గముల ప్రతినిధి అధ్యక్షుడుగా ఎన్నుకొన

బడు అవకాశము ఎన్నిటికిని లభించదని కొందరు సూచించిరి. ఈక్లాజును బలపరచిన వారిలో కొందరు నూతనసంస్కరణను ప్రతిపాదించిన మంత్రి గారిని ప్రశంసించి, ఈవిధానమువలన ఓట్లను సద్వినియోగము చేయుటకు తగిన శిక్షణ లభించునని ఆశించిరి, ఇట్టి ప్రోచితమైన పద్ధతి తీసికొని వచ్చినందుకు మంత్రిగారిని కొందరు అభినందించిరి. ఇందుకు మంత్రి గారు సమాధానమొసగుచు ప్రెసిడెంటును గ్రామస్థులందరు ఎన్నుకొనుట పంచాయితీలను విజయవంతముగా పనిచేయుటకు ఉద్దేశింపబడిన దనియు, మైనారిటీవర్గముల మధ్య సమైక్యత పొసగిన వారిప్రతినిధి ప్రెసిడెంటు కాగల అవకాశము కలదని వివరించగా క్లాజు అంగీకరించబడెను. సభ్యులకు కూడా అధ్యక్షస్థానమునకు అభ్యర్థిగానిలిచే అవకాశము కలుగజేయవలెనను సవరణ ఉపసంహరించుకొనబడినది.

పంచాయితీలకు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ల నియామకమునకు సంబంధించిన 29వ క్లాజుపై కొంత చర్చజరిగినది గ్రామపంచాయితీలలో ద్వంద్వపరిపాలనకు స్వస్తి చెప్పవలసిన సమయ మాసన్నమైనదనియు, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ల నియామకమువలన పంచాయితీలు కలహములకు నిలయము కాగలవని కొందరు భయమును సూచించిరి. ఈనియామకము ప్రజాస్వామిక సిద్ధాంతములకే విరుద్ధమని కొందరు వాదించిరి. దీనివలన అధ్యక్షుడు, సభ్యులు, కార్యనిర్వహణాధికారి, ఈమూడు వర్గముల మధ్యనిరంతరము స్పర్థలు పెరిగి పంచాయితీలు కలహాభూయిష్ఠములు కాగలవని కొందరు సూచించిరి. విమర్శలకు మంత్రిగారు సమాధానమిచ్చుచు కార్యభారము హెచ్చుగాయుండి, ఆర్థికముగా మంచిస్థితిలో ఉన్నపంచాయితీలకే ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లను నియమించవలెనని బిల్లు సూచించుచున్నదనియు, అత్యావసరమని భావించినప్పుడు మాత్రమే వీరి నియామకము జరుగునట్లు ప్రభుత్వము తగుజాగ్రత వహించగలదనియు పంచాయితీ తీర్మానములను అమలు పరచుటయే ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ల

ముఖ్యమగుపనియనియు, వీరి నియామకమువలన పంచాయితీల ద్రవ్యము దుర్వినియోగము కాకుండ చూచుటకు వీలగునని వివరించిన మీదట సవరణ ఉపసంహరించు కొనబడెను. క్లాజు ఆమోదించబడెను.

32వ క్లాజుపై చర్చప్రారంభముకాగనే దానిక్రింద ఎగ్జిక్యూటివ్ అధికారులకు విస్తృతాధికారములు యిచ్చుట ఎంతమాత్రము తగదని ఒకరు సూచించగా, కలరావంటి అంటువ్యాధులు వ్యాపించినపుడు వెంటనే చర్యతీసికొనుటకు అత్యవసరాధికారము ఉండితీరవలెనని వివరింపగా క్లాజు ఆమోదింపబడెను.

ఇతరక్లాజులు వరుసగా ఆమోదింపబడిన పిమ్మట, బిల్లును ప్రతిపాదించిన మంత్రిగారిని ప్రతిపక్షనాయకుడు అభినందించుచు, మనరాష్ట్రంలోనేగాక మొత్తం దేశచరిత్రలోనే ఈ బిల్లు మహోజ్వలఘట్టము కాగలదనియు, దీనివలన ప్రజలు తమ హక్కులను గుర్తించి దేశపరిపాలనానుభవము చేకూర్చగలదనుటకు ఎట్టిసందియములేదని నొక్కివక్కాణించిరి. చివరకు చర్చకు సమాధాన మొసగుచు స్థానిక స్వపరిపాలన మంత్రిగారు ఇట్లు నుడివిరి.

" ఈబిల్లుపై సభ్యులు వెల్లడించిన సందేహములను తొలగించి ప్రభుత్వోద్దేశములను వివరింపదలచినాను. బిల్లులోగల సిద్ధాంతములను మొత్తముమీద అందరు హృదయ పూర్వకముగా ఆమోదించుట సంతోషప్రదమైన విషయము. కొందరు సభ్యులు, ముఖ్యముగా అల్ప సంఖ్యాకవర్గములకు చెందినవారు వెలిబుచ్చిన సందేహములు వాస్తవమైనవే.

ఆచరణలోమాత్రమే బిల్లు ప్రయోజనములు రుజువు కాగలవు. ప్రభుత్వయంత్రము ఎంతసమర్థమైనదైనను, ఉద్దేశములు ప్రశంసనీయమైనవే అయినను, వాటిని ఆచరణలోపెట్టి చూచునంతవరకు ఎవరును

ఎట్టి అభిప్రాయమును ఏర్పరచుకొనరాదు. సభ్యుల అభిప్రాయముల దృష్ట్యా, ఇప్పటికే బిల్లును చాలసార్లు వడపోసి సంకుచితము చేయడమైనది. ఆచరణలో చాలకష్టములను ఎదుర్కొన వలసివచ్చుననుమాట నిజమే. కాని, ఆదిలో బిల్లు లక్ష్యములలో నూటికి కొన్నివంతులు సఫలమైనను మనమందరము గర్వపడవచ్చును.

హరిజనులకు ప్రత్యేక స్థానముల విషయములో స్పష్టముగా పేర్కొన బడలేదని కొందరు సూచించిరి. ఈసభలో చేయబడిన వాగ్దానములను నిబంధనలలో పొందుపరచగలమని హామీయిచ్చుచున్నాను. వారి ప్రత్యేక సౌకర్యములకు ఎట్టిభంగము కలుగదు. పదేళ్ళ పిమ్మట ఈప్రత్యేక సౌకర్యములతో పనిలేకుండ హరిజనులలో ఆత్మవిశ్వాసాన్ని ప్రబోధించ వలసినదిగా వారినాయకులకు నామనవి.

సంఖ్యాబలము కంటె మేధాసంపత్తికి అధిక ప్రాధాన్యమివ్వవలెనని ఒకరు సూచించిరి మేధాసంపత్తిపేరుతో ప్రపంచములో ఎన్నో దుష్పరిణామములను మనము చూచుచున్నాము. కేవలము తెలివి తేటలవలన ఏసమస్యను పరిష్కరించలేము. ఇందుకు సహృదయత ముఖ్యము. తెలివితేటలకంటె సహృదయతకే ఎక్కువ ప్రాధాన్య మిచ్చెదను. గ్రామీణుల తెలివితేటలు పరిమితముగా ఉన్నప్పటికి పరిశుద్ధ హృదయము కలిగిన ఎన్నిమహాకార్యముల నైనను సాధింపవచ్చును.

పంచాయితీల ఆర్థిక సౌష్ఠవమునుగాని, సామర్థ్యమునుగాని సరకుచేయకుండ కార్యనిర్వహణాధికారులను నియమించుట ప్రభుత్వ అభిమతముకాదు. వీరితోపనిలేకుండ పంచాయితీలు నిర్వహింపబడే సుదినముకోసము ప్రభుత్వము నిరీక్షించుచున్నది. అంతవరకు పంచాయితీల ధనము దుర్వినియోగము కాకుండ వాటి శ్రేయస్సుకొరకు కార్యనిర్వహణాధికారులను నియమించవలసివచ్చును. వీరినియామకముల విషయములో

అల్పసంఖ్యాకుల హక్కులు గమనింపబడగలవు. వారికి న్యాయము కలిగించు నిమిత్తము అల్పసంఖ్యాకవర్గముల వారికి కార్యనిర్వాహణాధికారులుగా శిక్షణ ఇవ్వబడవలెనని నేను ఇదివరకే నిర్ణయించిన నిబంధనలలో పేర్కొనడమైనది.

బిల్లు అమలు జరుపుటలో కృషి అంతయు ప్రభుత్వమే చేయగలదని భావించిన ప్రయోజనములేదు. దేశము ఎదుర్కొంటున్న సమస్యలను ప్రజలుకూడా గ్రహించవలెను. శాసనసభ్యులు గ్రామములకు వెళ్ళి అచ్చట ప్రజలను చైతన్యవంతులుగా చేయవలెను. గ్రామస్థులు స్వయముగా తమ భవితవ్యమును రూపొందించుకోవలెను. వారు ప్రభుత్వముమీదకంటె స్వశక్తిపైననే అధికముగా ఆధారపడవలెను. చక్కగా కృషిచేసిన వారికేకాదు మేలు. దేశానికే మేలు చేసిన వారయ్యెదరు.

ఈబిల్లు ఆమోదమునకు చాలకాలము పట్టినది. బిల్లుసిద్ధాంతములపై విరివిగా ప్రచారము జరిగినది. వివిధ సంస్థల అభిప్రాయములను సేకరించటమైనది. ప్రజా సంస్థల సలహాపై అడ్జైర్న్ ప్రభుత్వకాలములో కొన్ని క్లాజులు సిద్ధముచేయబడినవి. వాటిలోకూడా కొన్నిటిని బిల్లులో పొందుపరచడమైనది.

నియమములు, నిబంధనలు ఎటులయున్నను అమలుజరిపే విధానము పైననే బిల్లులోని ఆశయములు ఫలించునది లేనిది ఆధారపడియుండును. అందుచేత బిల్లులోగలస్వల్పదోషములను పాటించకుండమనగ్రామముల పురోభివృద్ధిని కాంక్షించి దీనిఆశయాలను సఫలము చేయుటకు మనమందరము కృషి చేయవలెను. గ్రామములలో భావితరముల అభివృద్ధికి ఈబిల్లు పునాదిరాయికాగలదు. అందరు చిత్తశుద్ధితో కలిసికృషి చేసిన బిల్లు జయప్రదముగా అమలు జరుగగలదు. దీనిని ఆమోదించినచో మనకు అప్పుడేమనము గర్వపడవచ్చును.'' అనిమంత్రిగారు ముగించిరి.

అనంతరము బిల్లు చట్టముగా ఆమోదించబడినది.

హాస్యరసదృష్టితో, ప్రబోధయుతముగా శాసన సభ్యులకు మంత్రిగారు పైన తెల్పిన వాక్యములు ప్రశంసనీయములైనవి. బిల్లును పొగడిన వారితోగాని విమర్శించిన వారితోగాని ఏకీభవించక మంత్రిగారు సమంజసమైన ధోరణిని అవలంబించిరని దీనివలన విదితమగుచున్నది. శాసనము కార్యరూపములోనికి వచ్చిన తర్వాతగాని దానిలోని మంచి చెడ్డలు వెల్లడికావనియు, అన్నియు చెడ్డఫలితాలే కలిగిన శాసనమును రద్దుచేసికొనుటకును, ఏవోకొన్ని చెడుగులు మాత్రమే కానవచ్చిన వాటిని తొలగించుటకును శాసనములో అవసరమైన సవరణలు చేసికొనుటకును మనచేతిలోని పనియేనియు, కావలసినది ఒకటేయనియు, అది చిత్తశుద్ధితో శాసనమును అమలు పరచవలసి యున్నదని స్పష్టపరచినందుకు మంత్రివర్యులు ఎంతేని అభినందార్హులు.

—: కాన్సిల్ లో చర్చ. :—

పంచాయితీ బిల్లుపై కాన్సిల్లోని చర్చ సాఫీగా నడచినది. పంచాయితీ పరిపాలనలో విద్యాప్రచారము, ఆరోగ్యము, కుటీర పరిశ్రమలు, రెవెన్యూ వ్యవహారములు చూచుటకు విడివిడిగా మంత్రులను గౌరవహోదాతో నియమించుట అవసరమని ఒకరు సూచించిరి. స్థానిక స్వపరిపాలనశాఖామంత్రి, లోకల్ బోర్డుల ఇన్స్పెక్టరు, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లు గ్రామములపై పెత్తనము చేయుటకు ఈబిల్లు పనికిరాగలదని ఇంకొకరు హెచ్చరించిరి. ప్రజలు సరాసరి తమ అధ్యక్షుని ఎన్నుకొను అధికారము కలిగినప్పుడు తమ ఆదరణను కోల్పోయిన అధ్యక్షుని తొలగించుటకును హక్కుకలిగి యుండవలెనని మరియొకరు సూచించిరి. నవభారత రాజ్యాంగము ననుసరించి ఈబిల్లుకు రాష్ట్రప్రభుత్వము ప్రతిపాదించుచు పెక్కుసవరణలు కౌన్సిల్ ఆమోదించినది. చర్చానంతరము కౌన్సిల్ ప్రతిపక్షనాయకుడు ప్రసంగించుచు బిల్లుతనకు సంతోషము కలిగించినదనియు, పూర్వకాలమునుండియు, ప్రజల ప్రతిభా విశేషములు గ్రామ

ములనుండే వికసించినవనియు నవభారత రాజ్యాంగము 40వ ఆర్టికల్ మేరకు స్వయంపరిపాలక సంస్థలుగా చేయుట అవసరమని తెల్పిరి. స్థానిక సంస్థలమంత్రియగు గౌరవనీయులు శ్రీ కల్లూరి చంద్రమౌళిగారి కృషిని ప్రశంసించుచు, ఆయన ప్రతిభా విశేషములు పంచాయితీల సుస్థిరతకు పునాది కాగలదని ఆశించిరి. మంత్రిగారు ప్రతిపక్షనాయకునకి సభ్యులకు ధన్యవాదము లర్పించుచు ప్రతివిషయములోను ప్రజాభిప్రాయమే కొనసాగవలెనని తమయంతరి వాంఛయని తెల్పుచు, ప్రభుత్వము పంచాయితీల గురించి ఏది తలపెట్టినను పంచాయితీలను సంప్రదించనదే ప్రభుత్వము చేయబోదనియు, పంచాయితీలపై నిర్బంధము లున్నట్లు కొన్ని క్లాజులలో కనిపించినను నిజమది కాదనియు, పంచాయితీ పరిపాలనలో ఏవిధముగను జోక్యము కలిగించుకోవలెనని ప్రభుత్వోద్దేశము కాదనియు, వాటి పరిపాలన సక్రమముగా కొనసాగుట ప్రభుత్వపు అభిమతమని హామీ ఇచ్చిరి. బిల్లు చట్టముగా ఆమోదింపబడినది.

పంచాయితీ శాసనము గురించి స్థానిక స్వపరిపాలన శాఖామాత్యులు వేరొకచో ప్రబోధించిన వాక్యముల నిట పేర్కొనతగినవి.

“పంచాయితీ బిల్లులోని సూత్రములు ఫలవంతము కావలెనన్న ప్రజలే వాటిని ఆచరణకు తేవలెను. ఆచరణ స్వార్థరహితముగ నుండవలెను. అప్పుడే గ్రామములందు దారిద్ర్యము నశించును. ప్రజలు సుఖింతురు. సహకారము వికసించి సంఘీభావము ఘనీభవింపజేయును. ప్రజలను ఏకమార్గమున నడుపు సంస్థగా యీ పంచాయితీ పరిణమించును. అప్పుడప్పుడవి లోపములకు గురిగావచ్చును. ప్రమాదములకు పాల్పడవచ్చును. వీటిని సరిదిద్ది చక్కబరచుకొనుచుండవలెను. అప్పుడే పంచాయితీలు ప్రజలకు ఉపకరింపగలవు.”

# పంచాయితీరాజ్యం ప్రజారాజ్యం కావాలి.

1950 గ్రామపంచాయితీ చట్టము — వివరణ ఈ గ్రంథమునకు అనుబంధముగ ప్రకటింపబడినది. నూతన పంచాయితీ శాసనములోని మార్పులు గమనింపతగినవి. పంచాయితీలపై జిల్లాబోర్డులకు ఇక ఏవిధమైన అధికారముండదు. పంచాయితీల పురోభివృద్ధికి ఈ మార్పు ఎంతయో తోడ్పడగలదు. ఇతర స్థానిక సంస్థలతో కలుపక, గ్రామ పంచాయితీల కిది ప్రత్యేక చట్టముగ చేయబడినది. గ్రామపంచాయితీల శాఖ అభివృద్ధికిది పునాది కాగలదు. స్థానిక పరిపాలనావ్యవస్థకు పంచాయితీలనే ప్రాతిపదికగా గ్రహింపబడినది. అధికారుల అనవసర జోక్యము తగ్గించుటకే చట్టముద్దేశింపబడినది. ప్రతిపల్లెకు ఒక పంచాయితీ ఏర్పాటు జరుగవలెనని నిర్ణయింపబడినది. నామినేషనుల కిక తావేలేదు. హరిజనులకు మాత్రము పదేండ్ల వరకు స్థానములు రిజర్వు చేయబడగలవు. ఓటింగ్ హక్కు ఎక్కువమంది కొసగబడినది. 18 సంవత్సరములు పైబడిన ప్రతి స్త్రీ, ప్రతి పురుషుడు ఓటుచేయుటకు వసతికలుగ జేయబడినది. పంచాయితీ అధ్యక్షుని ఓటర్లే సరాసరి ఎన్నుకొనుట ఈచట్టములోని ముఖ్యమగు మార్పు పంచాయితీల ఆదాయము పెంపొందింప బడినది. పంచాయితీలు చేయవలసిన పనులు విస్తరింపబడినవి. సివిల్ క్రిమినల్ కేసుల విచారణ, దస్తావేజుల రిజిస్ట్రేషన్, ఇర్రిగేషన్ వర్క్సుపై అజ్మాయిషీ, గ్రామధర్మ సంస్థల నిర్వహణ, గృహపరిశ్రమల అభివృద్ధి మున్నగు ప్రజోపయోగకరములగు పనులు పంచాయితీలకు అప్పజెప్ప బడినవి. స్వయంసంపూర్ణమై స్వయంపాలకమైన స్థానిక సంస్థలుగా తయారుచేయుటకే చట్టముద్దేశింపబడినదని వివరింపబడినది.

నూతన పంచాయితీ చట్టమునుసరించి ఈదిగువ జనసంఖ్య అంచనాల ప్రకారము దాదాపు 30,000 పంచాయితీలు ఏర్పడగలవని తెలియుచున్నది.

| జనాభా | గ్రామముల సంఖ్య | |
|---|---|---|
| | 1931 | 1941 |
| 500 కు తక్కువ | 28, 528 | 12, 465 |
| 500-1000 మధ్య | 9, 656 | 9, 228 |
| 1000-2000 మధ్య | 8, 465 | 8, 203 |
| 2000-5000 మధ్య | 4, 582 | 4, 929 |

## ఓటర్ల బాధ్యత.

నూతన పంచాయితీ శాసనమునను సరించి ఓటింగుహక్కు ఎక్కువ మందికి ప్రసాదింపబడినది. ఇది సద్వినియోగముచేసికొను బాధ్యత ఓటర్లపై కలదు. ప్రతి ఓటరు తన అంతరాత్మ ననుసరించి ప్రజాసేవ చేయువారికే తన ఓటు ఇవ్వవలెను. కుల, మత విచక్షణకు తావిచ్చి, పార్టీకక్షలకు లోనై, ప్రతిఫలాపేక్షతో ఓటుచేసిన గ్రామమునకు తీరని అపకారము చేసిన వాడగుటయేగాక దేశద్రోహమునకు పాల్పడిన వాడగును. స్వతంత్రభారతదేశములో ఇట్టి ఓటరు నీచుడుగ పరిగణింప బడును. అధ్యక్షుని సరాసరి ఎన్నుకొనుటలో గ్రామఓటర్ల బాధ్యత ఇనుమడింప చేయబడినది. స్వార్థపరుని, కులతత్వ కుబుద్ధిని ఓటర్లు తమ అధ్యక్షునిగ ఎన్నుకొనినచో తమగోతిని తామే త్రవ్వుకొనినవారగుదురు. నూతన పంచాయితీచట్టము సక్రమముగ అమలు జరుపు గురుతర బాధ్యత గ్రామఓటర్లపైననే కలదు.

## పంచాయితీ అధ్యక్షుడు.

ఇకముందు పంచాయితీ అధ్యక్షుడు గ్రామ ఓటర్లందరిచే ఎన్ను కొనబడును. కనుక సాధ్యమైనంతవరకు ఉత్తముడగు నాయకునే అధ్య క్షునిగ ఎన్ను కొనబడవచ్చును. పంచాయితీ అధ్యక్షుడు ఇకముందు పంచాయితీ సభ్యుల దయాదాక్షిణ్యములపై ఆధారపడవలసిన పని లేదు. వారిబెదరింపులకు లోనుకావలసిన పనిలేదు. అని, తానుఓట

ర్లందరిచే ఎన్నుకొనబడినను ఫీమాతో, సభ్యులను సరకు చేయక వ్యవహరించుటయు పాడిగాదు సభ్యుల సహకార సద్భావములు కోల్పోయిననాడు అధ్యక్షుడు పంచాయితీలో ఏపనియు చేయలేడని గ్రహించవలెను. పనిచేయలేనినాడు అధ్యక్షుని దింపుటకు ప్రభుత్వము నకు సర్వాధికారములు గలవు. సదా గ్రామసేవచేయుటకు అధ్యక్షుడు ప్రయత్నింపవలెను. ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లు ఉన్నచోట్ల, అధ్యక్షునికి ప్రజలకష్టములను తెలిసి కొనుటకును, తన్నివారణోపాయములను ఆలో చించుకొనుటకు ఎక్కువ తీరిక, చిత్తశాంతి ఉండగలదు. కాని అదేమి గ్రహచారమోగాని కొందరు అధ్యక్షులకు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లుండుట అంతగా ఇష్టమున్నట్లు కనబడదు. వారికున్న అధికారములన్నియు పోయినట్లు, భావించుట విచారింపతగినది. ఇదినిజముకాదు. అధ్యక్షు నికిలేని అధికార మేది? సిబ్బందిని నియమించు అధికారము లేనంతమాత్ర మున తమకు అధికారములులేవని భావించుట కేవలము పొరపాటు. నూతనచట్టములోను సిబ్బందినియమించు అధికారము ఎగ్జిక్యూటివ్ ఆఫీ సర్లకు ఇవ్వబడినది ఇది అధ్యక్షుని కెంతయో మహోపకారమని గ్రహించవలెను. అధ్యక్షుడు స్థానికుడగుటవలన సిబ్బంది నియమించు విషయమై సన్నిహితులనుండి అనేకవిధముల ఒత్తిడి వచ్చుట పరిపాటి. ఈబాధ ప్రభుత్వముచే తప్పింపబడినదని సంతోషింప వలసియున్నది. పంచాయితీ పరిపాలన అంతయు సిబ్బందిని నియమించుటే యనుకొను అధ్యక్షులు లేకపోలేదు. సిబ్బంది నియామకము విషయములో ఎగ్జిక్యూ టివ్ ఆఫీసరును చేయు ఒత్తిడికి మితిలేదు. తనకు ఏయే అధికారములు, బాధ్యతలు గలవో పంచాయితీబోర్డు ప్రెసిడెంటు స్పష్టముగా తెలిసి కొన వలెను. తనబాధ్యతలు, అధికార పరిమితి తెలియనినాడు అధ్యక్షుడు చీకటిలో ప్రాకులాడుట యగును. మెంబర్ల దగ్గరనుండి అధ్యక్షునివరకు పంచాయితీబోర్డు స్టాఫ్పైననే వీరి కండ్లుండును. ఎవరినినియమించిరి, ఎవ

రిసిత్తొలగించిరి అను ఆలోచనయే వీరిని ఎప్పుడు బాధించుచుండును. సిబ్బంది విషయములో వీరికింత శ్రద్ధ, శ్రమ, ఎందుకుండవలెనో అర్థము గుటలేదు. ఈశ్రద్ధలో నూరవ వంతైనను తమతమ వార్డులలో చూపి వారికష్టములను తీర్చుటకు శ్రమపడుచో వారిధర్మమును వారు నెరవేర్చిన వారగుదురు. ఇది చాలమంది సభ్యులలో కనబడదు. ఇట్టి అధ్యక్షులు సభ్యులు పంచాయితీలలో ఉన్నంత కాలము పంచాయితీలు బాగుపడ నేరవు.

పంచాయితీ అధ్యక్షుని బాధ్యత చాలగొప్పది. గ్రామాభ్యుదయమే ఆయన ఆదర్శముగ నుండవలెను. ఎల్లప్పుడును గ్రామమును బాగుచేయుటకు ప్రయత్నము చేయుచుండవలెను. సంకుచిత దృష్టిని విడనాడి, విశాలదృష్టి అలవరచు కొనవలెను. గ్రామపార్టీలకు ఆయన అతీతుడుగ నుండవలెను. గ్రామప్రజలందరికి ఆయన ఆదర్శ ప్రాయుడై యుండవలెను. లేనిచో పంచాయితీ సక్రమముగ నెరవేరదు. ద్రవ్యాపహరణకు, అధికార దుర్వినియోగమునకు శిక్షింపబడిన ప్రెసిడెంట్లు అచ్చటచ్చట యుండుట కేవలము శోచనీయము. నూతన పంచాయితీ శాసనము ననుసరించి ఉత్తమోత్తములగు అధ్యక్షులు ఎన్నుకొనబడ గలరని విశ్వసింప వచ్చును.

### —: సభ్యులు :—

సభ్యులు తమను ఎన్నుకొనిన వార్డుల బాగోగులను శ్రద్ధగా గమనించు చుండవలెను. ఎవరివార్డుల సంగతి వారు విచారించుచో గ్రామమంతయు సమిష్టిగ బాగుపడగలదు. ప్రతిరోజు తనకు తీరికయైనప్పుడు ఒకసారియైనను తనవార్డును తిరిగి వారికష్టములను తెలిసికొని వాటిని నివారించుటకు కృషిచేయవలెను. తమ వార్డునుగురించి అధ్యక్షునితో నిరంతరము సంప్రదించు చుండవలెను. ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుతో అన్ని విషయములు తెలిపి పనులు చేయించు కొనుచుండవలెను.

శోద్ధాసక్తులతో తమతమ వార్డుల స్థితిగతులను బాగుచేయుటకు ఎల్లప్పు డును కృషిచేయుచుండవలెను. ఇంతవరకు సభ్యులలో చాలమంది తమ విద్యుక్తధర్మములను సరిగ నెరవేర్చుటలేదు. వారేమి చేయవలెనో వారికే సరిగా తెలియదు. తమ సభ్యత్వమును స్వార్థపరత్వముసకే ఎక్కువ ఉపయోగించు కొనుచున్నారు. నిస్వార్థులును, ప్రజాహిత చింతనగల సభ్యులు పంచాయితీలలో లేక పోలేదు. కానిచాలఅరుదు.

## ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు ఉద్యోగము చిన్నదేగాని బాధ్యత చాల గొప్పది. జీతము చాల తక్కువేకాని పని ఎక్కువ. వీరిపని చాల కష్ట మైనది. ఇటు ప్రభుత్వమునకు అటు ప్రజలకు జబాబు చెప్పుకొను చుండవలెను. ప్రభుత్వము, ప్రజలు, అధ్యక్షుడు, సభ్యులు ఈనాలుగు వర్గముల మధ్య ఈయన నిరంతరము నలిగి పోవుచుండును. ఎంతయో నేర్పు, శాంతము సమగ్రత ఉన్నగాని పంచాయితీలలో ఎగ్జిక్యూటివ్ ఆఫీ సరు నెగ్గలేదు. న్యాయవర్తన, సమర్థత ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు కుండ వలసిన ముఖ్యలక్షణములు. ఇందులో ఏది కుంటుపడినను ఆయన ఉప దవికి అనర్హుడేయగును.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ల నియామకము ప్రభుత్వముచే బాగుగ ఆలోచించియే చేయబడినది. పంచాయితీలలో వీరిని అనవసరముగ వేయలేదు. పంచాయితీలలో చాలమంది అధ్యక్షులు విజ్ఞాన వంతులు కారు. చట్టము, నిబంధనలు వారికి బొత్తిగా తెలియవు. పైగా ద్రవ్యాపహరణము, ద్రవ్యదుర్వినియోగము పంచాయితీలలో ఎక్కు వగా జరుగు చుండుట ప్రభుత్వము గుర్తించినది. పదవికి అర్హులు కాని అధ్యక్షులు ఎన్నుకొనబడుట వలన పంచాయితీలలో పని సక్రమ ముగ జరుగుటలేదని ప్రభుత్వము తెలిసికొనినది. తీర్మానము చేసినంత మాత్రమున ప్రయోజనము లేదుగదా! దానిని కార్యరూపమున పెట్టు

టనుముందు ఎంతయో కార్యకలాపమున్నది. ఇవియన్నియు చేయనిచో ఆడిట్ వారు పరిశీలించి సర్‌చార్జి చేయుదురు. ఎంతసహృదయత, ప్రజాసేవాభిలాష అధ్యక్షునిలో ఉన్నను, నిర్వహణ విధానము తెలియ కున్నచో పనులు జరుగనేరవు. అందువలననే ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లను ప్రభుత్వము నియమించక తప్పినదికాదు. వీరి నియామకము జరిగిన తరువాతనే పంచాయితీలలో సక్రమ నిర్వహణము జరిగినట్లు ప్రభుత్వ నివేదికలు తెలుపుచున్నవి. ఇందతిశయోక్తిలేదు. కాని అదేమికర్మ మోగాని వీరియడల చాలమంది అధ్యక్షులకు ఇంకను అపోహలుండుట దురదృష్టమనియే చెప్పవచ్చును. ఇది కేవలము అధికారవ్యామోహము వలన కలిగిన అపోహయేయని తెలిసి కొందురు గాక!

ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ల సెలక్షన్ మొట్టమొదట జరిగినపుడు వీరి కెన్నియో ఆశలు కల్పింపబడినవి. వీరిని వెంటనే మ్యునిసిపల్ కమిష నర్లగా తీసికొనబడుదురని ప్రభుత్వము స్పష్టముగ ప్రకటించినది ఇది చూచి ఉన్నతవిద్యాధికులు, డబుల్‌గ్రాడ్యుయేట్లు వీటికై ప్రాకులాడిరి. కాని వీరి ఆశలు అడియాశలైనవి. వీరినిపుడు పలుకరించువారేలేరు. స్వల్పజీతములతో పొట్టలుగడుపక వీరుపడు బాధలు వర్ణనాతీతములు. చదువుకొ ఎన్నియోవేలు తగులవేసిరి. సెలక్షనుకా ఎంతయో పలుకు బడిని వినియోగించిరి. ట్రైయినింగుగా మద్రాసులో రెండునెలలుండి కష్టపడిరి. పనిచేయుటా పల్లెటూర్లలో, సంచరింపవలసినదా అమాయకు లగు ప్రజలతో, నిర్వహించ వలసినదా స్వార్థపరులగు ప్రజాప్రతినిధు లతో దినచర్య జరుపవలసినదా మోసమున కలవాటుపడిన సిబ్బందితో, జీతమా ఒకపూటకు సరిగ చాలని భత్యము బదిలీలా రాజధానిఅంతటా, చూడుడు వీరిపని ఎంతకష్టభూయిష్టమైనదో! వీరిగతిని ఎవరువిచా రించలేరు. వీరిస్థితిగతులను బాగుచేయలేనిచో ఈపదవులను ఎత్తివేయుటే అన్నివిధముల శ్రేయస్కరము. వీరిపని ఉట్టికి స్వర్గమునకు కాకుండ చేయుట కేవలము అన్యాయము.

రూల్సుకు సూటిగా పోయినచో అధ్యక్షులతోను, సభ్యుల తోను నిరంతరము పోరాటముతప్పదు. అట్లుజరిగిననాడు 'టాక్టు' (Tact) తక్కువయని పై అధికారులు రిమార్కు చేయుచుందురు. బోర్డు వీరుతో పూర్తిగ సహకరించిననాడు బలహీనత్వమును పై అధికారులే వీరికి ఆపాదించెదరు. ఇటుపోయిన నుయ్యి అటుపోయిన గొయ్యి, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ల జీవితములు దుర్భరము లనిపించుచున్నవి. ఎవరిని సంతృప్తిచేయ లేని అధికారి యగుచున్నాడు.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ల స్థితిగతులను బాగుచేయుట ప్రభుత్వపు కనీసధర్మము. వీరిజీతము లభివృద్ధిచేయవలెను. బదిలీలు ఏఒకటి రెండు జిల్లాలకో పరిమితిచేయవలెను. వీరికి ప్రమోషన్లుకు పూర్తిఅవకాశము కలుగచేయవలెను. లేనిచో ఈపదవులను పూర్తిగ రద్దుచేసి పంచాయితీలను అధ్యక్షులచేతులలో నిడుట అన్నివిధముల శ్రేయస్కరమని ప్రభుత్వము ఎంతత్వరగా గుర్తించిన అంతమంచిది.

## పంచాయితీ సిబ్బంది.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ల నియామకమునకు పూర్వము వీరు పంచాయితీబోర్డులలో చాలబాధలు పడిరని పంచాయితీరికార్డులే ఋజువు చేయుచున్నవి. ప్రెసిడెంట్లు వీరిని తమ స్వార్థపరత్వమునకే ఎక్కువగ వినియోగించుకొనిరి. సిబ్బందియు తమ స్వలాభమునకు అమాయకులగు ప్రెసిడెంట్లను ఉపయోగించుకొనిన సందర్భములు లేకపోలేదు. పనితెలియని ప్రెసిడెంట్లను చిక్కులపాల్జేసిన గుమాస్తాలు కలరు. సిబ్బందిని ముప్పుతిప్పలు పెట్టిన ప్రెసిడెంట్లుకలరు. ఎగ్జిక్యూటివ్ ఆఫీర్లు, ప్రెసిడెంట్లు, సభ్యులు వీరిలో వీరికి కలహములుపెట్టు ప్రభుద్ధులు పంచాయితీ నౌకర్లలో అనేకమందికలరు. మోసము పంచాయితీ నౌకర్లలో ఘనీభవించిపోయినది. ఇట్లని న్యాయవర్తన గలిగిన సిబ్బంది అచ్చటచ్చట పంచాయితీలలో లేకని తలపకుడు. అసాధారణమైన ప్రజ్ఞావిశేషము

కలిగిన పంచాయితీ నౌకర్లుకలరు. కాని వీరుమోసభూయిష్టమైన కొన్ని పంచాయితీలలో ఉండిపోయి అట్లనే తయారైరి. వారినసిన ప్రయోజన మేమి ? వాతావరణమే వారినట్లు చేసినది. విజ్ఞానవంతులగు కొందరు ప్రెసిడెంట్లక్రిందను, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లక్రిందను పంచాయితీబోర్డు సిబ్బంది చక్కగ పనిచేయుచున్నట్లు తెలియుచున్నది. తమపై సంపూర్ణాధికారము ఎగ్జిక్యూటివ్ అధికారులకు కలదని వీరు మరువకూడదు. అని ప్రెసిడెంటును అవిధేయతగా చూడకూడదు. సభ్యులను నిర్లక్ష్య పెట్టరాదు. పంచాయితీబోర్డు సిబ్బంది వర్తన చాలనేర్పుతో కూడు కొనినది. విధేయత, చాకచక్యము, పనిలోనేర్పు, న్యాయవర్తన పంచాయితీబోర్డు సిబ్బంది ముఖ్యలక్షణములు. మోసము, కృతఘ్నత వీరిలో నుండి పూర్తిగ నిర్మూలము కావలెను. సిబ్బందిలో చిత్తశుద్ధి సేవాభావము కలిగిననాడే పంచాయితీలు ప్రజాసేవచేయగలవు.

## పంచాయితీలపై అధికారులు.

పంచాయితీలపై అధికారులకు నూతన చట్టములోను తగు అధికారము లొసగబడినవి. స్టేట్‌లోగల పంచాయితీల పరిపాలనాబాధ్యత లోకల్ బోర్డుల ఇన్‌స్పెక్టరుకు అప్పచెప్పబడినది. వీరికి సహాయముచేయుటకు రీజయనల్ ఇన్‌స్పెక్టర్లు నియమింపబడుదురు. జిల్లాపంచాయితీ అఫీసర్లు, డిప్యూటీపంచాయితీ ఆఫీసర్లు వీరికి తోడ్పడుదురు. నూతన చట్టమునను సరించి వీరి బాధ్యత ఎక్కువ కాగలదు. పంచాయితీలను సక్రమ మార్గమున నడపుటకు వీరు సర్వదాకృషి చేయువలెను. పంచాయితీలపై అధికారమును చెలాయించుటకే వీరు ప్రయత్నింపకూడదు. పంచాయితీలలోగల లోపములను సరిచేయుచు ప్రజోపయోగ కరముగ చేయుటకు వీరు నిరంతరము పాటుబడవలెను. పంచాయితీలను ఆడ్మాయిషీ చేయునపుడు ఉపయోగకరమగు సలహ లివ్వవలయును. నూతనచట్టము నను సరించి పంచాయితీలకు ఎక్కువ స్వాతంత్ర్య మివ్వబడునని ప్రభుత్వము

ష్రికటించినది. ఇది ఆచరణలో చూడవలసి యున్నది. గ్రంథాలయము లకు ప్రయోపత్రికలు తెప్పించు కొనవలెనో పై అధికారులు నిర్ణయించ వలసిన అధోగతి ఇకముందు ఉండదనియే భావింప వచ్చును. పై అధి కారులు ఆఫీసుపని పై సిబ్బందిచేయు ప్రయాణములను ఆమోదించవల సిన దుస్థితి ఇంక ముందు తొలగి పోవచ్చును ఎస్టిమేషన్లు తయారు చేయుటను ఇప్పుడు ఎంత కాలయాపన జరుగుచున్నది. అందరకు తెలిసి నదే. సంవత్సరముల తరబడి పనులు జరుగక నిలిచిపోవుచున్నవి. కొన్ని పంచాయితీలు కలిసి అధికారులను నియమించుటకు నూతన చట్టములో అవకాశము కల్పింపబడినది. పంచాయితీలలో ఇకముందు ఓవర్సీర్లను నియమించుకొని పనులు జరుపుకొనుటకు వీలుకలదు. ఇట్టి సదుపా యములు కలుగచేయుట పై అధికారుల ధర్మము. పంచాయి తీలపై కంట్రోలు అవసరము. కాని, అది పరిమితముగా నుండవలెను. అది పంచాయితీల ప్రాథమిక హక్కులకే భంగము కలిగించునదై యుండకూడదు. పరిపాలనా దక్షులును, విశాలహృదయులును, విజ్ఞానధ నులు నగు శ్రీ. టి ప్రభాకరరావునాయుడుగారి (ఇన్స్పెక్టరు ఆఫ్‌లోకల్ బోర్డ్సు) వంటి ప్రజ్ఞావంతుల నిర్వాహణమున నూతన గ్రామ పంచాయి తీచట్టము జయప్రదము కాగలదని విశ్వసింపవచ్చును. సర్. ఎస్. గోపా లస్వామి అయ్యంగార్, సర్. టి. జి. రూథర్‌ఫర్డు శ్రీ కందుకూరి మల్లి కార్జునం గార్ల వంటి దక్షతగల అధికారులు లోగడ పంచాయితీలను బాగు చేయుటకు నిరంతరము కృషిచేసిరి. వీరిని ఆదర్శముగ నిడికొని పంచాయి తీలపై అధికారులు తమ విదుక్తధర్మములను నిర్దుష్టముగ ఆచరించుచూ పంచాయితీలు సక్రమముగ నిర్వహింపబడగలవు. ప్రజలు సుఖవంతులై యుండగలరు.

## పంచాయితీ నిర్వాహణ

పంచాయితీ నిర్వాహణ బాగుగ తెలిసినకాని పంచాయితీ పరి పాలన నిర్దుష్టమైయుండదు. పంచాయితీ నిర్వాహణము సక్రమముగ

జరుగుచో పంచాయితీలు గ్రామాభ్యుదయమునకు పాటుపడగలవు. పంచాయితీ నిర్వహణమునకు కొన్ని విషయములు సూత్రప్రాయముగ ఈక్రింద ఉదహరింపబడినవి. ఇవి కేవలము సూచనలు మాత్రమే. వివరములకు చట్టము, జి. ఓలు, డిస్ట్రిక్ట్ బోర్డు మాన్యుయలు, స్టాట్యుటరీ నిబంధనలు చూచుకొనవలెను.

ఆఫీసు :—

ఆఫీసు విశాలముగా, శుభ్రముగా నుండవలెను. సిబ్బంది అందరు పనిచేసికొనుటకు వీలుగా నుండవలెను, అవసరమైన బల్లలు, కుర్చీలు ఉండవలెను. ప్రెసిడెంటుగది, ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగది, శానిటరీఇన్‌స్పెక్టరుగది, గుమాస్తాలగది, బిల్ కలెక్టర్లగది, రికార్డురూమ్, లైటింగ్ రూమ్, లంబర్ రూమ్, మీటింగుహాలు మున్నగునవి విడిగానుండవలెను. ఏయే గదులు ఎందుకు ప్రత్యేకించబడినవో నోటీసుబోర్డు లుండవలెను. చిత్తుకాగితములు వేసికొనుటకు ప్రతి టేబిల్ దగ్గర బుట్ట లుండవలెను. అగ్నిమాపక బకెట్లు ఉంచవలెను. ప్రకటనలను తెలుపు నోటీసు బోర్డులుండవలెను. ఆఫీసు కడు శుభ్రముగానుండి చూచుటకు చాల అందముగా నుండవలెను. ఇల్లు చూచి ఇల్లాలును చూడవలెనను సామెతమనకు తెలియునుగదా! ప్రతి ఆఫీసుకు ఇనపపెట్టె అత్యవసరము. గ్రామప్లాను ఉండవలెను. జి.వోలు తెలుపు స్టాక్ ఫైల్సు ఉంచవలెను. పంచాయితీ జర్నలులను జాగ్రత్తగా ఉంచవలెను.

రికార్డు గది:—

డిస్ట్రిక్ట్ బోర్డు ఆఫీసు మాన్యులను చదివి వాటిప్రకారము ఆచరించవలెను. పంచాయితీ రికార్డులన్నియు కడు భద్రముగా నుంచవలెను. రికార్డుగది ప్రత్యేకముగ నుంచవలెను. చెదపట్టకుండ చూచుచుండవలెను. రాక్ రిజిస్టరు (Rack Register) రికార్డుఇచ్చు రిజిస్టరు Issue Register) ముఖ్యముగా ఉంచవలెను. (ప్రతిసంవత్సరము)

నాశనముచేయవలసిన రికార్డులు తగులబెట్టవలెను. నాశనము చేసిన రికార్డుల లిస్టు ఉంచవలెను.

మీటింగులు :—

మీటింగులు క్రమము తప్పక పెట్టవలెను. నెలకొక సాధారణ సమావేశము తప్పక ఏర్పాటు చేయవలెను. మీటింగు నోటీసు ఎజండా ప్రతిసభ్యునికి సకాలములో అందజేయవలెను. మీటింగులకు సక్రమముగా హాజరుకాని సభ్యుల విషయములోను, పన్ను సకాలమున చెల్లించని సభ్యుల విషయములోను చర్య వెంటనే తీసికొనవలెను. మినిట్ పుస్తకము పంచాయితీ రికార్డులలో ముఖ్యమైనరికార్డు. దానిలో కొట్టివేతలుండరాదు. ఉండిన, అధ్యక్షుని సంతకముండవలెను.

రిజిష్టరులు :—

పంచాయితీ రిష్టరులను ఎప్పటికప్పుడు శ్రద్ధగా వ్రాయుచుండవలెను. ప్రతిరోజు చిట్టా, క్యాష్‌బుక్ వ్రాసితీరవలెను. సాయంకాలమునకు ఎంతడబ్బు నిల్వఉన్నది తేల్చుకొని వందరూపాయలపైనఉన్న మరుసటి రోజున బ్యాంకిలోవేసి తీరవలెను. ఇందు ఏమాత్రము అశ్రద్ధ చేయకూడదు. ప్రతి ఖర్చుకు బిల్లు, వోచరు ఉండవలెను. ప్రతిజమకు రశీదు ఉండవలెను. స్టాక్‌రిజిష్టరు (Stock Register) సామానుల రిజిష్టరు (Tools and plants Register) లైటింగ్ రిజిష్టర్ (Lighting Register) ఎప్పటికప్పుడు స్టాకుతో సరిచూచుచుండవలెను. ఫారములు వగైరా (Money Valuableforms) డబ్బుతో సమానముగా చూచుచు సరిగా ఉంచవలెను. స్థిరాస్థి రిజిష్టరును ఉంచవలెను. పంచాయితీకి సంబంధించిన స్థిరాస్థులను జాగ్రత్తగా కాపాడుచుండవలెను. వాటినుండి రావలసిన ఆదాయములను ఎప్పటికప్పుడు రాబట్టుచుండవలెను. అవసరము కలిగినపుడు బిల్లువ్రాసి బ్యాంకునుండి ఎంతసొమ్ముకావలెనో అంతసొమ్మమాత్రమే డ్రాచేయవలెను. జీతములు

వగైరా ఇవ్వవలసినవారికి ఎక్విటెన్సు రిజష్టరు (Acquittance Register) లో సంతకము చేయించుకొని ఇవ్వవలెను. ఇతరులకు వోచర్లపై ఇవ్వవలెను. పీరియాడికల్ రిజష్టరు ( periodical Register ) ను జాగ్రత్తగా వ్రాయుచు ఆఫీసునుండి పైకిపంపవలసిన రిటర్నులను, ఆఫీసుకురావలసిన రిటర్నులను జాగ్రత్తగా కనిపెట్టుచుండవలెను. ఆలస్యమైన వెంటనే చర్యతీసుకొనవలెను. సూట్ రిజష్టరు (Suit Register) సక్రమముగా వ్రాయుచుండవలెను. సూట్సు విషయములో కార్యనిర్వాహణాధికారి తగుచర్య ఎప్పటికప్పుడు తీసికొనవలెను. ఆఫీసు ఆర్డరు (Office order book) పుస్తకముఉంచి సిబ్బందికి జనరల్‌గా ఉపయోగించు ఉత్తరువు లిచ్చుచుండవలెను. వేలమువేయు రిజిష్టరు జాగ్రత్తగా ఉంచవలెను. వేలమువేయుటకు ముందు చేయవలసిన ప్రకటన వగైరా రూల్సు ననుసరించి చేయవలెను. వేలము బహిరంగముగా, సక్రమముగా జరుగవలెను. వర్కు డిస్ట్రిబ్యూషన్ ప్రకటన గుమాస్తాలకు, బిల్‌కలెక్టరులకు వేరువేరుగా నుండవలెను. పనిని సిబ్బంది అందరికిసమానముగా పంచవలెను. ఆక్రమణలు (Encroachments) ఎప్పటికప్పుడు కనిపెట్టి చర్యతీసికొనవలెను. ఆక్రమణ రిజస్టరు ఎప్పటి వ్రాయవలెను. ఆకమణలపై పూర్తి అధికారము పంచాయితీలకిచ్చినగాని వీటివిషయమై సక్రమముగా పనిజరుగదు. రెవెన్యూ డిపార్టుమెంటువారి అనవసర జోక్యము వీటినిచాల క్షతరము చేయుచున్నవి. పంచాయితీ పై అధికారుల అజ్మాయిషికి లోబడి వీటివిషయమై అంత్యనిర్ణయము పంచాయితీకే ఉండవలెను. ఆఫీసుకువచ్చిన కాగితములు, అర్జీలు తెలుపుటకు పెర్సనల్ రిజిస్టర్లు, ( Personal Registers) డిస్ట్రిబ్యూషన్ రిజిస్టరు (Distri-bution Register) ఉండవలెను. ప్రతిగుమాస్తాకు ఒక పెర్సనల్ రిజిస్టర్ ఉండవలెను. డిస్ట్రిబ్యూషన్‌రిజస్టరు కొాకరన్నింగ్ నోట్‌ఫైల్, ప్రతి పెర్సనల్ రిజిష్టరు కొకరన్నింగ్ నోట్‌పైల్‌ఉంచవలెను. కనీసము నెలకొకసారియైనను తనిఖీచేసి రిమార్కులు వ్రాయవలెను. ఆఫీసుకు వచ్చు ప్రతికాగితముపై చర్యతీసికొని తీరవలెను.

ఆదాయము :—

పంచాయితీ ఆదాయపు డిమాండులను సకాలములో నిర్ణయించవలెను. డిమాండు రిజష్టరులను జాగ్రత్తగా వ్రాయవలెను. ఆదాయపు అయిటములలో ఏవియు కాలదోషము (Time Bar) పట్టకుండ తగు జాగ్రత్తగా కనిపెట్టవలెను. ఇందు ఏమాత్రము అశ్రద్ధ వహించిన సర్‌చార్జి కాగలదు. పంచాయితీ పండ్సుకు చేర్చ (Adjust) వలసిన లాండ్ సెస్ (Land cess) సర్‌చార్జి మొత్తము (Surcharge amount) ఎంటర్ టేన్‌మెంటు టాక్సు (Entertainment Tax) జరిమానల మొత్తములు, ఫిషరీ రెంటల్సు ఎప్పటికప్పుడు పంచాయితీ నిధికి జమకట్టునట్లు చూడవలెను. ఇండ్లపన్నులు వేయవలసిన నెలలవారీ లిస్టులను పరిశీలించి కార్యనిర్వహణాధికారి ఎప్పటికప్పుడు స్వయముగా చూచి పన్నువిధింపవలెను. డి & ఓ (అపాయకరములు దుస్సహాములగు వృత్తులు) నెలలవారీ లిస్టులను అసలు లిస్టును కార్యనిర్వహణాధికారి స్వయముగా తనిఖీ చేయవలెను. తాత్కాలిక కట్టడములపై పన్ను వసూలు చేయవలెను. సాముదాయక అదాయమగు చేపలపాటలు, వచ్చు గడ్డిపాటలు, చెట్లఫలసాయము, ఎండిపోయిన పడిపోయినచెట్లు, వీధికసవు, పేడ, చెత్త, పాటల వలన వచ్చు ఆదాయము సక్రమముగా రాబట్టవలెను. డిపాజిట్లమీద వడ్డీ, పంచాయితీకివచ్చు గ్రాంటులు సకాలమున రాబట్ట వలెను. పాతసామానులు, పాతపత్రికలు ఎప్పటికప్పుడు వేలమువేయ వలెను. భూములపై, ఇండ్లపై వచ్చు ఆదాయము శ్రద్ధగా వసూలు చేయవలెను. పంచాయితీకి వచ్చు ఆదాయమును కడుశ్రద్ధతో వసూలు చేయవలెను. డిమాండు అంతయు ఏసంవత్సరమున ఆసంవత్సరము విధిగా వసూలు కావలెను. ఇందు కార్యనిర్వహణాధికారి అత్యంత శ్రద్ధ తీసికొనవలెను. బాగుగా వసూలుచేసిన బిల్ కలెక్టరులకు బోనస్ కూడా ఇచ్చుటను ప్రభుత్వము అనుమతించినది. రెమిషన్‌లు రైటాఫ్‌లు

రూల్సు ననుసరించి జాగ్రత్తగా చేయవలెను. అధికారము దుర్వినియోగము చేయకూడదు.

పబ్లిక్ హెల్త్

ప్రజారోగ్యము (Public Health)

ప్రజారోగ్యము చాల ముఖ్యమైనది. ఇందుఏమాత్రము అశ్రద్ధ చేయకూడదు. గ్రామమంతయు ప్రతిదినము ఊడ్పించవలెను. పంచాయితీలోగల మురుగునీటి కుండీలను తోడించవలెను. నూతులను చెరువులను ఎప్పటికప్పుడు క్లోరినేట్ చేయవలెను. శుభ్రముగా నుండుటకు వలయు నోటీసు బోర్డు లుంచవలెను. రోడ్లను ఎప్పటికప్పుడు మరమ్మతు చేయింపవలెను. పాచ్ రిపేర్లు చేయుటలో ఏమాత్రము అశ్రద్ధగాని ఆలస్యముగాని చేయరాదు. కలరా, మశూచికము మున్నగు అంటువ్యాధులురాకుండ తగు జాగ్రత (Preventive measures) ముందుగా తీసికొనుట అవసరము. అంటువ్యాధులు వచ్చిన వెంటనే చర్యతీసికొనవలెను. రాత్రింబగళ్ళు పనిచేసి వ్యాధిని నివారింపవలెను. పంచాయితీ రబ్బిష్ డిపోను జాగ్రత్తగా ఉంచవలెను. కంపోస్టు (Compost) ఎరువు రైతులకు చాల ఉపయోగముగ నున్నది. ప్రతి పంచాయితీలోని వీధి కసవును, మలమును వృథాచేయక కంపోస్టును విధిగా తయారుచేయించవలెను. కంపోస్టు ఎరువు ఉపయోగము రైతులకు తెలిపి అధికాహారోత్పత్తికి తోడ్పడవలెను. పంచాయితీలో గల సినీమాలను, ఫాక్టరీలను ఎప్పటికప్పుడు తనిఖీ చేయుచు, లైసన్సు షరతులు అనుసరించునట్లు చేయవలెను వినోదములపై పన్నును (Places of Public Resort Act) వసూలు చేయవలెను. పంచాయితీలోగల స్మశానములలో షెడ్లు, నీటివసతి తప్పకఉంచవలెను. స్మశానములు పవిత్రవంతముమైనవిగ భావించి శుభ్రముగా ఉంచవలెను. జంతువధశాలలు నిర్మించి వాటిని జాగ్రత్తగాఉంచి అందులోనే జంతువధ చేయింపవలెను. జంతు

వులను వధించుటకు ముందు తరువాత ఆరోగ్యశాఖాధికారిచేత సర్టిఫై చేయింపవలెను. ఆరోగ్యశాఖకు సంబంధించిన మందులు ఫినయిల్ వగైరా కలరామందులు, వాక్సినేషన్ మందులు ఉంచవలెను. అవసరమైనప్పుడు వాడవచ్చును. పంచాయితీలోగల డస్‌బిన్నులకు, లైట్లకు నెంబర్లు వేసి తగుజాగ్రత్తగా ఉంచవలెను. ప్రైవేటు స్కావెంజిగ్ ఫీజు స్వయంపోషకంగా ఉండునట్లు చూడవలెను. బస్‌స్టాండు, కారుస్టాండులలో పాసెంజరుషెడ్లు, మంచినీటి వసతి, పాయిఖానా ఏర్పాట్లు చేయవలెను. శుభ్రముగా ఉంచవలెను. మార్కెట్లు శుభ్రముగాఉంచవలెను. అందుఅవసరమైనషెడ్లు, పాయిఖానా ఏర్పాట్లుచేయవలెను. డి అండ్ ఓ వృత్తులకు ఉపనిబంధనలు (Bye-laws) తయారుచేసి పై అధికారుల అనుమతి పొంది అమలు జరుపవలెను. నివాసయోగ్యమైన, పరిశ్రమలకు అనుకూలమైన (Residential and Non Residential) స్థలములను నిర్ణయించి పై అధికారుల ఆమోదము పొందవలెను. టౌన్‌ప్లానింగ్ చట్టము ప్రతి పంచాయితీలోను అమలుజరుపవలెను. కల్తీ ఆహారపదార్థ చట్టము అమలు చేయవలెను. పంచాయితీలో పనిచేయు ఆరోగ్య సిబ్బందికి, జమానులకు రూల్సు ననుసరించి సంవత్సరమునకు రెండు డ్రెస్‌లు ఇవ్వవచ్చును. స్వల్పజీతములతో బాధపడు వీరికి సాయము తప్పక చేయవలెను. పాకీపనివాండ్రకు క్యాజయల్‌లీవు సిక్‌లీవు సౌకర్యములు రూల్సు ననుసరించి ఇవ్వవలెను. పంచాయితీకి పార్కు విధిగా ఉండవలెను. పార్కును శుభ్రముగా ఉంచి నేత్రానంతము, హృదయానందము కల్గించునట్లు చేయవలెను. పార్కులో రేడియోను ఏర్పాటుచేయవలెను. ప్రభుత్వపు ఉత్తరువుల ననుసరించి ఆరోగ్యవారము, కంపోస్టువారము, వనమహోత్సవవారము, గ్రంధాలయవారము మున్నగునవి జరిపి ప్రబోధము గావింపవలెను.

ఎస్టి మేట్లు :—

ఎస్టి మేట్లు, ముందు బోర్డుశాంక్షనుపొంది తరువాత అవసరమైన అధికారుల అనుమతిపొంది పని ప్రారంభింపవలెను. చెక్కు మెజరుమెంటు ఏఅధికారి చేయవలెనో ఆ అధికారిచేతనే చేయింపవలెను. చెక్కు మెజరు మెంటు పుస్తకము, రోడ్డురిజస్టరు, రిజస్టరు ఆఫ్ అలాట్ మెంట్స్ అండ్ ఎస్టిమేట్సు, రిజస్టరు ఆఫ్ వర్క్సు జాగ్రత్తగా వ్రాయవలెను.

బడ్జెట్ :—

బడ్జెటు ననుసరించి ఖర్చుచేయవలెను. అత్యవసర పరిస్థితులలో ఎక్కువ ఖర్చుఅయిన అలాట్ మెంటులు ట్రాన్స్ఫర్ ద్వారా మంజూరు చేయించుకొనవలెను. బడ్జెటు పై అధికారుల అనుమతి పొందవలసి యున్నది.

అప్పీళ్ళు :—

అప్పీళ్ళు న్యాయముగ విచారింపవలెను. రివిజన్ అర్జీలను ముందు కార్యనిర్వహణాధికారి విచారించవలెను. విచక్షణారహితముగ పన్నులు తగ్గించకూడదు. న్యాయముగచూచి న్యాయముగ పన్నులు తగ్గిపవలెను.

ఆడిట్ :—

ఆడిట్ అభ్యంతరములను జాగ్రత్తగా పరిష్కరించుచు సరి చూచుచుండవలెను. ఆడిట్ సర్ చార్జి మొత్తములు ఎప్పటి కప్పుడు వసూలు చేయవలెను.

గ్రంథాలయములు — పఠనమందిరములు :—

విజ్ఞానమునకు మూల కందములైన గ్రంథాలయములను, పఠన మందిరములను ప్రతిపంచాయితీ ఏర్పాటు చేయవలెను. వాటిని అభివృద్ధి పరచవలెను. పంచాయితీచేయవలసిన ముఖ్యమగు పనులలో ఇదియొకటి.

ప్రజలకు విజ్ఞానమొసగిన సంస్కృతి అప్పుడే ఏర్పడగలదు. సంస్కృతి ఏర్పడిన గ్రామములు వాటియంతట అవే బాగుపడగలవు.

కార్యనిర్వహణాధికారి :—

కార్యనిర్వహణాధికారి ప్రతిరోజు ఉదయము గ్రామములో తిరిగి ప్రతి విషయమును పరిశీలించవలెను. సిబ్బందిచేయుపనులను తనిఖీచేయవలెను. పెర్సనల్ ఇన్స్పెక్షను చేయవలెను. ప్రజల కష్టములను విచారించవలెను. పంచాయితీపనులను తనిఖీచేయవలెను. గ్రామములో తిరుగునపుడు బిల్ కలెక్టర్లు పన్ను వసూలుచేసినపుడు ఇచ్చిన రసీదులను తనిఖీచేయవలెను. నూటికి అయిదు రసీదులైనను తనిఖీచేసితీరవలెను. సాయంకాలము ఆఫీసుకువచ్చి ఆఫీసుపని చూడవలెను. సుపీరియర్ సర్వీస్‌లో ఉన్న ప్రతిఉద్యోగస్థుని పనితనమును, గుణమును తెలుపు ఫైల్స్ (Confidential files) వ్రాయవలెను. దినచర్య (Diary) వ్రాయవలెను. ప్రతిరోజు దినచర్య వ్రాయనిదే ఆఫీసు వదలరాదు.

ఇ త ర ము లు:—

గ్రామాభ్యుదయమే పంచాయితీవారి కర్తవ్యము. పై అకారుల ఉత్తరువులను బడసి గ్రామ శ్రేయస్సుకు ఏపనియైనను చేయవచ్చు. ఆంబోతులను పెంచి సరియైన పశువృద్ధిని ప్రోత్సహించవచ్చును. దోమలున్నచోట దోమలుచంపుటకు (Anti mosquitto meanures)డి. టి. టి. పౌడరుఉపయోగించవలెను. డ్రెనేజివాటర్ సప్లయి, విషయమై ప్రతి పంచాయితీ శ్రద్ధతీసికొనవలెను. నూతన చట్టము ననుసరించి గృహాపరిశ్రమల అభివృద్ధికి పంచాయితీ పాటుబడవచ్చును. ఎక్విజిషన్ ఎలియనేషన్ విషయములో నూతన చట్టములో ఏ సౌకర్యములు చేయబడలేదు. వీటికై రెవెన్యూ డిపార్టుమెంటువారు చేయుచున్న విపరీతమగు ఆలస్యముచే ఎలియనేషను జరుగక అనేకపనులు జరుగకున్నవి. నూతన

పంచాయితీ చట్టము ననుసరించి విస్తృతాధికారములు పంచాయితీలకు ఇవ్వబడినవి. వీటిని సద్వినియోగము చేసికొను బాధ్యత పంచాయితీలపై కలదు.

స్థానిక శాఖామాత్యులగు శ్రీ కల్లూరి చంద్రమౌళిగారి ఈక్రింది ప్రబోధవాక్యములు గమనార్హములు.

“ చట్టమెంత చక్కగనున్నను అది జీవరహితయంత్రము వంటిది. దానికి ప్రాణము దానినడపు ప్రతినిధులే. వారిప్రవర్తన ననుసరించియే దానిఫలితము నిర్ణయమగుచుండును. కాబట్టి ప్రస్తుతము గ్రామవ్యవహారములు సక్రమముగ నిర్వహించుటకు సుచరితులగు యువకులు అత్యావసరము. స్థానికసంస్థల ప్రయోజనము ప్రజాసేవయందే కలదు. స్వార్థత్యాగులగు సేవాపరాయణులు ఈసంస్థలలో ప్రవేశించిననాడే ప్రజలకు నిజమైన శ్రేయస్సుకూరును, ఇట్టిసేవయే ప్రతి పౌరుని ధర్మము. అద్దానిని తనసాటి గ్రామవాసుల కందించిన నాడే పంచాయితీరాజ్యము ప్రజారాజ్యమగును. ”

ఓం తత్సత్.

# 1950 గ్రామపంచాయితీ చట్టము.

—: ఇండెక్సు :—

# 1950 గ్రామపంచాయితీ చట్టము - వివరణ.

## —: 1950 నె 10 రు మద్రాసు ఆక్టు :—

పంచాయితీలు గ్రామపరిపాలనను యిప్పటికంటెను బాగుగా జరుపుటకు పంచాయితీలకు ప్రత్యేకముగ చేయబడిన చట్టము.

1. సెక్షన్ — యీ ఆక్టుకు 1950 గ్రామపంచాయితీల ఆక్టు అనిపేరు. మద్రాసు నగరము, మునిసిపల్ పట్టణములు, కంటోన్మెంటుపట్టణములు తప్ప, మద్రాసురాజధానిలోని మిగత అన్ని ప్రదేశములకు యీ ఆక్టు అమలుజరుగవలెను. యీ ఆక్టు అమలుకు రాబడు తేదీని గవర్నమెంటువారు ఫోర్టుసెంట్ గెజటులో ప్రకటించవలెను.

2. సెక్షను —యీ ఆక్టులోని కొన్నిమాటలకు యీక్రిందవిధముగా అర్థముచేయవలెను.

“కట్టడము” అనుమాటలో, ఇల్లు, కాశీయిల్లు, గాడిఖానాలు, పాయిఖానాదొడ్లు, పాకలు. (ఎనిమిది అడుగులకు ఎత్తుకు లోపుగావుండు గుడిసెలు కాని గుడిసెలుతప్ప) గుడిసెలు, ఇటుక కలప లోహములుతో నిర్మించబడిన అన్నిరకమైన కట్టడములు యీ మాటలో చేరును.

“జిల్లాబోర్డు” అనగా జిల్లాపరిపాలన కొరకు నియమించబడిన సంస్థ.

“కార్యనిర్వహణాధికారి” అనగా పంచాయితీ కార్యములను జరుపుటకు ఎక్జిక్యూటివు అధికారిగా నియమించబడిన వారు అట్లు నియమించబడని పంచాయితీ సందర్భములో పంచాయితీయొక్క ప్రెసిడెంటు అనిఅర్థము.

“ఇల్లు” అనగా ఆయింటికి మార్గము ఒకటిగానున్ననూ, దాని ముఖద్వారము వేరుగానున్ననూ, అంగడి, వర్కుషాపు, గిడ్డంగి, గాడిఖానా, బస్సుస్టాండు, యీ మాటలో చేరును.

“గుడిసె” అనగా కొయ్యలు, ఆకులు, గడ్డితో బురదలోకట్టిన గుడిసె అని అర్థము పంచాయితీవారు తమపంచాయితీలో “గుడిసెలు” అనుమాటకు వివరణము ఏర్పరచవచ్చును.

“పాయిఖానా” అనుమాటలో మూత్రవిసర్జన దొడ్డిగూడాచేరును.

“ప్రైవేటురోడ్డు” అనగా పబ్లికురోడ్డు కానట్టివీధి. చవరము, బయలు, సందు, దారి యీమాటలోచేరును. అయితే యీమాటలో పబ్లికు పంతెనమీద గట్టుమీదవుండు బాట, కాలిబాట, దానికి సంబంధించిన జలవాహులు, దానికి పక్కలలోవుండు ఖానిగీసొత్తు, యీమాటలో చేరును.

" నివాసము " అనగా ఒకయిల్లును కొన్నిసమయములలో వాడుకొనుట, అందులో నిద్రించుట, అప్పుడప్పుడూ అందులోవుంచుట, అనిఅర్థము. మరల ఆయింటికివచ్చు ఉద్దేశ్యముతో కాళీగా వుంచిననూ, నివాసమని అర్థము.

" రివిన్యూ గ్రామము " అనగా గవర్నమెంటు రివిన్యూ లెక్కలలో ఒక గ్రామముగా వుండిన గ్రామము అని అర్థము. ఇన్‌స్పెక్టరు ప్రకటించిన దాని సివారు గ్రామములుగూడా యీమాటలో చేరును.

" షెడ్యూలు కులములు " అనగా ఇండియా రాజ్యాంగచట్టములో చెప్పబడిన షెడ్యూలు కులములు.

" రిజర్వుచేయనిఅడవి " అనగా ఫారెస్టు ఆక్టుకింద రిజర్వుగా ప్రకటింపబడని అడవి, యిందులో గవర్నమెంటువారి స్వాధీనములో యుండు రిజర్వుచేయని భూములుగూడాచేరును.

" గ్రామము " అనగా యీ ఆక్టుకింద ప్రకటింపబడిన గ్రామము.

" సంవత్సరము " అనగా ఏప్రెల్ మొదలు మార్చి కడపటివరకు సంవత్సరము.

3 వ సెక్షన్ - (1) యీఆక్టు ప్రారంభము కాబడిన తర్వాత సాధ్యమైనంత త్వరలో యీక్రిందివిషయము ప్రకటనచేయవలెను.

(1) 500 కు తక్కువలేని జనసంఖ్యగల ప్రతి రివిన్యూగ్రామమును యీ ఆక్టుకొరకు ఒక పంచాయితీ గ్రామముగా ప్రకటించవలెను.

(2) 500 లకు తక్కువ జనసంఖ్యగల రివిన్యూగ్రామమును ప్రక్కగ్రామముతో కలిపి అట్లుకలుపబడిన రివిన్యూగ్రామ జనసంఖ్య 500 లకంటె తక్కువలేకుండాచేసి అట్లు కలుపబడిన గ్రామములను ఒకటిగా యీఆక్టుకొరకు ఏర్పరచవలెను.

(2) (A) ఇన్‌స్పెక్టరు ప్రకటనద్వారా ఒక గ్రామములో చేరియుండు ఏ రివిన్యూ గ్రామమునైననూ దానినుండి మినహాయించవచ్చును. అయితే అట్లు మినహాయించబడిన పిమ్మట ఆగ్రామసంఖ్య 500 లకు తగ్గకూడదు.

(B) అట్లు మినహాయింపుచేయబడిన గ్రామమువిషయములో ఆ సందర్భముకు తగినట్లు 500 లకు తక్కువకాని జనసంఖ్యను 1 వ సబుసెక్షను విధముగా చర్యతీసుకొనవలెను.

(C) పై విధముగా ప్రకటించుటకు ముందుగా అట్టిప్రకటనవల్ల బాధించబడు పంచాయితీలోని ప్రజలయొక్క ఆక్షేపణలను తెలుపుకొనుటకు సాధ్యమైనంత అవకాశమును యివ్వవలెను. అట్టి ఆక్షేపణలు ఏమైనా వచ్చినయెడల వాటిని చక్కగా ఆలోచించవలెను.

(3) అంతరించిపోయిన పంచాయితీ స్వాధీనములోఉండిన దానిరుణములను పరిష్కారము చేయుటను గురించిన్ని.

ఏదైనా పంచాయితీ తనవిచారణ అధికారమును చలాయించకుండా నిలిపివేసిన

సందర్భములో దాని పరముగా వుంచబడిన ఆస్తిని గురించి తీర్మానించుటకున్నూ సంబంధించిన షరతులకు తనకు యుక్తమనితోచిన వుత్తరువులు ఇన్‌స్పెక్టరు చేయవచ్చును. అందులో షరతులు నిబంధనలు కూడా చేర్చవచ్చును.

అట్టి షరతులలో ముఖ్యముగా యీక్రింది వాటిని గమనించవలెను.

1. పంచాయితీకి బాకీవుండుపన్ను, రుసుము, చెల్లించుకొనుటకు తగిన అధికారిని నిర్ణయించుచూ

2 అట్లు పంచాయితీ నిలిచిపోయిన కాలముకు బాకీగాయుండు పనులు, పన్నులు, రికార్డులు, లెఖ్ఖలు, అర్జీలు, విచారణలు, అప్పీళ్ళు పరిష్కారము జేయుటనుగురించి తగు వుత్తరువులు చేయుచు

4. సెక్షన్ — (1) ప్రతి గ్రామమునకునూ 30 వ శెక్షను (1) క్లాజుమేరకు ప్రకటనలో నిర్ణయించబడిన తేదీనుండి పంచాయితీ నిర్మించబడవలెను.

(2) యీ ఆక్టుయొక్క రూల్సుకు లోబడి గ్రామపరిపాలన పంచాయితీ పరముగా యుండవలెను. అయితే యీ ఆక్టు క్రింద లేదా యితరఆక్టు క్రింద ప్రెసిడెంటుకు లేదా కార్యనిర్వాహణోద్యోగికి లేదా యితర అధికారివర్గముకు గాని స్పష్టముగా ప్రత్యేకించబడిన పనులను పంచాయితీ నెరవేర్చకూడదు.

(3) ప్రతిపంచాయితీయునూ ప్రకటనలో నిర్ణయించబడిన గ్రామపు పేరుతో కలియబడిన సభగా వుండవలెను. అందుకు సముదాయసీలును కలిగియుండవలెను. యీ ఆక్టువల్ల విధించబడిన నిర్బంధముకు అర్హతకు లోబడి ఆ పేరుతో ఏదైనా వ్యాజ్యములు చేయుట, ఆస్తిని సంపాదించుట, ఖరాదులు చేయుట వగైరా యీపత్తు కార్యములు చేయుటకు అధికారము కలిగి యుండవలెను.

5. శెక్షను (1) A అయిదు వేలకంటె తక్కువ లేనట్లు అంచనా వేయబడిన జనాభా మీద విచారణ అధికారము గలిగి 10 వేలకు తక్కువలేకుండా అంచనాగల సంవత్సర ఆదాయముగల పంచాయితీలు 1 వ తరగతిగా నుండవలెను.

B తక్కిన పంచాయితీలు అన్నియు 2 వ తరగతిగా నుండవలెను.

(2) గవర్నమెంటువారి అభిప్రాయములో పై A క్లాజులో చెప్పబడినది తృప్తిగాలేనియెడల పంచాయితీ తరగతిని మార్చవచ్చును.

(3) పైవిధముగా జరిపిన మార్పును ఆక్షేపించుచు ఏకోర్టులోగాని వ్యవహారముచెల్లనేరదు.

6. శెక్షను (1) పంచాయితీ మెంబర్ల మొత్తపు సంఖ్యను ప్రెసిడెంటును మినహాయించి జనసంఖ్య ననుసరించి ఇన్‌స్పెక్టరు ప్రకటించవలెను.

(2) ఆయనకు పై ప్రకటనను అప్పుడప్పుడు మార్చుటకు అధికారముగలదు.

(3) పైవిధముగా చెప్పబడిన సంఖ్య 5 కు తక్కువగానూ 15 కు ఎక్కువగానూ వుండకూడదు.

7. శెక్షన్ — పంచాయితీ మెంబర్లు, నిర్ణయమైన విధముగా ఎన్నుకొనబడవలెను.

8. శెక్షన్ — (1) నిర్ణయ విషయమునకు లోబడి గ్రామములో షెడ్యూలుజాతి సంఖ్యకు స్థానములు వున్నయెడల తగినట్లు ఇన్‌స్పెక్టరు యుక్తమని తలచిన విధముగా వాటిని ప్రత్యేకించవచ్చును.

(2) పైవిధముగా చేయబడిన ప్రత్యేకింపు యీ అక్టు ప్రారంభమునకు 10 సంవత్సరములు గడచిన తర్వాత మొదట సాధారణ ఎన్నికలు జరుగువరకు అమలులో యుండవలెను.

(3) 1 వ పద్ సెక్షన్‌లో నుండునది, ప్రత్యేకింపబడిన షెడ్యూలువారు ప్రత్యేకింపబడని జాతివారి స్థానములకు పోటీచేయుటకు ఆటంకము కలుగ కూడదు.

9. శెక్షన్ — (1) పంచాయితీ సభ్యులను ఎన్నుకొనుటకు, ఇన్‌స్పెక్టరు పంచాయితీని ఆలోచించిన మీదట ప్రకటనద్వారా గ్రామమును వార్డులుగా భాగించి ప్రతివార్డుకు సభ్యుల సంఖ్యను నిర్ణయించవలెను.

(2) 1 వ తరగతి పంచాయితీని 5 వార్డులకు తక్కువ గాకుండా 2 వ తరగతి పంచాయితీని వెయ్యికి తక్కువ జనసంఖ్యగల దానిని 2 వార్డులుగా విభజించవలెను.

10. శెక్షన్ — (1) సామాన్య ఎన్నికలలోని ప్రతిపంచాయితీ మెంబర్లు కాలము కాళీలు ఏదినమున కలుగునో ఆరోజు మధ్యాహ్నము ప్రారంభమై 3 సంవత్సరములు వరకు వుండును.

అయితే ఇన్‌స్పెక్టరు ప్రకటనద్వారా తగిన కారణమునుబట్టి మొత్తముగా పంచాయితీ మెంబర్ల కాలమును 3 నెలలకు జాస్తిలేకుండా పొడిగింపుగాని తగ్గింపుగాని చేయవచ్చును.

(2) పంచాయితీలో ఎన్నుకొనబడిన మెంబరు వుద్యోగములో కలుగు కాళీలు సామాన్య ఎన్నికద్వారా భర్తీచేయబడవలెను. ఎన్నిక అధికారి కాళీకి ముందు 3 మాసములు లోగా యుక్తమని తోచిన తేదీని జరుగునట్లు నిర్ణయించవలెను. అయితే చాలినంత కారణము మీద గవర్నమెంటువారు కాళీ ఏర్పడిన తర్వాత జరుపవలసినట్లు వుత్తరువు చేయవచ్చును.

(3) A. పంచాయితీకి ఎన్నుకొనబడిన మెంబరు వుద్యోగములో కలుగు ఆకస్మిక కాళీని దాని కార్యనిర్వాహణాధికారి ఎలెక్షన్ అధికారికి నిర్ణయకాలములో రిపోర్టుచేయవలెను.

B. ఆకస్మిక కాళీలో ఎన్నుకొనబడిన మెంబరు వెంటనే వుద్యోగములో ప్రవేశించవలెను. అయితే అతను ఎన్నుకోబడిన మెంబరు స్థానముకు వుండుకాలముకు మాత్రమే వుద్యోగమును కలిగియుండవలెను.

(C) ఏపంచాయితీయొక్క ఆకస్మిక ఎన్నికగాని, నియమితకాలము గడచిన కారణమున పంచాయితీ మెంబర్లు విరమించు తేదీకి ముందు, 3 నెలలలోపుగా జరుపబడదు.

(4) పంచాయతీ మెంబర్లసంఖ్య హెచ్చించు సందర్భములో, అధనపు స్థానములకు ఎన్నుకోబడిన మెంబర్లులేక, ఆకస్మిక ఖాళీస్థానముల ఎన్నికమెంబర్లు అంతకు వెంబడి పూర్వము సామాన్య ఎన్నికలలో అసలు స్థానములకు ఎన్నుకోబడిన మెంబర్లు ఖాళీకాబడు తేదీ వరకు పుద్యోగమును కలిగి యుండవలెను.

11. సెక్షన్ — (1) సామాన్య లేక ఆకస్మిక ఎన్నికలో ఆయా సందర్భముకు తగినట్లు ఖాళీలను భర్తీచేయుటకొ ఎవరుగాని ఎన్నుకోబడని యెడల ఇన్‌స్పెక్టరు నియమించిన తేదీన కొత్తఎన్నిక జరుగవలెను.

(2) ఆయా కొత్తఎన్నికలో ఆసందర్భముకు తగినట్లు ఖాళీని భర్తీచేయుటకు ఎట్టి మెంబరుగాని ఎన్నుకొనబడనియెడల పంచాయితీవారు నిర్ణయించబడిన విధముగా అర్హతగల మనిషిని ఎన్నుకొనవలెను.

(3) యీసెక్షన్ ప్రకారము ఎన్నుకోబడిన మెంబరు కాలము ఆసందర్భముకు తగినట్లు సాధారణ లేదా ఆకస్మిక ఎన్నిక నియమితకాలము అంత్యముగా పుండవలెను.

12. సెక్షన్ — (1) పంచాయితీకి జరుగు ఎన్నికలలో వోటును యిచ్చుటకు అర్హులైనవారి పేర్లను తెలుపు ఒకపట్టి తయారు కాబడి ప్రకటించబడవలెను. అది నిర్ణయ అధికారిచే నిర్ణయకాలములో సవరించ బడవలెను.

(2) సదరు గ్రామముకు లేదా అందలి భాగముకు సంబంధించిన M. L. A. తాలూకు పట్టీలో చేర్చబడిన పేర్లు వారందరు యీపట్టీలో చేర్చబడుటకు అర్హులుగా నుండెదరు.

1. వివరణ — M. L. A. పట్టీలో గ్రామముకు సంబంధించిన నియోజకవర్గ పట్టీ ప్రత్యేక భాగముగా లేనిసందర్భములో ఆపంచాయతీ ఎన్నికపట్టీలో యీక్రిందివారిని చేర్చుటకు హక్కుకలిగి యుండవలెను. వారెవరనగా?

A. ఆయా గ్రామ రిజిస్ట్రేషన్ విస్తీర్ణము క్రింద అపట్టికలో నమూదుకాబడినట్టిన్ని ఆగ్రామంలో విలాసముగా పుండునట్టిన్ని అందరున్నూ

B. పై చెప్పిన రిజిస్ట్రేషన్ విస్తీర్ణము కింద పట్టీలో చేర్చబడుటకు అర్హత గలిగినట్టియు, అట్టి గ్రామములో కాపురముండునట్టియు అందరున్నూ

2. వ వివరణము — "నియోజకవర్గము" అనగా ఇండియా రాజ్యాంగచట్టము. 327, 328, విధులక్రింద మాటలకు గల అర్థము.

(3) పంచాయతీపట్టీలో ఎవరి పేరుగాని ఒకటికంటె జాస్తి ప్రదేశములలో చేర్చకూడదు.

(4) పంచాయతి ఎన్నికదారులపట్టీలో పేరుగల ప్రతివారున్నూ అది అమలులో పున్నంత కాలము ఆయా బూత్సులలోజరిగే ఓటువేయుటకు హక్కుకలిగి యుండవలెను. పట్టీలో పేరు లేని ఎవరుగాని ఓటు వేయుటకు హక్కు పుండరాదు.

13. సెక్షన్ — పంచాయితీ పట్టీలో తనపేరు వుండిననేతప్ప, ఎవరుగాని పంచాయితీ మెంబరుగా ఎన్నుకొనబడుటకు అర్హుడుకాడు.

14. సెక్షణ — (1) గ్రామ మునసబు కరణము, గ్రామ నవుకరుగాని కేంద్ర ప్రభుత్వముకు లేదా పంచాయితీకి జిల్లాబోర్డుకు మునిసిపల్ కౌన్సిలువుద్యోగి మెంబరుగా ఎన్నుకొనబడుటకు అర్హుడుకాడు.

(2) ఎన్నిక జరుగుటకు పూర్వముగాని తర్వాతగాని ఎవరుగాని యీ సెక్షణ కింద అర్హుడా ? కాడా ? అను ప్రశ్న రాబడినయెడల దానిని గవర్నమెంటుకు తెలుపవలెను. వారి తీర్మానము ఖాయముగా వుండవలెను.

15. సెక్షన్ — ఇండియణ పినల్‌కోడ్డు 9 A అధ్యాయము ననుసరించిగాని ఎన్నిక రహస్యమును వుల్లంఘించుటకు నేరముచేసినట్లు ఏర్పడినవారు నేరము ఖాయపడిన 5 సంవత్సరములువరకు లేదా కోర్టువారు ఏదైనా తక్కువకాలము నిర్ణయించినయెడల అంతవరకు యీ ఆక్టుకింద ఎట్టి ఎన్నికలలోగాని ఓటు చేయుటకు ఎన్నుకొనబడుటకు పంచాయితీ మెంబరుగా వుండుటకు అర్హుడుకాడు.

16. సెక్షణ (i) ద్వీపాంతరవాస శిక్షకు, నీతికి సంబంధించని యితర నేరముకు 6 నెలలకు మించిన జైలుశిక్ష విధింపబడి అనుభవించు నప్పుడుగాని అయిపోయిన 5 సంవత్సరములు వరకు గాని మెంబరుగా ఎన్నుకొనబడుటకు అర్హుడుకాడు. అయితే గవర్నమెంటు వారు అట్టి శిక్షను మినహాయింపు చేయవచ్చును.

(2) నామినెషను లేదా ఎన్నిక తేదీకి ఒకమనిషి ఈక్రిందివిధముగానున్న మెంబరుగా ఎన్నుకొనబడుటకు అర్హుడుకాడు.

A. మనస్తిమితము లేనివాడుగా, చెవుడుగా, మూగ, కుష్టుగా వున్నయెడలనూ—

B. ఇణసాల్‌వెంటుగా తీర్మానించుటకు పిటీషణ దాఖలు కాబడినవాడుగా లేదా ఇన్‌సాలవెంటుగా తీర్మాంచబడి డిశ్చార్జి కానివాడుగా వున్ననూ—

C. పంచాయితితో కంట్రాక్టు చేసుకొనబడి, లేదా పంచాయితీ కొరకు చేయబడు ఏవర్కులో సంబంధముకలిగి అది అమలులో వున్ననూ—

D. పంచాయితీ తరపున జీతము మీద న్యాయవాదిగా వున్ననూ, లేదా పంచాయితికి ఎదురు వాదములో న్యాయవాదిగా వున్ననూ—

E. పంచాయితీగల గ్రామంలో విచారణాధికారముగల ఆనరరీ మెజస్ట్రీటుగా వున్ననూ—

F. పంచాయితీ మెంబరు పదవిలోవుండి అంత్యముకానినారుసూ, లేదా మెంబరుగా ఎన్నుకోబడి యింకనూ పనిలో చేరనివారునూ,

G. పదరుకాలమున మెంబరుగానుండు మరియొకరి నవుకరుగా లేదా యజమానిగా వుద్యోగరీత్యాతాబేదారుగా పైఅధికారిగా వున్ననూ—

H. అందుకు పూర్వపు సంవత్సరము వరకున్నూ దానితోచేరియు పంచాయతీకి ఆయనకు బిల్లుగా లేదా నోటీసు అందజేయబడియుండి చెల్లించవలసిన కాలము గడచిపోయి అవాపతు బాకీగా వున్నవారునూ, మెంబరుగా ఎన్నుకొనబడుటకు అర్హుడుగానుండరాదు.

17. సెక్షన్ – (1) ఒకమెంబరుగా నుండువారు 19 సెక్షన్లలోని నిబంధనలకు లోబడి ఈక్రిందివిధముగానున్న వాని మెంబరుపదవి రద్దగును.

A. క్రిమినల్ కోర్టువల్ల 16 సెక్షన్‌లో చెప్పిన శిక్షకు శిక్షింపబడిననూ,

B. మనస్థిమితము లేనివాడుగా, చెవిటి, మూగ, కుష్టు. గా వున్నను.

C. ఇన్‌సాలవెన్సి పిటీషన్ దాఖలుచేసినను ఇన్‌సాలవెంటుగా తీర్మానించబడిననూ.

D. పంచాయతీ కంట్రాక్టులలో వున్ననూ, ఆయా పంచాయితీ కంట్రాక్టుపనులలో బాధ్యతగలిగి వున్ననూ.

E. పంచాయితీ తరపున జీతముమీద న్యాయవాదిగా నియమించబడివున్ననూ పంచాయితీకి ఎదురులో న్యాయవాదిగా వున్ననూ.

F. యీ ఆక్టుకింద ఒకవుద్యోగిగా లేదా నవుకరుగా వున్ననూ.

G. గ్రామములో విచారణాధికారముగల ఆనరరీ మెజిష్ట్రేటుగా వున్ననూ.

H. యితర మెంబరుకింద నవుకరిగా వప్పుకున్ననూ, తాబేదారుగా వున్ననూ.

I. గ్రామములో కాపురము వుండకపోయిననూ.

J. యీ ఆక్టుకింద ఏదైనాబిల్లు, నోటీసు అందినతర్వాత 3 నెలలలోపల పంచాయతీ బాకీని చెల్లించుటకు తప్పినవాడైననూ.

(నోటు:— బిల్లుగాని నోటీసుగాని పంచాయతీవారు సాధ్యమైనంత శీఘ్రముగా అందజేయవలసిన విధియైయున్నది.)

K. ఆయాసంగతికి తగినట్లు, అతని వుద్యోగకాలము ప్రారంభమైన తేదీనుండి లేదా హాజరుకాబడిన కడపటి మీటింగు తేదీనుండి లేదా 18 శెక్షన్ అనుసరించి మరల మెంబరుగా చేయబడిన తేదీనుండి వరుసగా 3 నెలల కాలములో పంచాయితీ మీటింగులకు హాజరు కాని యెడల లేదా సదరుకాలములో 3 మీటింగులకు తక్కువగా జరిగిన యెడల వరుసగా 3 మీటింగులకు హాజరు కానియెడలనూ.

అయితే మీటింగునోటీసు ఆయనకు యివ్వనియెడలగాని మీటింగుకు నిర్ణయించబడిన నోటీసుకాలము కంటె తక్కువకాలములో నోటీసు యివ్వబడి మీటింగుజరిగినయెడల లేదా మెంబర్ల కోరికతో మీటింగు జరిగినయెడల యీలాటి మీటింగులు ఆయన హాజరుకాని మీటింగులో లెఖ్ఖచేయరాదు.

L. 132 శెక్షన్ కింద వుద్యోగమునుండి తొలగింపబడిన యెడల.

పై A మొదలు L సందర్భములలో ఆమెంబరుకు వుద్యోగము వుండకూడదు.

18. శెక్షన్ — (1) 15 శెక్షన్ అనుసరించి లేదా 17 A క్లాజుననుసరించి మెంబరుగా నుండుట నిలిచిపోయినప్పుడు శిక్షను అపీలులో రద్దుపరచబడిన యెడలగాని గవర్నమెంటువారు అట్టి అనర్హత తొలగించినట్లు వుత్తరువు చేసినయెడలగాని, అట్టి మెంబరు వుండవలసిన కాలములో తిరిగి యివ్వబడు కాలము మధ్యలోని కాలమును ఆయన వుద్యోగకాలములో హాజరుగించ బడవలెను. అట్టి మధ్యకాలములో భర్తీచేయబడిన మెంబరు వుద్యోగముకాలీకాబడును.

(2) 17 K క్లాజు ననుసరించి ఒకరు మెంబరుగా నుండుట నిలిచిపోయిన సందర్భములో కార్యనిర్వహణ అధికారి ఆవిషయము వెంటనే వ్రాతమూలముగా తెలియపరచి ఆసంగతి మరు మీటింగులో పంచాయితీకి తెలియపరచవలెను.

అట్టిమనిషి పంచాయితీ మరుమీటింగు తేదీన లేదా ఆయనకు నోటీసుఅందిన 15రోజులలోగా తనవుద్యోగమును తిరిగి వుంచవలెనని కోరి పంచాయితీకి తెలుపుకున్నయెడల మరు మీటింగులో పంచాయితీవారు ఆయన మెంబరు పదవిని తిరుగా నియమించవచ్చును.

అయితే ఒక మెంబరు తనవుద్యోగ కాలములో రెండుసార్లకు పైగా యిట్లు చేరుకొనుట కూడదు.

19. శెక్షన్ — (1) పంచాయితీ మెంబరుగా ఎన్నుకొనబడిన వారు తగు అర్హత లేనట్లు గాని, 13, 15, 16, 17, సెక్షన్ల అనర్హతలు వున్నట్లుగాని చెప్పబడి ఆయన అట్టి లోపమును ఒప్పుకొనని యెడలగాని 15, 16, 17, సెక్షన్ అనర్హత అగునా? కాదా? అను ప్రశ్న వచ్చినప్పుడుగాని పంచాయితీవారుగాని ఇన్స్పెక్టరుగాని వుత్తరువు చేసినమీదట ఆ మెంబరుగాని యితర మెంబరుగాని జుడిషియల్ అధికారికి పిటీషన్ దాఖలుచేయవచ్చును. వారు తీర్పు ఖాయమై వుండవలెను.

(2) అట్టితీర్పు కాబడువరకు ఆయన మెంబరుగానే వుండవలెను.

## —:పంచాయితీ ప్రెసిడెంటు — వైసు ప్రెసిడెంటు:—

20. సెక్షన్ — (1) ప్రతి పంచాయితీకిని ఒక ప్రెసిడెంటు ఒక వైసు ప్రెసిడెంటు వుండవలెను.

21 సెక్షన్ — (1) పంచాయతీ ఎన్నికపట్టిలో నున్న పేర్లుగలవారు తమలోనుండి ఒక ప్రెసిడెంటును ఎన్నుకోవలెను. యిట్టి ఎన్నికలో ఎవరుగాని ఎన్నుకోబడనియెడల తిరుగా కొత్త ఎన్నిక జరుగవలెను. అయితే ఏ మెంబరుగాని ప్రెసిడెంటుగా ఎన్నుకొనబడుటకు అర్హుడుగా నుండకూడదు. ప్రెసిడెంటుగా ఎన్నికకు యత్నించువారు మెంబరుగా ఎన్నికకు యత్నించుటకు అర్హుడుకాడు.

(2) ప్రెసిడెంటు ఎన్నిక పంచాయతీ మెంబర్ల సాధారణఎన్నికలు జరుగునప్పుడు ఆ స్థలమందే జరుగవచ్చును.

(3) యీ ఆక్టులో నిర్ణయించబడిన విధముగాతప్ప; సాధారణఎన్నికలో రాబడిన ప్రెసిడెంటుయొక్క వుద్యోగకాలము ఖాళీఏర్పడిన దినము మధ్యాహ్నముప్రారంభమై 3సం॥ కాలమువరకు వుండవలెను. అట్టిఎన్నిక ఖాళీఏర్పడిన పిమ్మట జరిగినయెడల ఎన్నిక జరుగబడిన తేదినుండి ఖాళీకిపూర్వమే ఎన్నుకోబడినట్లుగా ఆకాలము అంత్యమువరకు వుండును.

(4) ప్రెసిడెంటు వుద్యోగము ఏదైనా ఆకస్మిక ఖాళీ కాబడినప్పుడు క్రొత్తగా ఎన్నిక జరిపి భర్తిచేయవలెను. అట్లు ఖాళీకి ప్రెసిడెంటుగా ఎన్నుకోబడినవాడు ఆయన ఎవరి స్థానములో ఎన్నుకోబడెనో వారి వుద్యోగ కొరవ కాలమువరకు యీ ఎన్ను కొనబడినవారు ప్రెసిడెంటుగా వుండవలెను.

(5) 1 ఉప సబుసెక్షన్‌కింద ప్రెసిడెంటు సాధారణ ఎన్నికజరుగవలసిన కాలముకు 3 మాసములుముందు అకస్మాత్తుగా ఖాళీఏర్పడిన సందర్భములో సాధారణ ఎన్నిక వరకు ఆకస్మాత్తు ఖాళీని నిలిపివుంచవలెను. భర్తిచేయరాదు.

(6) 14 మొదలు 19 వరకు సెక్షన్‌నిబంధనలు మెంబరువుద్యోగము సందర్భములో వలెనే ప్రెసిడెంటు వుద్యోగమునకుగూడా అన్వయింప జేయవలెను.

(7) ప్రెసిడెంటు పంచాయితీయొక్క వుద్యోగరీత్యా మెంబరుగానుండి పంచాయితీ మీటింగులో ఓటు చేయుటకు అర్హతగలిగి యుండవలెను.

22 సెక్షన్ – వైసు ప్రెసిడెంటును పంచాయితీ మెంబర్లలోనుండి ఎన్నుకోవలెను. యీ సెక్షన్ ఎన్నికలో వైసుప్రెసిడెంటు ఎన్నుకోబడనియెడల క్రొత్తఎన్నిక జరుగవలెను.

23 సెక్షన్ – ప్రెసిడెంటు లేదా వైసు ప్రెసిడెంటు.

A. జిల్లాబోర్డుకు లేదా జిల్లాలోని యితర పంచాయితీకి ప్రెసిడెంటుగా లేదా వైసు ప్రెసిడెంటుగా ఎన్నుకొన బడినయెడల–

B. ప్రెసిడెంటు సందర్భములో వుద్యోగములో వుండుటకు అనర్హుడైన యెడల లేదా వుద్యోగమునుండి తొలగించబడినయెడల లేదా వుద్యోగ కాలపరిమితి గడచినయెడల–

C. వైసు ప్రెసిడెంటు సందర్భములో, ఆయన మెంబరు వుద్యోగకాలము గడచిన యెడలగాని ఆయన మెంబరుగావుండుట నిలిచిపోయిన యెడలగాని ప్రెసిడెంటుగా ఎన్నుకోబడిన యెడలగాని అట్లు వుద్యోగమును కలిగియుండుటకు నిలిచిపోవలెను.

24. సెక్షన్ – ప్రెసిడెంటు.

A. వైసు ప్రెసిడెంటు ఎన్నికకు ఏర్పాటు చేయవలెను.

B. పంచాయతీ మీటింగులను సమావేశ పరచవలెను.

C. పంచాయతీ రికార్డులనువుంచుకొనుటకు పూర్తిఅవకాశముకలిగివుండవలెను.

D. యీ ఆక్టుకింద ప్రెసిడెంటుకు ప్రత్యేకముగా విధింపబడిన విధులను చలాయించవలెను.

25. సెక్షన్ – (1) ప్రెసిడెంటుయొక్క వుద్యోగము ఖాళీగావున్నప్పుడు క్రొత్త ప్రెసిడెంటు ఎన్నిక ప్రకటించబడి వుద్యోగములో చేరువరకు వైసుప్రెసిడెంటు ప్రెసిడెంటు పనులను చేయవలెను.

(2) ప్రెసిడెంటు తనఅధికార ప్రదేశమునుండి వరుసగా 15 రోజులకు జాస్తిగా గైరుహాజరు అయినయెడల లేదా అశక్తుడుగా వున్నయెడల అట్టికాలములో ఆయన పనులు (వేరుగా నిర్ణయింపబడిన సందర్భములున్ననే తప్ప) వైసు ప్రెసిడెంటుకు సంక్రమించవలెను

(3) ప్రెసిడెంటు వుద్యోగము కాళీగావున్నప్పుడుగాని ప్రెసిడెంటు వరుసగా 15 రోజులకు జాస్తిగా తనవుద్యోగహద్దులలో గైరు హాజరుగా వున్నప్పుడుగాని, అశక్తుడుగా వున్నప్పుడుగాని వైసుప్రెసిడెంటుగూడా లేనప్పుడు ప్రెసిడెంటు యొక్క డ్యూటీలు ఇన్‌స్పెక్టరు నియమించిన పంచాయతీ మెంబరుకు సక్రమించవలెను.

అట్లు నియమించబడిన పంచాయతీమెంబరు ఆక్టింగు ప్రెసిడెంటు అని పిలువబడవలెను. క్రొత్తప్రెసిడెంటుగాని వైసు ప్రెసిడెంటుగాని వుద్యోగముకు రాబడినట్లు ప్రకటనకాబడి అధికారముకు చేరునంతవరకు లేదా అశక్తత కలిగినయెడల బాగుపడువరకు నిర్ణయ షరతులకు లోబడి ప్రెసిడెంటుయొక్క పనులు నెరవేర్చవలెను.

(4) ప్రెసిడెంటు వుద్యోగము కాళీ కాబడినయెడల ఎన్నిక అధికారికి రూల్సుమేరకు సకాలములో అధికారి తెలుపవలెను. అంతట ఎన్నికఅధికారి ఎన్నికలకు ఏర్పాటుచేయవలెను.

(5) ప్రెసిడెంటువ్రాత వుత్తరువుద్వారా వుత్తరువులోని నియమములకు లోబడి తన పనులలో ఏవిగాని వైసు ప్రెసిడెంటుకుగాని ఆవుద్యోగము కాళీగా వున్నయెడల లేదా వైసు ప్రెసిడెంటు 15 రోజులకుమించి గైరు హాజరుగా వున్నయెడల, అశక్తుడుగా వున్నయెడల ఏ మెంబరుకుగాని ఒప్పగించవచ్చును.

(6) పై 1, 2, 3, 5, సబుసెక్షనులలో ప్రెసిడెంటు పనులు సందర్భములో ఆయనే కార్యనిర్వాహణాధికారిగా గూడా వున్నయెడల అట్టిఅధికారము గూడా ఆయన స్థానములో నియమించబడిన వారికి చేరినట్లు తలంచవలెను.

(7) ప్రెసిడెంటు అధికారముపై 2 దవ సబుసెక్షను అనుసరించి వైసుప్రెసిడెంటుకు సంక్రమించినప్పుడున్నూ, 5 దవ సబుసెక్షను ప్రకారము వైసు ప్రెసిడెంటుకు గాని మెంబరుకుగాని ఒప్పగించబడి నప్పుడున్నూ. వారు చలాయించిన పనులను వారిమీద అధికారము గలిగి యుండి దానిని సవరించుటకు ప్రెసిడెంటుకు అధికారము గలదు.

## —: మెంబర్లు :—

**26.** సెక్షను — (1) ఏ మెంబరుగాని పంచాయితీపనులు నెరవేర్చుటలో జరుగబడు అశ్రద్దనుగాని పంచాయతీ ఆస్తి నష్టమును గురించిగాని ఏదైనా కావలసిన విషయములను కనుగొనుటగాని కార్యనిర్వాహణాధికారికి తెలియునట్లు చేయవచ్చును. ఏదైనా తగినఅభివృద్ధి కార్యములను జరుపుటకు సలహాలు యివ్వబడును.

(2) ప్రతి మెంబరున్నూ రూల్సుకులోబడి పంచాయతీ పరిపాలనను గురించిన విషయములను, తీర్మానములను ప్రవేశపెట్టుటకు ప్రెసిడెంటునుప్రశ్నలు వేయుటకు హక్కుగలదు.

(3) ప్రతి మెంబరున్నూ కార్యనిర్వాహణాధికారికి నోటీసుయిచ్చి, ఆఫీసురికార్డులను

ఆపేపు సంబంధలలో చూచుటకు హక్కుగలదు. అయితే కార్యనిర్వాహణాధికారి వ్రాతమూలమైన తగు కారణములతో అట్లు చూచుటను ఒప్పుకొనక పోవచ్చును.

27. సెక్షన్ — ప్రెసిడెంటు, వైసు ప్రెసిడెంటు, మెంబరు వారి హోదాలోగాని యితర హోదాలోగాని తాముచేసినపనికి పంచాయతీ ద్రవ్యములోనుండి ఏమి జీతముగాని ప్రతిఫలముగాని తీసుకొనరాదు, అట్లు ఆతడికి యివ్వకూడదు.

## —: కార్యనిర్వాహణోద్యోగి :—

28 సెక్షన్ — (1) గవర్నమెంటువారు ప్రకటించిన ఏ పంచాయితీకిగాని పూర్తి కాలము పనిచేయుటకు ఒక వుద్యోగిని నియమించవలెను.

(2) అట్లు ప్రకటించని పంచాయితీ సందర్భములో ప్రకటించబడిన పంచాయితీ సందర్భములో గూడా కార్యనిర్వాహణోద్యోగిలేని సందర్భములో పంచాయితీప్రెసిడెంటు రూల్సుకులోబడి కార్యనిర్వాహణ ఉద్యోగిగా పనులు నెరవేర్చవలెను.

(3) 1 టవ సబుసెక్షన్‌కింద గవర్నమెంటువారు నియమించబడిన ఉద్యోగి తన ఉద్యోగముతప్ప యితరపని ఏమిగాని గవర్నమెంటువారి అనుమతిలేకుండా చేయరాదు.

(4) పంచాయతీ కార్యనిర్వహణ ఉద్యోగికి గవర్నమెంటు నిర్ణయముమేరకు జీతము అలవెన్సులు యివ్వబడవలెను.

(5) A పంచాయితీకి నియమించబడిన కార్యనిర్వాహణ ఉద్యోగి ప్రభుత్వపు నవుకరిలో వుండినయెడల, ఆయనసెలవు అలవెన్సు, పెన్షను ప్రావిడెంటుఫండు అయనకు చెల్లించబడుటకు గవర్న మెంటువారు కోరిన మొత్తమున్నూ.

B. కార్యనిర్వహణ ఉద్యోగి గవర్నమెంటు నవుకరిగా వున్నవాడు కానియెడల ఆయన లీవు అలవెన్సులు ప్రావిడెంట్‌ఫండు, పెన్షను కొరకు గవర్నమెంటువారు నిర్ణయించిన మొత్తమును, పంచాయితీవారు చెల్లించవలెను.

(6) 1వ సబ్‌సెక్షన్ ప్రకారము నియమించబడిన కార్యనిర్వహణ వుద్యోగుల క్లాసు విభజనను, వుద్యోగ షరతులను, జీతము అలవెన్సులను, నడవడిక, క్రమము, ప్రకటించి నిర్ణయించుటకు గవర్న మెంటువారికి అధికారముగలదు.

29. సెక్షన్ — కార్యనిర్వహణ వుద్యోగి, పంచాయితీయొక్కయు దానికమిటీ యొక్కయు మీటింగులకు హాజరై చర్చజరుపుటకు అధికారముగలదు, అయితే తీర్మానము ప్రవేశ పెట్టుట వోటుచేయుట కూడదు. మరొక పంచాయితీయొక్క దాని కమిటీయొక్క మీటింగులోని అధ్యక్షుడు కోరినయెడల కార్యనిర్వహణ వుద్యోగి హాజరుకావలెను.

## కార్యనిర్వహణోద్యోగి అధికారములు—డ్యూటీలు

30. సెక్షన్ — కార్యనిర్వాహక అధికారి A పంచాయితీవారు చేసిన తీర్మానములను అములుపరచవలెను. అయితే తీర్మానము చట్టముమేరకు లేదనిగాని చట్ట ప్రకారము అధికార హద్దు మించినదనిగాని దానిని అములులో జరుపుటలో మనుష్య ప్రాణములకు, ఆరోగ్యముకు ప్రజాక్షేమముకు బహుశా అపాయము కలుగునని ప్రెసిడెంటు అభిప్రాయపడు నెడల

కార్యనిర్వహణ వుద్యోగి ఆవిషయమును గవర్నమెంటుకు తెలుపవలెను. గవర్నమెంటువారి తీర్మానము ఖాయమై వుండవలెను.

B. పంచాయితీయొక్క అందరు వుద్యోగులు నవుకర్లమీద అధికారము కలిగి యుండవలెను.

C. యీ ఆక్టువల్ల రూల్సువల్ల. యింకనూ ప్రత్యేకముగా చేయబడిన రూల్సు నంతయు నెరవేర్చవలెను. అధికారము జరుపవలెను. అట్లు ఆక్టుయొక్క రూల్సుయొక్క వుద్దేశ్యము మేరకు నెరవేర్చవలసిన జవాబువారి కార్యనిర్వాహణ ఉద్యోగి జవాబువారిగా వుండును.

31 సెక్షన్ — అవసర సందర్భములో కార్యనిర్వహణాధికారి ప్రజాక్షేమముకొరకు కావలసిన పనిని వెంటనే చేయుటకున్నూ, చేయునట్లు వుత్తరువు చేయుటకున్నూ అధికారము గలదు. అట్టి పనులకు కావలసిన ఖర్చులను పంచాయితి ఫండులోనుండి చెల్లించునట్లు వుత్తరువు చేయవచ్చును. అయితే.

A. పంచాయితీవారు చేయకూడదనిగాని, చేయవచ్చుననిగాని చేయబడివుండు వుత్తరువుకు భిన్నముగా ఆయన వ్యవహరించకూడదు,

B. యీ సెక్షన్ ప్రకారము ఆయన చేసిన చర్యలనుగల కారణములు వివరించుచు పంచాయితీ మరు మీటింగులో ఆయనరిపోర్టు చేయవలెను.

32. సెక్షన్— ఇన్స్పెక్టరు సామాన్య లేదా ప్రత్యేక వుత్తరువుద్వారా పంచాయితీ హెల్తు ఆఫీసరును ఆయన లేనియెడల జిల్లా హెల్తుఆఫీసరును అట్టి ప్రదేశములో యీ ఆక్టు క్రింద కార్యనిర్వాహణఅధికారి చేయవలసిన పనులు డ్యూటీలు షరతులకు లోబడి ఆయన చేయవలసినదిగా వుత్తరువు చేయవచ్చును. అట్టి చర్యలను సవరించుటకు ఇన్స్పెక్టరుకు రెవిజన్ అధికారము గలదు.

33. సెక్షన్ — కార్యనిర్వహణ అధికారి తనపనులలో వేటినిగాని వ్రాతమూలముగా ఆయన ప్రెసిడెంటు అయిన యెడల వైసు ప్రెసిడెంటుకున్నూ వైసుప్రెసిడెంటు లేనియెడల యితరమెంబరుకున్నూ, ఆయన ప్రెసిడెంటు కానియెడల ప్రెసిడెంటుకున్నూ ప్రెసిడెంటు లేనప్పుడు వైసు ప్రెసిడెంటుకు వీరువుభయులులేనప్పుడు ఏమెంబరుకైననూ కొన్ని షరతులకు లోబడి తమ అధికారమును ఒప్పగించవచ్చును. అట్లు ఒప్పగించిన పనులను వారు నెరవేర్చుటలో వుత్తరువులోని షరతులకు లోబడి చేయవలెను. అట్టిపనులమీద అవతల తనపై కాధికారమును చలాయించి రివిజన్ చేయుటకు అధికారము గలదు.

—: న వు క ర్లు :—

34. సెక్షన్ — (1) కార్యనిర్వహణ అధికారికి తప్ప పంచాయితీ యితర ఆఫీసర్లు నవుకర్లు సంఖ్యను అధికారమును జీతములను అలవెన్సులను, రుసుములను ఇన్స్పెక్టరు నిర్ణయించవలెను. వాటిని మార్పుచేయవచ్చును. అయితే అట్టి సందర్భములలో పనులు నెరవేర్చుటకు తత్కాలముకు అవసరమగు నవుకర్లను కార్యనిర్వహణ వుద్యోగి నియమించవచ్చును.

(2) కార్యనిర్వహణ ఉద్యోగి కాకుండా పంచాయితీ యితర నవుకర్లను గురించి వారి తరగతులు విభజన నవుకరి పద్ధతులు జీతములు అలవెన్సులు క్రమశిక్షణ వీటిని గురించి గవర్నమెంటువారు రూల్సును చేయవచ్చును. అట్టిరూల్సు కార్యనిర్వహణ ఉద్యోగి కానట్టి పంచాయితీ యితర అన్ని నవుకర్లకు రాజధాని కంతటికి ఒక ప్రత్యేక సర్వీసుగా చేయ వచ్చును.

(3) రెండు లేదా జాస్తి పంచాయితీలకు ఒకేరకముగా ఎట్టిఅధికారములను రూల్సును గాని చేయుటకున్ను ఒకే వుద్యోగికి నియమించుటకున్ను అధికారముగలదు. మరిన్ని రూల్సు మేరకు అధికారము గలవారు అట్లు కోరినయెడల నియమించవలెను.

(4) యీ ఆక్టులోగాని 1920 మునిసిపల్ ఆక్టులోగాని జిల్లాబోర్డుఆక్టులో ఏమి వున్ననూ దానితో నిమిత్తములేకుండా పంచాయితీ బోర్డుయొక్క వుద్యోగిని నవుకరును కార్యనిర్వహణ వుద్యోగిని సహా ఇన్‌స్పెక్టరు ఏ యితర పంచాయితీకిగాని మార్చవచ్చును.

అయితే ఇన్‌స్పెక్టరు చేయుమార్పును కార్యనిర్వహక వుద్యోగితో, గవర్నమెంటువారు చేయు సందర్భములో సంబంధముగల బోర్డుతో లేదా కార్యనిర్వహణ వుద్యోగితో సలహా పొందిన మీదట చేయవలెను. అట్టి ట్రాన్సుఫరును గురించి అమలు జరుగుటకు అవసరమగు ప్రత్యేక వుత్తరువులను చేయవచ్చును.

(5) ఇన్‌స్పెక్టరు యీ క్రింది విషయములలో (కార్యనిర్వహణ వుద్యోగికాని) పంచాయితీయొక్క ఏ యితర నవుకరుకు, వుద్యోగికి యివ్వవలసిన జీతములు అలవెన్సులు పూర్తిగా గాని గవర్నమెంటువారు వుత్తరువులో నిర్ణయించిన దామాషాగాని ఆయన సెలవు, పెన్షను ప్రావిడెంటుఫండు మొత్తములను పంచాయితీనుండి రాబట్టుకొనవచ్చును. అనగా అట్టిసందర్భములు ఏవనగా,

A. అట్టివుద్యోగి గవర్నమెంటువారివల్ల పంచాయితీ నవుకరుకు నియమించబడి నప్పుడు.

B. అట్టివుద్యోగి గవర్నమెంటు నవుకరుగా వున్నప్పుడు. పై సందర్భములు అన్వయించును.

(6) పంచాయితీయొక్క అందరు వుద్యోగులు నవుకర్లు కార్యనిర్వహణ అధికారికి లోబడియుండవలెను. మరియు యీ ఆక్టులో యితరవిధముగా వుండిననేతప్ప, అపీలుహక్కుకు లోబడి ఆయన యీ క్రింది కార్యములను చేయుటకు అధికారముగలదు.

A. పంచాయితీ వుద్యోగులను నవుకర్లను నియమించవచ్చును.

B. వారికి సెలవు యివ్వవచ్చును.

C. తగు కారణములున్నయెడల అట్టివుద్యోగిని నవుకరును తప్పుఏర్పరుచుట, జుల్మానా విధించుట, ప్రమోషన్ఆపుట, సీనియారిటీతగ్గించుట చేయవచ్చును. టెంపరరిగా సస్పెండుగాని నవుకరి తొలగింపుగాని చేయుటకు అధికారముగలదు.

(7) యీ సెక్షన్‌లోని నిబంధనలు పంచాయితీ పబ్లికుహెల్తు నవుకర్ల విషయములో గూడా వర్తించును.

(3) ఇన్‌స్పెక్టరు రూల్సుకులోబడి.

A. పంచాయతీపనులకు ఆయన అవసరమని తలంచు ఇంజనీరింగు యితర సిబ్బందిని నియమించి వారి జీతములు అలవెన్సులు పెన్షను ప్రావిడెంటుఫండు మొత్తములను పంచాయితీనుండి రాబట్ట వచ్చును.

B. రెండు లేదా జాస్తి పంచాయితీలకు జాయింటుగా సదరు సిబ్బందిని నియమించి వారికి కావలసిన పై అయిటములు ప్రతిపంచాయతీకిన్ని విధించి రాబట్టుకోవచ్చును.

అట్లు నియమింపబడు వుద్యోగుల జీతము షరతులు రూల్సుమేరకు వుండవలెను.

## —: చర్యాక్రమము :—

35. సెక్షన్ — (1) పంచాయితీ ప్రతిమీటింగుకు ప్రెసిడెంటు ఆయన లేనియెడల వైస్‌ప్రెసిడెంటు వారిద్దరునూ లేనియెడల ఆమీటింగులో హాజరైన మెంబర్లచే ఎన్నుకొనబడిన మెంబరు అధ్యక్షుడుగా వుండవలెను.

(2) ప్రెసిడెంటుగా నుండువారు మీటింగులోని క్రమమును కాపాడవలెను. మీటింగులోనూ దానికి సంబంధించిన రాబడు ఆర్డరుకు సంబంధించిన యావత్తు విషయములు తీర్మానించవలెను. మీటింగు క్రమమునుగురించి చర్చజరుగకూడదు. ప్రెసిడెంటు తీర్మానము యీ ఆక్టు రూల్సుకులోబడి అంత్యనిర్ణయమైయుండును.

(3) వైసు ప్రెసిడెంగాని, అసమయములో ప్రెసిడెంటు పదవిలోవున్న మెంబరుగాని ఆమీటింగుకు అధ్యక్షత కాలములో ప్రెసిడెంటుయొక్క అధికారములన్నియు కలిగియుండవలెను.

36. సెక్షన్ — పంచాయితీ ప్రతిమీటింగులోని (మినిట్లు) వివరములున్నూ మీటింగులో హాజరుగానుండిన ఏమెంబరు నుండిగాని మీటింగు ముగిసిన 48 గంటలులోగా అరికార్డున్నూ దానిలో ఏర్పడిన అభిప్రాయ మినిట్లున్నూ నకలును మీటింగు జరిగిన తేదీనుండి 3 రోజులులోగా ఇన్‌స్పెక్టరుకు ప్రెసిడెంటు పంపవలెను. అయితే అట్టి మినిట్లను మరి యేఅధికారికిగాని పంపవలెనని వుత్తరువు చేయవచ్చును.

37. సెక్షన్ — కార్యనిర్వహణ అధికారి స్వాధీనములో వుండు ఏదైనా డాక్యుమెంటును హాజరు పరచవలెనని పంచాయితీ కోరవచ్చును. ఆయన రూల్సుకులోబడిన మేరకు చేయవలెను.

38. సెక్షన్ — (1) పంచాయితీయొక్కయు దానికమిటీయొక్కయు వ్యవహారములు ఇన్‌స్పెక్టరు అంగీకారము మేరకు పంచాయితీరూల్సు, రెగ్యులేషన్లుకు భిన్నములేకుండా పరిపాలన జరుగవలెను.

(2) పై సబుసెక్షన్ కింద ఇన్‌స్పెక్టరు అంగీకారము కొరకు పంపు రెగ్యులేషన్లుకు యింకనూ చేర్చుట, సవరించుట, తగ్గించుట ఇన్‌స్పెక్టరు చేయవచ్చును.

(3) పై విధముగా ఇన్‌స్పెక్టరు వుత్తరువులను చేయుటలో మెంబరు, ప్రెసిడెంటు కమిటి చెయిరుమెన్, ఒక వర్తిత్యేక వ్యక్తి ద్రవ్యముద్వారా బాధ్యతలో ఏవిషయములోగాని

ఓటుకు అటంకపరచుట, చర్చలో పాల్గొనకుండా, మీటింగులో హాజరు లేకుండా, ప్రెసిడెంటుగా వుండకుండా ఆటంకముచేయు వుత్తరువులు చేయవచ్చును.

39. సెక్షన్ — (1) ఇన్స్పెక్టరు కోరినయెడల, పంచాయితీవారు యితర స్థానిక అధికార వర్గముతో చేరి జాయింటుగా ఏదైనా కార్యము నిమిత్తము ఒక కమిటీ ఏర్పాటు కాబడవలెను.

(2) అట్టి జాయింటు కమిటీ అధికారము చర్యలు క్రమమును వారిమధ్యరాబడు అభిప్రాయ భేదములను నిర్ణయించు పద్ధతి, రూల్సుకు అనుకూలముగా నుండవలెను.

40. సెక్షన్ — (1) పంచాయితీవారు ప్రతిసంవత్సరము దాని పరిపాలనా నివేదికను సంవత్సర కడపట సాధ్యమైనంత త్వరలో నిర్ణయతేదీని గడవకుండా నిర్ణయ నమూనాలో వివరములతో ఇన్స్పెక్టరుకు పంపుకోవలెను.

(2) కార్యనిర్వాహక అధికారి ఆ నివేదికను తయారు జేయవలెను. పంచాయితీ దానిని ఆలోచించి వారి అభిప్రాయమేమైనా వున్నయెడల దానితోటి ఇన్స్పెక్టరుకు పంపవలెను.

(3) సంవత్సరములో రాజధానియొక్క పరిపాలనను గురించి ఒక సామాన్య నివేదికను ఇన్స్పెక్టరు గవర్నమెంటుకు పంపవలెను.

—: చర్యలు చెల్లతగినవిగా యుండుట :—

41. సెక్షన్ — పంచాయతియొక్కగాని దాని కమిటీయొక్కగాని ప్రెసిడెంటు, వైసు ప్రెసిడెంటు చెయిర్ మెన్, మెంబరుగావుండి పనిచేసినవారి ఎట్టిచర్యగాని, నిర్మాణములో ఏదైనా లోపము వున్నదను కారణముమీద మాత్రమేగాని అనర్హత కారణముమీదగాని ఆయన ఎన్నుకొనుటలో అక్రమము అన్యాయము జరిగినదను కారణముమీదగాని వారు వుద్యోగములో వుండుటకు అర్హులు కాలేదను కారణమువల్లగాని వారి వుద్యోగము కాళీపడిన యెడల వారి వుద్యోగ కాలములో వారు చేసిన చర్యలు చెల్లకుండా పోనేరవు.

—: త ని కీ లు :—

42 సెక్షన్ — (1) ఇన్స్పెక్టరు రాజధానిలో అన్ని పంచాయితీల పరిపాలనను, యీ ఆక్టు కింద ఆయనకు యివ్వబడిన అన్ని అధికారములను చెలాయించవలెను రూల్సును చేయవలెను. ఆయనకు సహాయముగా గవర్నమెంటువారు రిజయనల్ ఇన్స్పెక్టర్లను నియమించవచ్చును.

(2) ఇ యీ ఆక్టు కింద ఏర్పరచిన అన్నిపంచాయితీలగాని లేదా తొన్నగాని తనిఖీ చేయు నిమిత్తము గవర్నమెంటువారు వారికి అవసరమగు అధికారులనుగూడా నియమించవచ్చును.

B. పై చెప్పినరూల్సుకు భంగములేకుండా గవర్నమెంటువారు ప్రతి రివిన్యూ జిల్లాకున్ను ఒకరు లేక జాస్తిమంది జిల్లాపంచాయితీ ఆఫీసర్లను డిప్యూటీ పంచాయితీ ఆఫీసర్లను నియమించ వచ్చును.

C. పై క్లాజులో చెప్పిన వుద్యోగులయొక్కయు వారి తాబేదార్లయొక్కయు తరగతి, ఉద్యోగపద్ధతి, షరతులు జీతములు అలవెన్సులు సెలవుదినములు క్రమపరచుటకు గవర్నమెంటుకు అధికారముగలదు.

(3) పై చెప్పబడిన వారియొక్కయు వారి తాబేదార్లయొక్కయు ఖర్చులను స్టేటు గవర్నమెంటు ఫండునుండి చెల్లించబడవలెను.

(4) జిల్లా, డిప్యూటి పంచాయితీ ఆఫీసర్లు ఆక్టు కిందవారికి యివ్వబడిన అధికారములను డ్యూటీలను నెరవేర్చవలెను.

(5) ఇన్‌స్పెక్టరు, కలెక్టరు, లేదా గవర్నమెంటువారు యిందుకొరకు నియమించి బడిన వుద్యోగి—

A. ఏ పంచాయితీ యొక్కగాని కార్యనిర్వహణ వుద్యోగియొక్కగాని అధికారము కిందవుండు స్థిరాస్తి పనులలో ప్రవేసించి తనికీ చేయవచ్చును. లేదా తనికీచేయుటకు ఏర్పాటు చేయవచ్చును.

B. పంచాయితీ తరపున సాగింపబడు లేదా పరిపాలనలోయుండు స్కూళ్ళు అసుపత్రిలు మందులషాపు టీకాలువేయు ప్రదేశములు, సత్రములు, యితరసంస్థలు ప్రవేసించి తనికీ చేయవచ్చును. చేయించవచ్చును. మరిన్ని వాటిలోని రికార్డులు, రిజష్టర్లు, డాక్యుమెంట్లు తనికీ చేయవచ్చును చేయించవచ్చును.

C. పంచాయితీ ఆఫీసులో ప్రవేసించి తనికీని చేయవచ్చును. చేయునట్లు చేయవచ్చును.

పంచాయితీలను దాని ప్రెసిడెంట్లను, కార్యనిర్వాహణ అధికారులను, వుద్యోగులను నవుకర్లను రూల్సుకులోబడి వారివారి పనులను నెరవేర్చుటకు వీలుకలుగ జేయవచ్చును అవసరమగు ప్రవేశము యివ్వవచ్చును.

(6) ఇన్‌స్పెక్టరుగాని అయన యిందుకొరకు అధికారము యివ్వబడిన వుద్యోగిగాని గవర్నమెంటు వారుగాని.

A. 50 సెక్షన్‌లో చెప్పబడిన ఏదైనా పబ్లికువర్కు చేయుటకు, చేయునట్లు ఏర్పాటుచేయుటకు పంచాయితీకి వుత్తరువు చేయవచ్చును.

B. పంచాయితీయొక్క దాని కార్యనిర్వహణ అధికారియొక్క స్వాధీనములో వుండు రికార్డులు రిజిష్టర్లు డాక్యుమెంట్లు యివ్వమని కోరవచ్చును.

C. ఏదైనా రిటరన్, ప్లాను, ఎస్టిమేషన్, స్టేటుమెంటు, లెఖలు, యిచ్చునట్లు పంచాయితీని కార్యనిర్వహణ వుద్యోగిని కోరవచ్చును.

D. అట్టి పంచాయితీకి సంబంధించిన ఏవిషయమును నివేదికనుగాని పంపవలసినట్లు కోరవచ్చును.

E. పంచాయితీ లేదా కార్యనిర్వహణ వుద్యోగితో ఆలోచనకొరకు వారిచర్యలను పనులను గురించి అభిప్రాయములను వ్రాతమూలముగా రికార్డు చేయవచ్చును.

43. సెక్షన్ — (1) ఇన్‌స్పెక్టరు యీ ఆక్టుననుసరించిగాని యీఆక్టుమూలముగాని

A. ఏదైనా తీర్మానము, వుత్తరువు, లైసెన్సు, అంగీకారము,చట్టసమ్మతముగా జారీ చేయతేదనిగాని అధికారము లేదనిగాని,

B. అట్టిచర్యలు తమ అధికారముకుమించి చేయబడినట్లు దుర్వినియోగ పరచినట్లు, ఇన్స్పెక్టరు తలచినాడనిగాని,

C. అట్టిచర్యలు అమలులో వుంచుటవల్ల మానవ ప్రాణములకు ఆరోగ్యము, రక్షణకు బహుళా హానికలుగుటకు మార్గమనిగాని, అభిప్రాయపడినయెడల వ్రాతమూలకమైన వుత్తరువుద్వారా అట్టి ఏచర్య, వుత్తరువు, పర్మిషన్, లైసెన్సు తాత్కాలముగా నిలిచి వుంచవచ్చును. రద్దుచేయవచ్చును, అట్లు అమలు జరుపువని జరుగకుండా నిషేధించవచ్చును.

అయితే యీ సెక్షన్ అధికారము ఏదైనా ఎన్నికలు జరుగబడిని దానిని ఇన్స్పెక్టరు రద్దుచేయుటకులేదు,

(2) పై A. B. క్లాజులలోని కారణములనుబట్టి ఇన్స్పెక్టరు చర్య జరుపుటకు ముందు సంజాయిషికోరి అవకాశము యివ్వవలెను.

(3) పై C. క్లాజుకింద ఇన్స్పెక్టరుకు యివ్వబడిన అధికారము అక్లాజుయొక్క రూల్సుకు లోబడి కలెక్టరు చేయించవచ్చును.

44 వ-సెక్షన్ నిర్ణయంపై అధికారముకులోబడి ఇన్స్పెక్టరు లేదా కలెక్టరు అవసర సందర్భములో పంచాయితీ, లేదా కార్యనిర్వహణ అధికారి నెరవేర్చవలసిన పనులను ప్రజాక్షేమము కొరకు తక్షణమె అవసరమని అభిప్రాయపడిని కార్యములను జరిపించుటకు వుత్తరువు లేదా ఏర్పాటుచేయవచ్చును. దాని ఖర్చులు పంచాయితిఫండు స్వాధీనములో గలవారు మొదట ఛార్జిగా చెల్లించవలసినట్లు వుత్తరువు చేయవచ్చును.

45 వ-సెక్షన్ విద్యుత్ శక్తివుత్పత్తి, సరఫరా, వుపయోగమును గురించి పరిపాలన తత్కాలమందు అమలులోవుండు ఆక్టుననుసరించి పంచాయితీకి యివ్వబడిన లైసెన్సు యొక్క షరతులు విరుద్ధములేకుండా పంచాయితీ విచారణకు లోబడియుండవలెను.

46. సెక్షన్ — (1) ఈ ఆక్టును అనుసరించి ఒకపంచాయితీ ప్రెసిడెంటు లేదా కార్య నిర్వహణ అధికారి చేయుటకు తప్పిపోయి వాటిని ఇన్స్పెక్టరుకు ఎప్పుదేని కనుపడిన యెడల ఆయన వ్రాతమూలముగా వుత్తరువుద్వారా అట్టి పనిని నెరవేర్చుటకుగాను కాలపరిమితిని నిర్ణయించ వచ్చును.

(2) అట్టిపని నిర్ణయింపబడిన కాలము లోపుగా నెరవేర్చబడనియెడల ఇన్స్పెక్టరు దానిని నెరవేర్చుటకు ఎవరినైన నియమించి ఆ ఖర్చును పంచాయితీ ఫండునుండి మొదటి ఖర్చులుగా చెల్లించునట్లు వుత్తరువు చేయవచ్చును.

47. సెక్షన్ — (1) యీ ఆక్టును రూల్సును, వుత్తరువులను, రిగ్యులేషన్ నెరవేర్చకుండా బుద్ధిపూర్వకముగా వదలిపెట్టినాడనిగాని తన అధికారమును దుర్వినియోగ పరిచినాడని గాని అభిప్రాయ పడినయెడల ఇన్స్పెక్టరు ప్రకటనమూలముగా నిర్ణయించిన తేదినుండి ఏ ప్రెసిడెంటునుగాని వైసు ప్రెసిడెంటునుగాని తొలగించవచ్చును.

(2) ఏమెంబరుగాని అతని డ్యూటీని నెరవేర్చుటలో ఏదైనా దుర్నడతగా వున్నట్లు అభిప్రాయ పడినయెడల ఇన్స్పెక్టరు ప్రకటన మూలమైన వుత్తరువుద్వారా ఒక నిర్ణయ తేదీ నుండి ఆయనను తొలగించవచ్చును.

(3) పై 1, 2, సబుసెక్షనుల ననుసరించి చర్యతీసుకొన నుద్దేశించినప్పుడు ఇన్స్పెక్టరు ఆ ప్రెసిడెంటుకు లేదా మెంబరుకు సంజాయిషి యిచ్చుటకు అవకాశ మివ్వవలెను. ఆ చర్యకు కారణములు ప్రకటనలో తెలుపబడవలెను.

(4) 1, 2, సబుసెక్షన్ల ప్రకారము చేయబడిన ఏప్రకటనను గాని రద్దుచేయుటకు గవర్నమెంటుకు అధికారముగలదు. మరిన్ని అట్లు రద్దుచేయు వుత్తరువు చేయువరకు అట్టి ప్రకటన నిర్ణయతేదీని ఆపి పెట్టవచ్చును.

(5) పై 1, 2, సెక్షన్ల క్రింద తొలగించబడిన ఎవరుగాని ఆప్రకటన గవర్నమెంటువారివల్ల రద్దు చేయబడిననే తప్ప పంచాయితీ మరు సాధారణ ఎన్నిక నోటీసులో ప్రకటించిన తేదీ లేదా గవర్నమెంటువారివల్ల జారీచేయబడిన వుత్తరువు ఏదైనా వున్నయెడల అట్టి వాయిదాతేది యీ రెంటిలో ఏదిముందుగా నుండునో అదిమొదలు సంవత్సరము వెళ్ళునంతవరకు ప్రెసిడెంటుగా వైసు ప్రెసిడెంటుగా లేదా మెంబరుగా ఎన్నుకొనబడుటకు గాని వుద్యోగమును కలిగియుండుటకు గాని అనర్హుడుగా వుండవలెను.

48. సెక్షను — (1) పంచాయితీ చట్టముప్రకారము పనులుచేయుటకు అర్హతలేదని గాని, పనులు చేయుటలో అప్పుడప్పుడు తప్పిపోవుచుండు యెడలగాని, తమఅధికారములను దుర్వినియోగ పరచిన యెడలగాని, గవర్నమెంటువారు ప్రకటనద్వారా—

A. ఆపంచాయితీని వెంటనే తొలగించుటకు లేదా ఒకనిర్ణయ తేదీనుండి పునర్నిర్మాణము చేయుటకు వుత్తరువు చేయవచ్చును.

B. సదరు పంచాయితీని సంవత్సరమునకు జాస్తిలేకుండా ఒకనిర్ణయతేదీనుండి రద్దు చేయవచ్చును.

(2) అట్లు రద్దుచేయు మధ్య కాలములో ప్రెసిడెంటు వుద్యోగములో నుండుటకు ఈ సెక్షను అడ్డులేదు.

(3) పై చెప్పిన విధముగా ప్రకటనకు పూర్వము గవర్నమెంటువారు అందుకు వారి వుద్దేశ్యకారణములను పంచాయితీకి తెలిపి, వారిసమాధానము తీసుకొని ఆలోచించవలెను.

(4) పై 1 టవ సబుసెక్షన్ ననుసరించి పంచాయితీని రద్దుచేయుటకు నిర్ణయించబడిన తేదీని దాని మెంబర్లు వైస్ప్రెసిడెంటు తమ వుద్యోగములను వెంటనే తొలగినట్లగును.

(5) పంచాయితీ తీసివేయబడుటకు, తిరుగా ఏర్పరచుటకు మధ్యకాలములో ప్రెసిడెంటు గవర్నమెంటువారి ఉత్తరువు మేరకు పంచాయితీ అధికారములను, పనులను, నెరవేర్చవలెను. పంచాయితీ పరిసమాప్తి లేదా రద్దుతేదీని ప్రెసిడెంటు వుద్యోగము కాళీగావున్నయెడల. లేదా తిరుగా ఏర్పరచుటకు పూర్వము కాళీగా వున్నయెడల పంచాయితీ అధికారము

లను నెరవేర్చుటకు ఇన్‌స్పెక్టరు ఒక వుద్యోగిని నియమించవచ్చును. ఆయన జీతమును పంచాయితీనుండి పొందవలెను.

(6) తిరుగా ఏర్పరచబడిన పంచాయతీయొక్క ప్రెసిడెంటుతప్ప. యితర మెంబర్లు పంచాయితీ తిరుగా ఏర్పడిన తేదీని వారిఉద్యోగములలో చేరవలెను. వారి ఉద్యోగకాలము గవర్నమెంటువారు నిర్ణయించిన తేదీకి పూర్తికావలెను. అట్టినిర్ణయ సంవత్సరము ఆజిల్లాలో ఏదైనా పంచాయితీకి మరుసటి సామాన్య ఎన్నికలు జరుగవలసిన సంవత్సరముగా వుండవలెను. అట్టితేదీ ఆసంవత్సర డిశంబరు ఆఖరులోపుగా నుండవలెను.

(7) ఒకపంచాయితీ ఈ సెక్షనుక్రింద తీసివేయబడినపుడు తిరుగా ఏర్పాటుచేయు తేదీ వరకు గవర్నమెంటు వారున్నూ. అవల తిరుగా ఏర్పాటుచేయబడిన పంచాయితీయున్నూ పంచాయితీ అప్పులకు హక్కు బాధ్యతకలిగి యుండవలెను.

**49.** సెక్షన్ — పంచాయితీ రద్దుకాబడినపుడు ఈ యాక్టు ననుసరించి గవర్నమెంటు వారు లేదా ఇన్‌స్పెక్టరు నియమించిన ఏజనిషికిగాని చట్టసమ్మతమైన అన్ని అధికారములు, హక్కులు వుండవలెను. వారు అధికారమును చెలాయించుటలో ఏదైనా నష్టమునుపొందిన ఎవరుగాని ఆపంచాయితీవల్ల లేదా దాని వుద్యోగులవల్ల జరుపబడియుండినట్లే అంతవరకు పరిహారము రాబట్టుకొన తగియుండును.

## —: 3 వ— అధ్యాయము: పంచాయితీపనులు, అధికారములు; ఆస్తి :—

**50.** సెక్షన్ — ఈ ఆక్టుకులోబడి, పంచాయతీఫండు పరిమితికిలోపుగా పంచాయితీ వారు ఈక్రిందివిషయములు గ్రామ అవసరపనులు న్యాయమైన ఏర్పాటులు చేయవలెను. అవియేవనగా,

A. గ్రామంలోని అన్ని పబ్లీకురోడ్లు, వాటివంతెనలు, తూములు, డాములు, నిర్మించుట, మరమత్తుచేయుట, పోషించుట.

B. పబ్లీకురోడ్లలో, స్థలములలో దీపములు వేయుట.

C. మురుగుకాలువలు నిర్మించి, దానినీరు మురుగును పారవేయించుట.

D. వీధులు పరిశుభ్రముచేయుట, దుబ్బపొదలు, నాగజముడు తొలగించుట ఉపయోగములేని బావులు అనారోగ్యమైన గుంటలు, మడుగులు, గుండకములు, పల్లములు, బొందలు పూడ్చుట గ్రామఆరోగ్య అభివృద్దిచేయుట.

E. పబ్లీకు పాయిఖానాలు ఏర్పరచుట, పబ్లీకుప్రయివేటు పాయిఖానాలు పూడ్చుటకు ఏర్పాటుచేయుట.

F. పూడ్చునట్టి, దహనము చేయునట్టి స్మశానములు ఏర్పరచి వాటినిపోషించుట.

G. బావులుతవ్వుట, వాటిని మరమత్తుచేయుట, కడుగుటకు స్నానముచేయుటకు, త్రాగుటకు, మంచినీటిని సప్లయి చేయుటకుగాను గుంటలు, చెరువులు త్రవ్వించుట వాటిని మరమత్తుచేసి పోషించుట, వాటపవర్కు నిర్మించుట, పోషించుట.

H. ప్రజలకు ఏకాలమందుగాని తగులు ఏవ్యాధినైనను గాని మలేరియానుగాని రాకుండా ఆపుటకై పరిహారచర్యలు జరుపుట,

I. పై చెప్పిన కార్యములు పంచాయితీవారు దాని ఫండునను సరించి చేయవలెను.

51. సెక్షను — ఈ అక్టుకున్నూ, రూల్సుకున్నూ, లోబడి పంచాయితీవారు యుక్తమని తోచినయెడల గ్రామమునకు అవసరమగు ఈక్రింది కార్యములు ఏర్పాటు చేయ వచ్చును. అవి యేవనగా—

A. గ్రామములోని పబ్లికురోడ్డుల ప్రక్కలో చెట్లునాటుట, వాటిని పోషించుట.

B. జిల్లాకు సంబంధించిన మార్కెటులు కానట్టి యితర పబ్లికు మార్కెటులు ఏర్పరచుట వాటిని పోషించుట.

C. జిల్లాకు సంబంధించిన సంతలు, ఉత్సవములు కానట్టి యితరసంతలు, ఉత్స వములు మీద అధికారము కలిగియుండుట.

D. పబ్లికు ల్యాడింగులు (ప్రయాణికులు దిగుచోటు) ప్రయాణికులు నిలచే స్థలములను, బండ్లదొడ్లను, పబ్లికు పశువుల కొట్టములను, ఏర్పరచుట పోషించుట.

E. పబ్లికు జంతువధశాలలు, ఏర్పాటు చేయుట, పోషించుట.

F. జిల్లాకు సంబంధించిన సత్రములు కానట్టి యితర సత్రములు స్థాపించుట, పోషించుట.

G. గ్రామ కంఠములను వృద్ధిచేయుట, కట్టడములను క్రమములో వుంచుట.

H. జనన మరణములు రిజిష్టరు చేయుట,

I. వ్యవసాయము, వ్యవసాయజంతువులు, అభివృద్ధిపరచుట, వ్యవసాయ ప్రద ర్శనములు జరుపుట,

J. గృహపరిశ్రములు అభివృద్ధిచేసి వాటిని ప్రోత్సహించుట.

K. ప్రాథమిక పాఠశాలలు ఏర్పరచుట, వాటినిపోషించుట,

L. రీడింగు రూములు లైబ్రరీలు ఏర్పాటుచేయుట వాటిని పోషించుట,

M. రేడియోలు, ఆటస్థలములు, వ్యాయామ క్లబ్బులు దేహపరిశ్రమబోధ స్థాపించుట వాటిని పోషించుట.

N. ఔషధశాలలు స్థాపించుట, పోషించుట, గ్రామవైద్యవృత్తికి ద్రవ్యసహాయము చేయుట

O. ప్రసవ, శిశురక్షణ, కేంద్రములు స్థాపించుట, పోషించుట.

P. పశువైద్య సహాయము.

Q. గ్రామస్తులక్షేమము, ఆరోగ్యము, సౌకర్యము, సుఖము అభివృద్ధి చేయుట ప్రజా ఉపయోగమైన యితర చర్యలు జరుపుట.

పంచాయితీవారు పైజెప్పిన కార్యములుకూడా చేయవచ్చును.

52. సెక్షను— యీ అక్టుకు రూల్సుకులోబడి, రెండు లేదా జాస్తి పంచాయితీలకు జాయింటుగా ఆసుపత్రులు, శిశురక్షణకేంద్రములు, యితరసంస్థలు నియమించబడ వచ్చును. పోషించబడ వచ్చును.

53. సెక్షను — (1) A. యీ ఆక్టు ప్రారంభకాలమునకు గ్రామములో రిజర్వుచేయని అడవులన్నియు పంచాయితీకి చెందవలెను. అవి గ్రామస్థులకొరకు పరిపాలించబడవలెను.

B. అట్లు పంచాయితీకి చెందబడిన అడవులు విషయములో కలెక్టరు కోరినయెడల అట్టి అడవిలో రాబడు వరుమానమును పంచాయితీకి చెల్లింపవలెను.

(2) A. పై విధముగా పంచాయితీకి అప్పగించబడిన అడవినిపంచాయితీ క్రమముగా పరిపాలించుట లేదని రివిన్యూడివిజనల్ ఆఫీసరుకు తోచినయెడల ఆయన ఏదో ఒక నిర్ణయపు కాలములోగా అడవిని తిరుగా అప్పగించమని ఉత్తరువు చేయవచ్చును.

B. పైవిధముగా రివిన్యూడివిజనల్ ఆఫీసరుచేసిన ఉత్తరువు వాంఛదాను ఆయన తిరుగా మాడిగించవచ్చును.

C. అయితే పై A. B క్లాజులకింద ఉత్తరువుచేయుటకు ముందు పంచాయితీ వారి సంజాయిషీ తీసుకొనిన పిమ్మట చేయవలెను.

D. పై విధముగా రివిన్యూడివిజనల్ ఆఫీసరుచేసిన ఉత్తరువుమీద పంచాయితీ వారు ఉత్తరువు అందిన 3 మాసములలోగా జిల్లాకలెక్టరుకు అపీలు చేసుకోవచ్చును. కలెక్టరు ఆ ఉత్తరువును సవరణ, మార్పు లేదా ఖాయము చేయవచ్చును.

(4) రివిన్యూబోర్డువారు తమంతటతామేగాని, లేదా, ఎవరియొక్క దరఖాస్తుమీదగాని, పైవిధముగా రివిన్యూడివిజనల్ ఆఫీసరుగాని కలెక్టరుగాని, చేసినఉత్తరువు, రికార్డును, తెప్పించుకొని సదరు ఉత్తరువులయొక్క న్యాయమును విమర్శించి తమకు తోచిన విధమున దానిని తీర్మానించుటకు అధికారముగలదు.

(4) యీ ఆక్టుకు. రూల్సుకు. లోబడి రివిన్యూబోర్డు లేదా కలెక్టరు లేదా రివిన్యూడివిజనల్ ఆఫీసరు పంచాయితీగ్రామము లోపలగాని వెలుపలగాని, ఏదైనా సంస్థయొక్క నిర్వహణ లేదా పక్కచేయుట పోషించుట మీద అధికారము పంచాయితీబోర్డుకు అప్పగించవచ్చును.

54. సెక్షను — (1) A. గవర్నమెంటువారు ఉత్తరువుకు లోబడి రివిన్యూబోర్డువారు ప్రకటన మూలముగా పంచాయితీ అంగీకారముతో, రివిన్యూబోర్డుకు చెందియుండు ధర్మాదాయ నిర్వాహణమును, దానిమీద విచారణను పంచాయితీబోర్డుకు అప్పగించవచ్చును. అట్లు అప్పగించబడిన మీదట రివిన్యూబోర్డువారికి దానిమీదగల అధికారము, పనులు హక్కులు పంచాయితీకి చెంది దానిని పంచాయితీ వారి నిర్వహణ విచారణలో యుండవలెను.

B. రివిన్యూబోర్డువారు ప్రకటనద్వారా తమంతటతామే పై విధముగా పంచాయితీని అప్పగించబడిన దానిని తిరుగా తాము తీసుకొనవచ్చును. లేదా గవర్నమెంటువారు కోరినయెడల విధిగా తీసుకొనవలెను. అప్పుడు పంచాయితీకి దానిమీదగల అధికారము అన్నియు అంత్యము కాబడును.

(2) పై విధముగా తిరుగా తీసుకొనబడిన ధర్మాదాయ యినాములను పంచాయితీకి గవర్నమెంటువారు అప్పగించవచ్చును. అయితే అట్టి యినాములవల్ల రాబడు నికరాదాయము

పంచాయితీవారు ప్రత్యేక పనికి వినియోగించునట్లు గవర్నమెంటువారు వుత్తరువు చేయ వచ్చును. అట్టి వుత్తరువును రద్దుగూడా చేయవచ్చును.

55. సెక్షన్ — పంచాయితీ ద్రవ్యమును వినియోగపరచవలసిన కార్యముయొక్క అభివృద్ధికి ప్రత్యేకముగా రాబడి విరాళములను ట్రస్టులను పంచాయితీ అంగీకరించవచ్చును.

56. సెక్షన్ — (1) జిల్లారోడ్లు, రాజధానికి చెందిన రహదారులు కానట్టి, గ్రామంలో యుండు అన్నిరోడ్లను బాటలను, వాటికి సంబంధించిన వస్తుసామగ్రియున్నూ, వద్దులు, జలధారులు, యితరవద్దులు పంచాయితీ స్వాధీనములో వుండవలెను.

(2) గవర్నమెంటువారు ప్రకటనద్వారా ఏపబ్లికురోడ్డు మురుగునుకాలవ వద్దులు, తూములు, యీ ఆక్టు అమలులో నుండి మినహాయించవచ్చును. మరిన్ని ఆప్రకటనను సవ రణ రద్దుగూడా చేయవచ్చును.

57. సెక్షన్ — యీ ఆక్టు అధికారముకింద పంచాయితీవారు పోగుచేసిన యావత్తు మురుగుడు, చెత్త, పెంట, యితరపదార్థము పంచాయితీకె చెందవలెను.

58. సెక్షన్ — గ్రామస్థులకు వుమ్మడిగాయుండు, గ్రామాచారమును బట్టి వుమ్మడిగా యుండు, లేదా గ్రామలాభము నిమిత్తము పరిపాలించబడుచుండు ఏఆస్తిగాని ఆదాయము గాని పంచాయితీకి చెందియుండి గ్రామస్థుల నిమిత్తము వారి పరిపాలనలో యుండవలెను.

59. సెక్షన్ — (1) గ్రామనీటి పారుదల పనిని రక్షించుట పోషించుట, పారుదల దామాషాలను తీర్మానించుట, పంపకము క్రమ పరచుట గవర్నమెంటువారు పంచాయితీకి ఒప్పగించవచ్చును,

(2) గ్రామంలోని నీరుపారుదల విషయములో దాని చిల్లర మరమత్తులు చేయుటకు ఖర్చులు పంచాయితీవారు రేట్లు చొప్పున విధించుటకు అధికారముగలదు. అయితే గ్రామాచార ప్రకారము నీటిపారుదల రిపేరు రయితులమీద వుండిన జవాబుదారి యీ ఏర్పాటువల్ల తొలగిపోదు.

60. సెక్షన్ — (1) యీ సెక్షన్‌లో చెప్పబడిన హంశములు రైతువారీ ప్రదేశములలో మాత్రము వర్తించవలెను.

(2) పచ్చిక బయళ్లు, పంటకళ్ళములు, శ్మశానములు, పశువులమంద బయళ్ళు, బండ్లదొడ్లు, తోపులు, యీలాటి పొరంబోకులను పంచాయితీవారు క్రమపరచుట వాటి వుపయోగములను ఏర్పరచుట చేయవచును. అయితే యిందువల్ల పొరంబోకుల మీద గవర్న మెంటువారికిగల హక్కులు పోనేరవు.

(3) కలెక్టరు పై చెప్పబడిన ఏదైనా పొరంబోకును యీ ఆక్టు వర్తించకుండా మినహాయింపు చేయవచ్చును. అట్లు చేయబడినదానిని రద్దుగూడా చేయవచ్చును.

(4) గవర్నమెంటువారు వుత్తరువు యిచ్చినయెడల గవర్నమెంటువారి స్వాధీనములో యుండు పొరంబోకుల వుపయోగమును క్రమపరచుటను పంచాయితీకి అధికారము యివ్వ వచ్చును,

(5) పై చెప్పిన పోరంబోకులలో పంచాయితీవారు చెట్లను నాటించవచ్చును.

61. సెక్షన్ — (1) A. మద్రాసు యెస్టేట్లు ల్యాండు ఆక్టుకిందరాబడు ఎస్టేట్లలో సదరు ఆక్టుకు 3 సెక్షన్ 16 క్లాజు బి. సబుక్లాజుకింద చెప్పబడిన పనులకు ప్రత్యేకించబడిన భూములను అనగా, కళ్ళములు, పశువులు నిలుచు స్థలములు గ్రామనత్తములు గ్రామవుమ్మడి వుపయోగభూములను ప్రత్యేకించబడిన యితర భూముల వుపయోగమును క్రమపరుచుటకు.

B. యెస్టేటుల్యాండు ఆక్టు 20 వ సెక్షన్‌కింద జిల్లాకలెక్టరుకు వుండు అధికారములను పంచాయతీవారు చలాయించవచ్చును. అయితే ఏభూమినిగాని ఇతరసముదాయ కార్యము నిమిత్తము వుపయోగించు సందర్భములో జిల్లాకలెక్టరు అంగీకారముపొంది అట్లు చేయవలెను.

C. పై చెప్పబడిన రకముభూములలో చెట్లు నాటుటకు పంచాయితీకి అధికారము గలదు. అయితే పై B క్లాజులోనుండునది సదరు ఆక్టు 20 A సెక్షనుయొక్క 1 వ సబు సెక్షన్ మినహాయింపు నిబంధనలు వర్తించుటలో బాధించకూడదు.

(2) ఎస్టేటుల్యాండు ఆక్టుకింద ఒకఎస్టేటు రద్దుకాబడినపిమ్మట పై 1 వ సబుసెక్షన్ లోని నిబంధనలు నిర్ణయ రూల్సు మేరకు ఆసబుసెక్షన్‌లో చెప్పబడిన భూములకు వర్తించవలెను.

62. సెక్షన్ — యీ ఆక్టువల్లనూ, రూల్సువల్లనూ, ఆస్తిని పొందుటకు పంచాయితీకి గల అధికారముకింద ఆస్తిని, ల్యాండు అక్విజిషన్ ఆక్టుకింద సంపాదించబడ వచ్చును. సదరు ఆస్తికి పరిహారద్రవ్యము యివ్వబడిన మీదట అది పంచాయితీ ఆస్తిగా వుండవలెను.

## —: 4 వ అధ్యాయము — పన్నులువిధింపు — ద్రవ్యము. :—

63 సెక్షన్ — (1) ప్రతి పంచాయితీయున్న గ్రామములో యింటిపన్ను, వృత్తికి బండ్లకు పన్ను విధించబడవలెను.

(2) 67 వ సెక్షన్ ప్రకారము ఆస్తి పరివర్తనలమీద ప్రతి గ్రామమునందును ఒక డ్యూటీని విధించబడవలెను.

(3) ఇన్స్పెక్టరు అంగీకారముపొంది ఆయన నిర్ణయించు షరతులకు లోబడి.

A. కట్టడములు లేనట్టిన్ని, కట్టడములను ఆనుకొని దానికి సంబంధములేని కాళీ స్థలములకు సంవత్సర వారి అద్దెవిలువలో రూ 1కి 0—0—3 రేటునకాళీస్థలము పెన్నున్నూ

B. ఏదోఒక నిర్దిష్ట కార్యముకొరకు వ్యవసాయ భూములమీద పన్నున్నూ.

C. వ్యవసాయ ఫలితములు మార్కెటు (1933 వ సం రు అక్టు) 11 సెక్షన్ ప్రకారము కమిటీవారు పన్నువిధించు నట్టిది గాకువడా గ్రామములోనే వ్యవసాయ ఫలితములు విక్రయములు వ్యాపారముగా జరుగువాటిమీద రసుములు విధించవచ్చును.

(4) వ్యవసాయ ఫలితములు గ్రామములోవిక్రయముమీద రుసుములు సందర్భములో ఇండియాఆక్టు 286. సెక్షన్‌కులోబడి యుండవలెను.

64. సెక్షన్ — (1) పై సెక్షన్‌లో చెప్పబడిన ఇంటిపన్నులు గ్రామంలోని గుడిసెలు తప్ప యితర అన్ని ఇండ్లమీదనూ పన్ను విధింపు యీక్రింది ఏదోఒక ఆధారముమీద విధింపు వుండవలెను. విధింపు ఆధారములు.

A. వాటి సంవత్సర ఆదాయవిలువ.

B. వాసిమూల ధనపువిలువ.

C. యుక్తరవిధముగా నిర్ణయ ఆధారము.

(2) ఇంటిపన్ను. ఆయిల్లు నివేశమునకు గవర్నమెంటువారికి ఏదైనా పన్నుపున్న యెడల దానికిలోబడి ఇంటిపన్ను మొదట చార్జిగా ఆ యింటిమీదనూ. దానిని కలిగిన మనిషి యొక్క చరాస్తిమీదనూ బాధ్యతగా వుండవలెను.

(3) ఇంటిపన్ను ప్రతి అర్ధసంవత్సరమునకు పంచాయతీ నిర్ణయించిన రేటు ప్రకారము విధించబడవలెను. పంచాయితీవారు నిర్ణయించిన ఆధారపు కనీసపు రేటుకు తక్కువగాని. గరిష్ట రేటుకు ఎక్కువగాని వుండకూడదు.

(4) గవర్నమెంటువారు యిందునుగురించి యీ క్రింది విషయములలో రూల్సును చేయవచ్చును.

(1) ఏదో ఒక తరగతి యిండ్లకు పన్నులు మినహాయింపు చేయవచ్చును.

(2) ఇండ్లకు పన్నును విధించుటకు వుండవలసిన తరగతులు నిర్ధారణ.

(3) పన్నులు చెల్లించుటకు బాధ్యులెవరు ? అనిన్ని అందుకు ఇవ్వవలసిన నోటీసులు విధానమున్నూ.

(4) బీదవారను కారణము మీద పన్నునుండి మినహాయింపు చేయుట.

(5) కాళీగానుండు వాటినిగురించి పన్ను మినహాలు యిచ్చుట.

(6) వసూలు చేయవలసిన షరతులు. ఏసందర్భములో మినహాయింపులు చేయవచ్చును. అను షరతులను గురించి రూల్సు చేయవచ్చును.

(5) ఇంటిస్వంతదారు తరఫున అనుభవదారు పన్ను చెల్లించిన యెడల అసలుదారువద్ద ఆ పన్నును ఆయన రాబట్టుకొనుటయున్నూ, అద్దెలో దానిని ముజరా పెట్టుకొనుటయున్నూ, హక్కు వుండవలెను.

65 వ సెక్షను.—(1) రూల్సు కొరకు వృత్తిపన్ను ప్రతి అర్ధ సంవత్సరమునకు యీ క్రిందివిధముగా విధించబడవలెను. 1.— ఆ అర్ధ సంవత్సరములో మొత్తములో 60 రోజుల కంటె తక్కువ లేకుండా గ్రామములో వ్యాపారముచేయు ప్రతి కంపెనీకిన్ని. 2.— ఆ గ్రామములో అర్ధ సంవత్సరములో 60 రోజులకు తక్కువ లేకుండా ఏదైనా వృత్తి. చేతిపని, వ్యాపారము లేదా ఏదైనా పబ్లిక ప్రైవేటుపని చేయుమనిషికి విధించబడవలెను. మొత్తములో 60 దినములకు తక్కువలేకుండా అట్టిగ్రామములో కాపురముపుండి ఏదైనా పెన్షను, పెట్టుబడిఆదాయము, పొందువారిమీద విధించబడవలెను.

(2) వృత్తిపన్ను విధించవలసిన రేటు పంచాయితీ వారివల్ల నిర్ణయించ బడవలెను, అట్టి రేటుకు జాస్తిగాని తక్కువగాని విధించరాదు.

(3) 1 వవ సబుసెక్షనులో కనుపరచిన అన్ని అయిటములలో కలిసి ఒకమనిషికి రాబడు వరుమానము ననుసరించి వృత్తిపన్ను విధించబడవలెను.

(4) యీ సెక్షను మేరకు ఒకరు వృత్తిపన్ను యితర పంచాయితీలో కొంతకాలము వుండి ఆ అర్ధసంవత్సరమునకు అక్కడ చెల్లించినట్లు రుజువు కాబడినయెడల, యితర ప్రదేశములో చెల్లించిన వృత్తిపన్నుపోను మిగతా ఏమైనా చెల్లించవలసినయెడల దాని వ్యత్యాసము మాత్రమే వారు చెల్లించవలెను.

(5) పై సందర్భములలో గవర్నమెంటువారు ఆరెండు ప్రదేశములమధ్య ఆపన్నును రెంటిమధ్య పంపకము చేయవలెను. గవర్నమెంటువారి పంపకతీర్పు ఖాయమై వుండవలెను.

(6) ఏదైనా, ఫరము అసోసియేషను హిందూజాయింటు కుటుంబముమీద విధించబడు వృత్తిపన్నుకు దానిలోని మేనేజరుకాబడిన ఏమెంబరుగాని బాధ్యుడుగానుండి చెల్లించవలెను.

(7) **A.** ఎవరుగాని పంచాయితీ ప్రదేశములో వ్యాపారము జరుపుచూ వారు అక్కట లేకుండా వారి యేజంటుద్వారా జరుపుచుండినయెడల వారి వుభయులమధ్య ఖరారులు ఏట్లున్ననూ, దానివృత్తిపన్నుకు యేజెంటు బాధ్యుడుగా నుండవలెను.

**B.** ఒక కంపెనీ లేదా వ్యక్తి మరియొక కంపెనీ లేదా వ్యక్తితరపున యేజెంటుగా వ్యవహారము జరిపినపుడు మొదటికంపెనీ లేదా వ్యక్తి ప్రధాన మనిషివలె అదే ఆదాయము మీద ప్రత్యేకముగా వృత్తిపన్నుకు బాధ్యుడుగా నుండవలెను.

66. సెక్షను — పై 63-వ సెక్షనులో చెప్పబడిన బండ్లపన్ను హక్కుకుపోబడి గ్రామంలో వుంచుకొనబడిన వుపయోగించబడు బండ్లమీద నిర్ణయరేటుకు హెచ్చుతక్కువ లేకుండా పంచాయితీ రేట్లుప్రకారం పన్ను విధించబడవలెను.

వివరణము:— "బండి" అనగా రోడ్డుమీద వుపయోగించతగిన వాహనము. యీ మాటలో ట్రాము. బండి, మోటుబండి, వాగను, బైసికలు, ట్రైసికలు, రిక్షా, యివన్నియు చేరును.

67. సెక్షను — ఆస్తి ట్రాన్స్ఫరులమీద పన్ను.

1. A. పంచాయితీ పరిపాలనలోయుండు ప్రదేశపు స్థిరాస్తి ట్రాన్స్ఫరు జరుగు దస్తావేజులమీద స్టాంపు ఆక్టుననుసరించిన మొత్తముమీద సర్చార్జిగానూ స్థిరాస్తి విక్రయములు, దానము, స్వాధీనతలనఖా, శాశ్వతగుత్త.

B. సదరు దస్తావేజులమీద కనుపడు మొత్తముమీద నూటికి వ 5 లుకు జాస్తి లేకుండా విధించ బడవలెను.

(2) సదరు విధముగా పన్నువేయునట్లు తీర్మానించిన మీదట.

A. పంచాయితీ లోపలయుండు ఆస్తి, వెలుపలయుండు ఆస్తి వివరములు దస్తావేజులో కనుపడవలెను.

B. స్టాంపుఆక్టు 64, సెక్షన్ గవర్నమెంటు అనుమాటలో పంచాయితీగూడా చేరినట్లగును.

(3) యిట్టిపన్ను వసూలుచేయుట దానిని పంచాయితీకి చెల్లించుటకు గవర్నమెంటుకు అయినఖర్చులను గురించి గవర్నమెంటువారు రూల్సును చేసెదరు.

68. సెక్షన్ — ఒక పంచాయితీవారికి రావలసిన ఏదైనా పన్నులు, రుసుములు, అది రాబట్టుకొనుటకు వీలులేదని పంచాయితీవారికి తోచినయెడల వసూలుకు వీలుకాదని కొట్టివేయుటకు అధికారముగలదు. అయితే పంచాయితీ మొత్తములను ఏదైనా కలెక్టరు వసూలుచేయవలసిన బాపతు అయిటముల సందర్భములో అట్టిమొత్తములు వసూలుకాబడ జాలవు. అవి కలెక్టరువల్లగాని రివిన్యూబోర్డు వారివల్లగాని తీర్మానించబడవలెను.

69. సెక్షన్ — పంచాయితీకి రావలసిన ఏదైనా మొత్తములు ఆగ్రామమునకు సంబంధించిన గ్రామ మునసబువల్ల వసూలు చేయించవలసిన బాపతులుగా ఏర్పడినయెడల దాని కార్యనిర్వహణ అధికారి కలెక్టరుద్వారా గ్రామ మునసబుకువ్రాసి వసూలుచేయునట్లు చేసి అట్లు ఆయన వసూలు చేసిన మొతములకు నూటికి రు 6—4—0 లుకు జాస్తి లేకుండా గ్రామమునసబుకు ప్రతిఫలము నిర్నయించి చెల్లించవచ్చును.

70, సెక్షన్— (1) పంచాయితీకి రాబడు యావత్తు మొత్తములు "పంచాయితీఫండు". అని ఏర్పడవలెను. అట్టి మొత్తములను యీఆక్టు, రూల్సు. మేరకు వుపయోగించవలెను.

అయితే యీఆక్టుకింద వసూలుచేయబడిన ఏదైనా పన్ను మొత్తములు అధనపుపన్నులు ఏవైనా ఒకనిర్నయపబ్లీకు అభివృద్దికి మాత్రమే వుపయోగపరచ వలసినట్లు పంచాయితీవారు తీర్మానించవచ్చును, యిట్టి సందర్భములో అపద్దులయొక్క జమలు ఖర్చులకు ప్రత్యేకముగా లేఖలు వుంచవలెను.

(2) యీ క్రింది వరుంబడులు పంచాయితీ ఫండుక్రింద జమకట్టవలెను.

(1) యీ ఆక్టు 63వ— సెక్షణ క్రింద విధించబడిన ఇంటిపన్ను వృత్తిపన్ను బండ్లపన్ను యింకా యితరపన్నులు సెన్సులు.

(2) యీ ఆక్టు 67 వ — సెక్షన్ ప్రకారము ఆస్తి ట్రాన్సుఫర్లవల్ల రాబడు మొత్తములు

(3) డిస్ట్రిక్టుబోర్డు ఆక్టుకొరకు గ్రామంలో విధించబడిని ల్యాండుసెస్సులో నాల్గవ భాగము.

(4) యాత్రీకుల మీద విధించబడి రాబడు పన్ను.

(5) వ్యవసాయ ఫలింపులు విక్రయములమీద అపంచాయితీలో విక్రయముల మీద రాబడు పన్ను.

(6) యీ ఆక్టు 117—118 సెక్షణాల ప్రకారము ఆరోగ్యము కొరకు గ్రామంలో విధింభబడు పన్ను.

(7) జిల్లా మార్కెట్లు, జిల్లాకు సంబంధించిన ఎగుమతి దిగుమతి రేవులు విషయములో రాబడు పన్నులో గవర్నమెంటువారిచే నిర్నయించబడిన దామాషా పన్ను.

(8) గ్రామ కంఠమ్ములు రోడ్లు యితర పబ్లికు స్థలములు ఆక్రమించినందుకు విధించబడు పన్ను.

(9) యీ ఆక్టు క్రింద రూల్సు క్రింద పంచాయితీవారు విధించు ఏదైనాయితర పన్నులు.

(10) గ్రామ ప్రాథమిక పాఠశాలలు నిర్మించుట, పోషించుటకుగాను జిల్లాబోర్డుసహాయముగా యివ్వబడు మొత్తములు.

(11) పంచాయితీ క్రిందయుండు ధర్మాదాయములు ట్రస్టులువల్ల రాబడు మొత్తములు.

(12) యీ ఆక్టు ప్రారంభము కాబడిన పిమ్మట గవర్నమెంటువారిచే తీసుకొనబడిన నవుకరి యినాముల రాబడు నికరపన్ను.

(13) గ్రామంలో చేపలు వల్ల రాబడు వరుమానము.

(14) పంచాయితీ నిర్వహణలో చేరిన రేవులవల్ల రాబడుపన్ను.

(15) ఏదైనా డిపాజిట్లు దండుగక్రింద కలుపుకొనబడిన మొత్తములు.

(16) రోడ్లుకు కావలసిన కంకరరాయి వగైరా (వస్తువులు) గనిలో తీసుకొన్నందుకు గవర్నమెంటువారికి రాబడు గని రుసుముకు సమానమైన మొత్తము.

(17) పంచాయితీకి అనుభవపు హక్కు కలుగజేయబడిన పోరంబోకులలో రొఖ వరుమానము.

(18) పోరంబోకులోని చెట్లవల్ల రాబడు ఆదాయము.

(19) పంచాయతీకి ఒప్పగించబడిన గవర్నమెంటు ఆస్తినుండి రాబడు వరుమానము

(20) యీ ఆక్టుక్రింద గ్రామంలో చేయబడిన నేరములకుగాను మెజిస్ట్రీటు విధించబడి వసూలు కాబడిన జుల్మానా మొత్తములలో 10లో తొమ్మిది భాగములు మొత్తము.

(21) గవర్నమెంటువారి వల్ల పొందబడిన గ్రాంటు—

(22) పంచాయితీ ఫండునుండి పోషించబడు లేదా ధన సహాయము పొందబడు ఏదైనా సంస్థలు. సర్వీసులునుండి రాగల మొత్తములు—

పైచెప్పిన అయిటములు పంచాయతీ ఫండుక్రింద జమ పెట్టబడవలెను.

71వ శెక్షన్ — గవర్నమెంటువారు రాజధానిలో భూమి సిస్తును వసూలు చేసిన (నీటి పన్నుతో సహా) మొత్తములో నూటికి 12—8—0 వంతున ప్రత్యేకించి, అట్టి మొత్తమును రెండవ తరగతి పంచాయితీలకు అన్నిటికి గ్రాంటుగా పంచిపెట్టవలెను.

72. వ శెక్షన్ట్(1) పంచాయితీ ఫండును వినియోగించవలసినపనులలో యీఆక్టుక్రింద రూల్సుక్రింద పంచాయితీవారు చేయవలసిన కార్యములన్నియు చేరును. సదరు ఫండును గవర్నమెంటువారు విధించిన రూల్సుకొరకు ఆగ్రామ హద్దులలో ఖర్చు పెట్టబడవలెను. ఆ గ్రామము వెలుపల గూడా యీ ఆక్టు కొరకు జరుపవలసిన ఏదైనా కార్యములు వున్ననూ లేదా ఇన్‌స్పెక్టరు వుత్తరువు ఆవిధముగా వున్ననూ వెలుపల ఖర్చులుగూడా పంచాయితీవారు చేయవచ్చును.

(2) A. ప్రతి పంచాయితివారున్నూ యీ క్రింది చెప్పిన ఖర్చులు విధిగాచేయవలెను.

(1) పంచాయితీవారు చేసిన ఏమైనా ఋణములు.

(2) ఎన్నికదారుల పట్టీలు తయారుచేయుట, సవరణచేయుట, ఎన్నికలను జరుపుట, ఎన్నిక అధికారుల ఖర్చులు సహా, (యీ మాటలో ఎన్నిక అధికారులు సిబ్బందులయొక్క జీతములు, అలవెన్సులు వారికి సెషను వున్నయెడల అది చేరియుండును.)

(3) పంచాయితీ యొక్క వుద్యోగుల నౌకర్ల జీతములు. అలవెన్సులు ప్రావిడెంటుఫండు, పెన్షను, నిర్ణయ భాగములు.

(4) ఏదైనా కోర్టువారు పంచాయతీ మీద చేసిన డిక్రీబాకీలు.

(5) ఆక్టువల్ల నిర్బంధముగా పంచాయితీవారు చెల్లించవలసిన ఏదైనా యితరఖర్చులు.

**B.** ప్రతి సంవత్సరమున్నూ గవర్నమెంటువారు పై 2వ క్లాజు ఖర్చులు మొత్తమును నిర్ణయించవలెను. అట్టిఖర్చును, 44. 46, 76, సెక్షనులలో చెప్పబడిన ఖర్చులతో చేరి యితర ఖర్చులకంటె ముందు చార్జిగా వుండవలెను.

(3) గవర్నమెంటువారి అంగీకారము పొంది పంచాయితీవారు ఇండియా దేశరక్షణ నిధికి చందాను యివ్వవచ్చును.

(4) గ్రామంలో ఏదైనా పబ్లిక ప్రదర్శనములకు, వినోదములకు, ధర్మఫండుకు, దీన లక్షణనివారణ చేయుటకు. వ్యాధి చికిత్సకు, వ్యాధి పరిశీలన సంస్థకు ఏదైనా యితర ఖర్చులకు ద్రవ్యములు ఇన్‌స్పెక్టరువారి అంగీకారముతో పంచాయితీవారు యివ్వవచ్చును.

73. సెక్షన్ — (1) కార్యనిర్వహణ అధికారి, రాబోవు సంవత్సరమునకు షుమారుగా రావలసిన ద్రవ్యము జరుగవలసిన ఖర్చులు ఒక బడ్జటును ముందుగా తయారుచేసి పంచాయితీవారి ఎదుట, వుంచవలెను. పంచాయితీవారికి తగినట్లు తోచిన సవరణలుచేసి దానిని అంగీకరింపవలెను.

(2) అట్లు అంగీకరించబడిన బడ్జటు నిర్ణయతేదీకి నిర్ణయ అధికారికి పంపవలెను. అట్లు బడ్జటును అందుకున్న అధికారివుద్దేశ్యములో ఏదైనా అవసరపనులకు బడ్జటులో తగిన ఏర్పాటు లేదని తోచినయెడల అందుకు అవసరమైన సవరణలు చేయుటకు ఆయనకు అధికారముగలదు.

(3) బడ్జటులోని జమలను గురించిగాని ఖర్చులను గురించిగాని మార్పుచేయవలసిన అవసర మున్నట్లు ఆ బడ్జటు సంవత్సరములోనే పంచాయితీకి తోచినయెడల ఒకసప్లిమెంటుగాని రివైజు బడ్జటుగాని పంచాయితీవారు తయారుచేసి పంపవచ్చును. దానిని అంగీకరించవచ్చును. ఆయితే అట్టిమార్పు బడ్జటు రూల్సు మేరకు అధికారివల్ల అంగీకారము లేకుండా అములులో వుంచకూడదు.

74, (1) పంచాయితీ ఫండుయొక్క జమాఖర్చు లెఖలకు ఆడిటర్లను గవర్నమెంటువారు నియమించవలెను. అట్లు నియమించబడిన అడిటర్లు ఇం॥కిం కోర్టుమేరకు గవర్నమెంటు వుద్యోగులుగా భావించబడుదురు.

(2) ఆడిటర్ల జీతములు, భత్యములు కొరకు గవర్నమెంటువారు పంచాయితీ ఫండు నుండి ఏలాటి మొత్తములుగాని తీసుకొనకూడదు.

75, సెక్షన్ — యీ ఆక్టుకు మేరకు రూల్సుమేరకు ఏదైనా అధికారముగల కార్యము కొరకు గవర్నమెంటువారుగాని జిల్లాబోర్డుగాని పంచాయితీగాని, యితరస్థానిక వర్గముగాని చేయబడిన ఖర్చు ఆపంచాయితీ గ్రామంలో కాపురముండు వారికి లాభము ఏర్పడినయెడల

ఆపంచాయితీ ఇన్‌స్పెక్టరు అంగీకారముతో అట్టి ఖర్చులో ఏదైనా దామాషా మొత్తమును పంచాయితీవారు యివ్వవచ్చును. ఇన్‌స్పెక్టరు వుత్తరువు చేసినయెడల యిచ్చి తీరవలెను.

76. సెక్షన్ — (1) A యీ ఆక్టుకింద పంచాయితీ ఫండునువుపయోగించు కార్యము కొరకు అధికారము పొంది చేయబడిన ఋణములు తప్ప పంచాయితీ ఫండు ప్రభుత్వపు ఋణములకు మొదటి చార్జిగా నుండి చెల్లించవలెనని గవర్నమెంటువారు పంచాయితీకి వుత్తరువు చేయవచ్చును.

B. అట్టి ఏదైనా ఋణములు లేదా అడ్వాన్సును వ్యాప్యముచేసి రాబట్టుకొనివచ్చును.

(2) పై A క్లాజులో చెప్పిన మేరకు గవర్నమెంటువారు వుత్తరువు ఎవరికి చేయుదురో వారు ఆమొత్తము పంచాయితీ ఫండునుండి చెల్లించుటకు బద్ధులై వుండవలెను.

## 5 దవ అధ్యాయము — ప్రజాభద్రత — సౌకర్యము.

77. సెక్షన్ — (1) యీ ఆక్టు ప్రారంభములో వున్ననూ పిమ్మట చేయబడిననూ పంచాయితీ ఖర్చుతోనైననూ యితర విధముగానైననూ ఆనాది హక్కుగల యావత్తు పబ్లీకు ప్రవాహము. ఊటలు. రిజర్వాయర్లు, చెరువులు. తొట్లుచలములు, బావులు. యితరనీటిపనులు వాటికి పక్కలవుండు వాటికి సంబంధించిన భూమితోసహా పంచాయితీ స్వాధీనములోవుండి దానిమీద పంచాయితీకి అధికారము కలిగి యుండవలెను.

అయితే ఏదైనా పారుదలనీటి వక్కుకుగాని దానికి సంబంధించిన ఏదైనా వక్కుకుగాని పై సబుసెక్షన్ వర్తించదు,

(2) గవర్నమెంటువారు గజటు ప్రకటన మూలముగా అట్టి పైవిచారణను నిర్వచింపవచ్చును. లేదా పంచాయితీలో ఆలోచించిన మీదట వారి ఆక్షేపణలు విని ఆలోచించిన మీదట ఏలాటి నీటిసప్లయి ఆధారమునుగాని దానిపక్కనవుండు దానికి సంబంధించిన పబ్లీకు భూమియొక్క నిర్వహణము భరించవచ్చును.

## —: రోడ్లు :—

78. సెక్షన్ — ఏదైనా మశీదు, దేవాలయము మఠము, ఏదైనా మతసంబంధ ఆరాధన స్థలములు గ్రామహద్దుల లోపులగాని వెంబడిగాని వుండి చాలమంది అచ్చటికి వచ్చుచుండు సందర్భములో ప్రజల ఆరోగ్యముకు భద్రతకు సౌకర్యముకు ప్రత్యేక ఏర్పాట్లు చేయవచ్చును.

79. సెక్షన్ — ఈ ఆక్టు మేరకు చేయబడిన రూల్సుద్వారా లైసెన్సు వుండిననే తప్ప ఎవరుగాని.

(a) ఏదయినా రోడ్డులో శాశ్వతమైన లేదా టెంపరరిగా ఏలాటిగోడలు, కంచెలు, లేదా యితర ఆటంకములు, లేదా రోడ్డులోకి ముందుకు పొడుచుకొనివచ్చు కట్టడములు నిర్మించరాదు. ఆక్రమణ చేయరాదు.

(b) పబ్లీకు రోడ్లులో గుంటలు తోతర్రలు చేయరాదు. ఏదయిన వస్తువులనువుంచిరాదు.

(c) పంచాయితీ యొక్క పబ్లికురోడ్డుకుగాని. యితర స్థిరాస్తికిగాని యిరపైగజములు లోపుగా దూరములో క్వారిని తవ్వగూడదు. దానిలోనుండి రాళ్ళుమట్టి, యితర ఏపదార్థము గాని తీయకూడదు. అయితే ఎదయినా వ్యవసాయ భూములు పందర్భములో పక్కలోచేసిన ఏదయినా పనులు ఈ సెక్షన్ క్రింద రావని యిన్‌స్పెక్టరుకు తోచినయెడల అట్టిదానికి ఈ సెక్షన్ వర్తించదు,

(d) మురుగుడుకాలవ, జలదారి, మీద ఏకట్టడములుగాని కట్టకూడదు.

(e) పంచాయితీరోడ్డుమీద, యితర స్థలముమీద చెట్లను నాటకూడదు.

(f) పంచాయితీ రోడ్డుమీదగాని, యితరఆస్తిమీదగాని, లేదా ఏదయినా 60, 61 సెక్షన్‌లకింద రాబడిన పోరంబోకుల మీదగాని పెరుగునట్టి లేదా వుండినట్టి చెట్లను నరక కూడదు. బెరడు ఆకులు. కాయలు, తీసుకొనకూడదు. దానికి నష్టము కలుగజేయకూడదు.

——:మార్కెటులు:——

80 సెక్షన్ — పంచాయితీవారు పబ్లీకు మార్కెటు కొరకు వుపయోగించబడు ప్రదేశములను ఏర్పరచవచ్చును. మరిన్ని ఇన్‌స్పెక్టరువారి అనుమతినిపొంది, అట్టి మార్కెటును మూసివేయ వచ్చును.

(2) రూల్సుమేరకు పంచాయితీవారు ఏదయినా పబ్లికు మార్కెటుకు రేట్లునిర్ణయించబడిన యెడల అట్టి రేట్లకు జాస్తి లేకుండా ఏదయినా మార్కెట్లకు ఈకింది రుసుములు నిర్ణయించవచ్చును.

(A) మార్కెంటును వుపయోగించినందుకు. అందులో సరుకులను విక్రయించ చూపినందుకు.

(B) మార్కెటులో అంగళ్ళు. దొడ్లు, స్టాంప్లు, వుపయోగించినందుకు,

(C) విక్రియముకుగాను మార్కెటు సరుకు తీసుకొనివచ్చు (మోటారులునహా) అన్ని బండ్లమీద, మూటలు మోయు జంతువులమీద రుసుము.

(D) మార్కెటుకు విక్రయముకొరకు తను కొనితాబడిన జంతువులమీదపన్ను

(E) మార్కెటులో వృత్తిగా పచేనియు బ్రోకర్లు దలారులు కమీషన్ ఏజంట్లు, తూకము కొలత పనిచేయువారు. మీద లైసెన్సు రుసుములు పంచాయితీవారు విధించవచ్చును.

81. సెక్షన్ — (1) ఈ ఆక్టు ప్రారంభమైన పిమ్మట ఎవరుగాని కొత్తగా మార్కెటును స్థాపించరాదు. ప్రకటన సంవత్సరము పిమ్మట జరుపుచుండరాదు. అయితే ఈవిషయము గవర్నమెంటువారు ప్రకటించుటకు పూర్వము వుండబడిన ఏదయినా ప్రైవేటు మార్కెట్లు విషయములో ఆమార్కెటుకు ఖాబడు ఖర్చులు పోగా.నికరమును మతధర్మ కార్యములకు మాత్రమే వినియోగపరుచునెడల అట్టి ప్రైవేటు మార్కెట్లకు పైచెప్పబడినది. అడ్డులేదు.

(2) ఏదయినా మార్కెటు పైచెప్పిన మినహాయింపుకిందికి వచ్చునా ? లేదా ? అను ప్రశ్న రాబడినప్పుడు, పంచాయితీవారు గవర్నమెంటు సలహాను కోరవలెను. వారిసలహా ఖాయమై వుండవలెను.

(3) పై 1-వ సబుసెక్షన్ మేరకు మూసివేయబడిన ప్రయివేటు మార్కెటులకు బదులుగా పంచాయితీవారు పబ్లికుమార్కెటు ఏర్పరచవలెను.

82. సెక్షన్ — (1) ప్రైవేటు మార్కెటును వుంచుటకు పంచాయితీ వారివద్దనుండి లైసెన్సు పొందినవేతప్ప ఎవరుగాని 81 (1) లో చెప్పబడిన స్వభావముగల మార్కెటును వుంచకూడదు. అట్లు పొందిన లైసెన్సును ప్రతిసంవత్సరము రెన్యూలు పొందుచుండవలెను.

(2) A. ప్రైవేటు మార్కెటుకు లైసెన్సు కోరినయెడల, దానిమీద పైవిచారణ, పరిశుభ్రత నీటిసప్లయి, తూకములు, కొల్తలుతనిఖీ, అద్దెలురుసుములు రేట్లు వీటినిగురించి షరతులు నిర్ణయము అధికారముకు లోబడి పంచాయితీవారు లైసెన్సు యివ్వవలెను.

B. అట్టిషరతులు ఒకనిర్ణయ తేదినుండి అమలులోనికి రావలసినట్లు సవరించ వచ్చును.

C. పై A క్లాజు లైసెన్సుకు దానిషరతులు తప్పినందుకుగాను సస్పెండు, రద్దు చేయవచ్చును.

D. A. B. C. క్లాజులక్రింద పంచాయితీవారు చేసిన వుత్తరువులమీద నష్టపడు ఎవరుగాని ఇన్‌స్పెక్టరుకు అపీలు చేసుకొనవచ్చును. ఆయన న్యాయమని తలచినయెడల అపీలు తీర్మానమువరకు వుత్తరువు అమలు ఆపివుంచవచ్చును.

(3) A. 1884 లోకలుబోర్డు ఆక్టు అమలుకు వచ్చుటకు పూర్వము వుంచబడిన ప్రైవేటు మార్కెటు విషయములో రుసుములను విధించుటకు హక్కుకోరువారు దాని అంగీకారముకొరకు ఇన్స్పెక్టరుకు పిటిషన్ పెట్టుకోవచ్చును. పంచాయితీవారికి నోటీసుఇచ్చి వారి సమాధానము తీసుకున్నమీదట ఇన్స్పెక్టరు తగు వుత్తరువులు చేయవలెను.

B. పై క్లాజుననుసరించి సర్టిఫికేటు యిచ్చుటకు నిరాకరించు వుత్తరుమీద వుత్తరువు తేదినుండి 6 మాసములలోగా దానివల్ల నష్టపడినపార్టీ దావా దాఖలు చేయవచ్చును. అట్టి తీర్మానముకులోబడి ఇన్‌స్పెక్టరు వుత్తరువు ఖాయమైనదిగా వుండవలెను.

(4) పై 2-వ సబుసెక్షన్‌క్రింద యివ్వబడు లైసెన్సు వుచితముగాగూడా యివ్వబడ వలెను. లేదా అంతకుపూర్వపు సంవత్సరములో ఆమార్కెటుమీద దాని ఖామందుకు రాబడిన మొత్తము ఆదాయములో నూటికి రు 15 లకు మించకుండా రుసుము విధించబడవలెను.

(5) లైసెన్సులేనట్టి, లేదా రూల్సుకు విరుద్ధముగా వుంచబడినట్టి ఏదైనా ప్రైవేటు మార్కెటును పంచాయితీవారు, లేదా వారివల్ల అధికారముపొందిన వుద్యోగి, మూసివేయుటకు అధికారముగలదు.

83. సెక్షన్ — ఏదైనా ప్రదేశము మార్కెటు అగునా? లేదా? అనువిషయము వివాదము రాబడినప్పుడు, పంచాయతీవారు గవర్నమెంటుకు తెలుపవలెను. వారి తీర్పు కడపటిదిగా వుండవలెను.

84. సెక్షన్ — కార్యనిర్వహణ అధికారియొక్క లేదా లైసెన్సు పొందినవారియొక్క అనుమతిలేకుండా ఎట్టి మార్కెటుహోగాని ఎట్టి జంతువును ఏదైనా వస్తువును విక్రయించ కూడదు.

85. సెక్షన్ — పంచాయితీ అనుమతితో కార్యనిర్వాహణ అధికారి పబ్లికురోడ్డులో లేదా ప్రదేశములో ఏదైనా జంతువులను వస్తువులను విక్రియించ కూడదని నిషేదించుచు పబ్లికు ప్రకటన చేయవచ్చును.

86. సెక్షన్ — మార్కెటులను పబ్లికు, ప్రైవేటు, జిల్లా మార్కెటులుగా తరగతి వారిగా విభజించుటకునూ దానమీద విచారణ ఏర్పరచుటకు, దానినుండి రాబడిని జిల్లాబోర్డు పంచాయితీబోర్డు మధ్య పంపకము చేయుటకు గవర్నమెంటుకు అధికారముగలదు.

జిల్లా మార్కెటుగా విభజించబడిన విషయములో పంచాయితీవారుగాని దాని కార్య నిర్వాహణ అధికారిగాని పై 80 మొదలు 85 సెక్షనులు అధికారము చలాయించరాదు.

## —: జనసామాన్యము నిలుచుప్రదేశములు :—

87. సెక్షన్ — A. రూల్సుకులోబడి పంచాయితీవారు, జనసామాన్యము దిగునట్టి, నిలుచునట్టి, బండ్ల స్థానములను ఏర్పాటు చేయవచ్చును. వాటి పుపయోగముమీద రుసుముల విధించవచ్చును.

B. అట్టివి ఏర్పాటు చేయబడి యుండినప్పుడు, అదేపనినిమిత్తము, పంచాయితీ వారు రూల్సుమేరకు నిర్ణయించు దూరములోగా మరియొక స్థలమును యీకార్యము కొరకు వాడుకొనకుండా నిషేధించవచ్చును.

88. సెక్షన్ — (1) ఎవరుగాని కొత్తగా బండ్లునిలుచునట్టి (ప్రైవేటు) స్థానములను పంచాయితీ పర్మిషన్‌లేకుండా ఏర్పరచరాదు. అందుకు లైసెన్సు పొందినయెడల దానిని ప్రతి సంవత్సరము రెన్యూలు పొందుచుండవలెను.

(2) యిదివరకే ప్రైవేటు బండ్ల స్థానము ఏర్పరచబడి యున్నయెడల దాని ఆరోగ్యము, నీటివసతి యివన్నియు గమనించి పంచాయితీవారు ఇన్‌స్పెక్టరు అంగీకారముకు లోబడి లైసెన్సు ఏదైనా తగిన షరతులమీద యివ్వవలెను. కొత్తగా ఏర్పాటు చేయగోరిన సందర్భములో పంచాయితీవారు ఇవ్వవచ్చును. లేదా నిరాకరించవచ్చును.

(3) అట్లు యివ్వబడు లైసెన్సును ఒక నిర్ణయ తేదినుండి నిర్ణయ షరతులకు లోబడి యివ్వవచ్చును.

(4) అట్లుయివ్వబడిన లైసెన్సు షరతులు తప్పిన యెడల పంచాయితీవారు లైసెన్సును సస్పెండు, రద్దుచేయుటకు అధికారముగలదు.

(5) యిట్లు లైసెన్సును యిచ్చుటకు ఒక్కొకసారికి రు 20 లకు జాస్తిలేకుండా రుసుమును విధించవచ్చును.

## —: ప శు వ ధ శా ల లు :—

89. సెక్షన్ — పబ్లికు పశువధశాలలకు స్థలములను ఏర్పరచి వాటిని వాడుకున్నందుకు అద్దెలు, రుసుములు, నిర్ణయించవచ్చును.

90. సెక్షన్ — A. పశువధశాలలు గాకుండా యితర స్థలములలో, వీధులలో, వాటిని వధ జేయుట, తోలును ఘాడదీయుట నిషేధించుటకు, క్రమపరచుటకు,

B. ప్రజకు విక్రయముకుగాను జంతువులను వీధులలోవధించుటకు, వానిని విక్ర యించుటకు,

C. పశువధశాలలు. వాటిలోని మాంసము, తనిఖీ చేయుటయు, అట్టి తనిఖీ అధికారు లకు చెల్లించవలసిన రుసుములు నిర్ణయించుటయు వీటిని గురించి పంచాయితీవారు రూల్సును చేయవచ్చును.

## —:పరిశ్రమలు—ఫ్యాక్టరీలు:—

91. సెక్షన్— కార్యనిర్వహణ అధికారివల్ల లైసెన్సు పొందకుండా పబ్లికుకుఅసహ్యా కరముగా, ప్రాణముకు, ఆరోగ్యముకు ఆస్తికి అపాయముగా వుండునని గవర్నమెంటువారు అభిప్రాయపడు యీ అక్టు రూల్సులో వివరించబడు కార్యములను గ్రామముయొక్క సరి హద్దులలో ఏదిగాని జరుగకూడదని పంచాయితీవారు ప్రకటించవచ్చును. అయితే అట్టి ప్రక టనచేసిన 60 రోజులకు పిమ్మట దానిని అములులో వుంచవలెను.

92. సెక్షన్ — A ఎవరుగాని ఆవిరి, నీటిశక్తి, యితర యంత్రసంబంధమైనశక్తి, విద్యుశ్చక్తితో, ఏఫ్యాక్టరీగాని వర్కుషాపుగాని,

B. రూల్సులో మినహాయింపుకాబడిన పైశక్తిచే నడుపబడు ఏయంత్రమునుగాని తయారుచేయు ప్లాంటునుగాని ఏఆవరణములోగాని, పంచాయితీవారి పర్మిషన్ లేకుండా వుంచరాదు నిర్మించరాదు.

సెక్షన్ — (1) 91 సెక్షన్ క్రింద లైసెన్సులు యిచ్చుట దానికాలము రెన్యూలు చేయుట దానికాలమును గురించిన్ని, 92 సెక్షన్ క్రింద లైసెన్సునుకు అంగీకారముయిచ్చుట నిషేధించుటను గురించిన్ని రూల్సును చేయవచ్చును.

(2) 92 సెక్షన్ లైసెన్సులను గురించిన రూల్సునుచేయుటలో పరిశ్రమలకు నిర్దే శించిన ప్రదేశములు ప్రత్యేకించుట. అట్టి ప్రదేశములకు వెలుపల లైసెన్సులు యిచ్చుటకు నిరాకరించుట, యింతకుపూర్వమే ఏర్పడియుండు ఏఫ్యాక్టరీగాని యంత్రమునుగాని నిర్దేశ ప్రదేశములకు మార్చుటను గురించిన్ని ఏర్పాటుచేయుటకు గవర్నమెంటువారు పంచాయితీకి అధికారము యివ్వవచ్చును.

అయితే గవర్నమెంటుతరపు ఫలసాయమార్కెటు ననుసరించి స్థాపించబడిన మార్కెటు కమిటీ విచారణలోనుండు వాటిని తొలగించుటకు వుత్తరువు చేయకూడదు.

(3) పై 91—92 సెక్షన్లలో చెప్పబడిన ఏచర్యనుగాని పంచాయితీవారు తప్పిపోయిన యెడల గవర్నమెంటువారు తమకు యుక్తమనితోచిన వుత్తరువులు చేయవచ్చును.

## ప్రజలు విహారస్థలముల ఏర్పాట్లు

94 సెక్షన్ — యీఅక్టును గవర్నమెంటువారు ఏగ్రామముకుగాని అములులోవుంచి నప్పుడు-

A. సినిమాలులేకుండా, యితర కార్యముల నిమిత్తము వుపయోగింపవలసిన స్థలమున్ను, కట్టడము, విషయములో యీ అక్టుక్రింద లైసెన్సు యిచ్చుటకుగాను, కార్యనిర్వా హణ వుద్యోగిగా వుండవలెను.

B. కార్యనిర్వాహణ వుద్యోగి చేసినతీర్మానము మీద పంచాయితీకి అపీలుచేసుకో వచ్చును.

## 6. అధ్యాయము కట్టడములకు నెంబర్లువేయుట.

95 సెక్షన్ -- (1) యీ అక్టు అముఖులో వుంచబడు ప్రదేశములో యుండువు నిర్ణయించబడిన అధికారి ప్రతికట్టడముయొక్క వెలుపలితలుపుకు లేదా ప్రక్కలో లేదా ఆవరణముకు పోవు ప్రదేశ మొదటిభాగములో నెంబరువేయవలెను.

(2) ఎవరుగాని అట్టినెంబర్లను. పయోజన ఎన్నికలో వేయబడిన నెంబర్లను కుతువ కూడదు. తీసి వేయకూడదు.

(3) ఆప్రదేశము యొపమాని అట్టిఅంకెలను చెడకుండా వుంచుకొనన్నూ చెడిగాని తొలగిగాని పోయినయెడల మరల ఆ అంకెలను వేయుటకున్నూ బద్ధుడైవున్నాడు.

అట్లుచేయుటకు తప్పినయెడల, అధికారి అతడు ఆ నెంబర్లను తిరుగా వుంచవలసినట్లు వుత్తరువు చేయవచ్చును.

### :- లైసెన్సులు-అంగీకారము :-

96. సెక్షన్ - (1) యీ అక్టును రూల్సును అనుసరించి ఏదైనా లైసెన్సును దానిని రెన్యూలుకు దరఖాస్తులు రూల్సులో నిర్ణయము కాబడిన కాలములో దరఖాస్తులోని సంవత్సరకాలము ప్రారంభముకు 30 రోజులకు ముందుగానుండా 90 రోజులకు జాస్తికాకుండానూ పెట్టుకోవలెను.

అట్టిలైసెన్సులకు పర్మిట్లకు, ఒక నిర్ణయ యూనిటు, రేటు, ప్రకారము రుసుములు విధించబడవలెను,

(3) పైన చెప్పబడినట్లుతప్ప, ఏదైనా లైసెన్సుకు, పర్మిటుకు దరఖాస్తు కార్యనిర్వహణ అదికారికి అందిన పిమ్మట 30 రోజులలోగా దరఖాస్తుదారుకు అవిషయమై ఏదయినా తెలియజేయబడనియెడల ఆదరఖాస్తు యీ అక్టుకు రూల్సుకు లోబడి అది అంగీకరించినట్లే భావించబడవలెను.

(4) ఏదయినా లైసెన్సుకు పర్మిటుకు రుసుము చెల్లింపును ముందుగానే అంగీకరించినయెడల, అట్లు ముందు చెల్లించినది ఒక హక్కుగా అంగీకరించబడదు. అయితే అది నిరాకరించబడిన సందర్భములో ఆరుసుమును వాపసు చేయవలెను.

(5) అట్టి పర్మిటుగాని లైసెన్సుగాని ఏకార్యముకు అవసరమో, ఆకార్యమును పర్మిటుగాని లైసెన్సుగాని పొందకుండా చేసినయెడల లేదా షరతులను భంగముగా చేసిన యెడల.

(a) కార్యనిర్వహణ అదికారినోటీసుద్వారా ఆకార్యము చేసినవారిని, అదిచేయకుండా మొదట ఏరీతిగా నుండునో ఆదేరీతిగా వుండవలసినట్లు నోటీసుద్వారా కోరుటకు అదికారము గలదు.

b అట్లు కార్యము చేసినందుకు యీ ఆక్టులో ప్రత్యేకముగా పెనాల్టీగాని ఏర్పరచని యెడల, అట్టి ప్రతినేరముకున్ను రు 50 లుకు మించని జుల్మానాతో శిక్షింపబడ తగియుండును.

(c) అట్టి అనుమతిగాని లైసెన్సుగాని పొందుటకు తప్పిపోయినందుకు ఎవరి మీదగాని నేరస్థాపన చేయబడినప్పుడు రూల్సుమేరకు మేజిస్ట్రేటు విధించు జుల్మానా మాత్రమే గాకుండా సదరు లైసెన్సుకు లేదా పర్మిటుకు చెల్లించవలసిన రుసుము కూడా పంచాయితీకి చెల్లించవలసినట్లు తీర్పుచేయవలెను. మరిన్ని క్రిమినల్‌ప్రొసీజరుకింద వారివల్ల వసూలు చేసి పంచాయితీకి యిప్పించవచ్చును. యిట్లు వసూలుచేసిన మొత్తమువల్ల వానికి లైసెన్సు పొందినట్లు హక్కుగా ఎంచబడదు.

97. సెక్షన్ — యీ ఆక్టులోగాని రూలులోగాని వుండునది ఏమియు, గవర్నమెంటు వారికి చెందిన 1933 కమర్షియల్ క్రాప్సు కమిటీవారికి స్వాధీనములో యుండు ఆస్తివిషయములో ఏ లైసెన్సుగాని పర్మిటుగాని వుండవలసినట్లు భావించరాదు.

## —: నోటీసులు వుత్తరువులు అమలు అధికారము :—

98. సెక్షన్ — (1) యీ ఆక్టు లేదా దీని రూల్సుకింద జారీచేయవలసిన నోటీసు, రిక్వజిషన్ లేదా వుత్తరువుద్వారా ఎవరినిగాని ఒక కార్యమును చేయుటకు లేదా చేయకుండా వుండుటకు ఒక కాలము నిర్ణయించి ఆనోటీసులో తెలుపుచూ జారీచేయవలెను.

(2) అట్లు తెలుపబడిన కాలములోగా ఆవుత్తరువు మేరకు వారు జరుపనియెడల.

(a) కార్యనిర్వహణ అధికారి ఆ పన్నును చేయునట్లు ఏర్పాటుచేయవచ్చును. లేదా నోటీసులో కోరిన చర్యను తామేజరిపించవచ్చును.

A. అట్లుచేయుటకు తప్పిపోయిన చర్యకు యీ ఆక్టులో ప్రత్యేకముగా శిక్ష నిర్ణయము లేనియెడల అట్టివారు రు 50 లు. జుల్మానాశిక్షకు పాత్రులగుదురు.

## —: ప్రవేశముకు, తనిఖీకి అధికారము :—

99. సెక్షన్ — (1) నిర్ణయషరతులకు లోబడి కార్యనిర్వహణ అధికారిగాని ఆయనవల్ల అధికారముపొందిన వాడుగాని, తగునోటీసు యిచ్చిగాని యివ్వకుండగాని తన పనివారు లేదా అసిస్టెంట్లుతోగాని లేదా లేకుండగాని వచ్చి.

A. యీ ఆక్టుమేరకు రూల్సుమేరకు, వుత్తరువుమేరకు సదరు నోటీసుమేరకు అమలు జరుగని విషయమును గురించి చర్య పుచ్చుకొనుటకు.

B. ఆనోటీసుకు సంబంధించిన కార్యపు ప్రదేశములో ప్రవేశించుటకు. అధికారము గలదు.

(2) పై విధముగా బలవంతముగా ప్రవేశించినందుకు చర్యజరిపి నందుకుగాను ఏ అధికారిమీదగాని ఏనష్టముకుగాని చర్య తీసుకొనుటకు హక్కులేదు.

100. సెక్షన్ — కార్యనిర్వహణ అధికారి లేదా ఆయనవల్ల అధికారము పొందిన

నాడు గాని గ్రామములోని మార్కెటులు, అంగళ్ళలో వుపయోగింపబడు తూనికెరాళ్ళ, కొలత పాత్రలు లనికీ చేయవచ్చును.

101. సెక్షను — (1) కార్యనిర్వహణ అధికారి వ్రాత వుత్తరువుద్వారా తన హద్దుల లోని ఏగ్రామ అధికారిని కరణమును, లేదా హారిద్దరిని అట్టి గ్రామాలలోని ఎవరియొక్కగాని వెల్లలను ఆస్తిని సమాచారములను తెలుపవలెనని కోరుటకు అధికారము గలదు.

(2) అట్లు కోరుటలో ఆకార్యము చేయుటకు ఒకకాలము నిర్ణయించవలెను. అట్టి కాలమును అయన తిరుగా పొడిగించవచ్చును.

—: కా ల దో ష ము లు :—

102. సెక్షన్ — యీ ఆక్టునున్ను రూల్సునున్ను అనుసరించి, పంచాయితీకి బాకీగా రావలసియుండు ఏపన్ను లేదా యితరమొత్తములు, అదిజప్తు చేసియుండవలసిన, లేదా దావా చేసియుండవలసిన, తేదినుండి 3 సంవత్సరములు కాలముగడచిన ఏమ్మట అట్టిచర్య ఏదిగాని చేయుటకు కాలదోష మగును.

—: కంప్లయింట్లు, చర్యలు, దావాలు. :—

103. సెక్షను — యీ ఆక్టుకుగాని రూల్సుకుగాని విరుద్ధముగా చేయబడిన ఏచర్యకు గాని, నేరముకుగాని కార్యనిర్వహణ అధికారి లేదా పంచాయితీవారు, లేదా వారివల్ల అధి కారము పొందినవారు నేరముతేది మొదలు 3 మాసములు లోగా కంప్లయింటు చేసిననేతప్ప పోలీసువారు ఆవల విచారణ చేయకూడదు, అయితే కొందరు మేజిస్ట్రీటులకు తమకు స్వంత ముగా విచారించుటకుగల అధికారమును యీ సెక్షను బాధించనేరదు. అయితే యీ ఆక్టు కిృంద లైసెన్సు పర్మిషన్ ఈ లాంటివి తీసుకొనవలసినవి తీసుకొనకుండా చర్యలు జరు పుటలో అట్టిచర్యలను గురించి ఎడతెగకుండా జరిగినట్టి నేరమును ఎప్పుడైననూ ప్రారం భించ వచ్చును. కాల నిర్ణయములేని పనివిషయములో సంవత్సరము కాలముగా భావించ వలెను.

104. సెక్షను — ఈఆక్టుకు రూల్సుకు లోబడి దాని మేరకు రాజీ చేసుకొనుటకు అధి కారము గలిగి ఏనేరముకుగాని కార్యనిర్వహణ అధికారి రాజీ చేసుకోవచ్చు.

105. సెక్షను — కార్యనిర్వహణ అధికారి దాఖలుచేసిన ప్రతి కంప్లయింటున్ను, చర్చయున్ను, లేదా చేసుకొనబడిన రాజీలున్ను ఆ మరుసటి పంచాయితీ మీటింగులో రిపోర్టు చేయుచుండవలెను.

106 సెక్షను — ప్రెసిడెంటు కార్యనిర్వహణ అధికారి లేదా ఏమెంబరు, తనవుద్యోగ డ్యూటీని నెరవేర్చుటలో వ్యవహరించినందుకు ఎట్టినేరముగాని ఆయనమీద మోపబడినప్పుడు ముందుగా గవర్నమెంటువారి పర్మిషన్ వుండిననేగాని ఏకోర్టువారుగాని దానిని విచారించ కూడదు.

107. సెక్షన్ — (1) ఈ క్రింది 108 సెక్షనుకులోబడి, ఈ ఆక్టుక్రిందగాని రూల్సు కిృందగాని ఏదయినా పనిని వుత్తరువును అములును జరుపుటలో వుపేక్ష, తప్పిపోవడముకు

గాను పంచాయితీమీద చర్యతీసుకొనుటకు గల కారణములు, కోరబడు ప్రతిఫలమును, వాదిగానుండు వారి పేరును వారి అడ్రసుయునూ తెలియగల వ్రాతమూలమైన నోటీసు పంచాయితీకి జారీచేయబడిన పిమ్మట, మరిన్ని నదరుచర్యలు పంచాయితీ ప్రెసిడెంటు, కార్యనిర్వహణఅధికారి, మెంబరు, వుద్యోగి, నౌకరుమీదచేయుటకు ఏర్పడినప్పుడు ఆయనకు స్వంతముకు కూడా జారీచేసినపిమ్మట రెండునెలలు గడుచునంతవరకు, ఏ పంచాయితీ మీదగాని దానియొక్క పై చెప్పిన ఎవరిమీదగాని లేదా వారివుత్తరువుమేరకు జరిపిన యితరులమీదగాని ఏ దావా లేదా చర్య జరుపరాదు, మరిన్ని అట్టినోటీసు యివ్వబడినట్లు కోర్టువారికి రుజువుకాని యెడల దావాను తోసివేయవలెను.

(2) అట్టి వ్యవహారము స్థిరాస్తికి గురించిన దయినచో తప్ప, ఆచర్యజరిగిన కారణము జరిగిన 6 మాసములులోగా లేదా, ఆచర్య వరుసగా జరుగున దయినయెడల అదిజరుగు కాలములోగాని లేదా అదిజరుగుట ఆగిన 6 మాసములులోగా గాని చేయబడవలెను.

(3) పై విధముగా నోటీసు అందుచున్న పంచాయితీగాని మరి ఎవరుగాని వ్యవహార ప్రారంభముకు ముందే నష్టపరిహారమును యివ్వజూపినయెడల ఆవిషయము తెలిపిన పిమ్మట గూడా వ్యవహారము జరిపినయెడల ఆయన యివ్వజూపిన నష్టపరిహారము కంటే జాస్తీగా కోర్టులో యివ్వని సందర్భములో అట్టి వ్యవహారఖర్చులకు దాని ప్రతివాదులు జవాబుదారిగా చేయకూడదు. మరిన్ని అట్టి సందర్భములో ప్రతివాదికి కాబడినఖర్చులు గూడా వాదియే భరించవలెను.

108. సెక్షన్ — ఈ ఆక్టుననుసరించి చేయబడిన లేదా చేసినట్లు వుద్దేశించబడిన ఏచర్యగాని వుపేక్షగాని సదుద్దేశముతో చేయబడినయెడల, అందుకొరకు పై 107-వ సెక్షన్‌లో చెప్పబడిన ఎట్టివారిమీదగాని ఏ దావా లేదా చర్య జరుపకూడదు. కాని అట్టి చర్యగాని వున్న యెడల ఈక్రింది 110 సెక్షన్‌ప్రకారము పంచాయితీమీద జరుపవలెను.

109. సెక్షన్ — సివిల్ ప్రొసీజరు లేదా యితరచట్టములో ఎట్లున్ననూ, పంచాయితీ ఎన్నికపట్టీలు తయారుచేయుట ప్రకటించుట ఎన్నికజరుపుట, చర్యలను నిలుపుదలచేయు వుత్తరువులు ఏకోర్టుగాని చేయకూడదు. ఇంటరం వుత్తరువులుకూడా చేయకూడదు.

110. సెక్షన్ — పంచాయితీసొమ్ము యితరఆస్తి ప్రెసిడెంటు, కార్యనిర్వహణ అధికారి, మెంబరు, యొక్క అజాగ్రత దుర్వినియోగము దుర్నడతవల్ల నష్టముకాబడినట్లు ఏర్పడిన యెడల, అట్టినష్టముకు అట్టి కారకులు జవాబుదారీగా వుండవలెను. ఇన్‌స్పెక్టరుయొక్క అనుమతి ముందుగాపొంది పంచాయితీవారు తగినకోర్టులో దావా దాఖలు చేయవచ్చును.

(2) అట్టిదావా వ్యాజ్య కారణముకలిగిన 3 సంవత్సరములులోగా దాఖలు చేయవలెను.

111. సెక్షన్ — (1) ఈ ఆక్టుక్రింద పన్నువిధింపు, డిమాండురసుము విధింపు విషయములో, ఏదయినా పేరు అడ్రసు వ్యాపారవృత్తి స్థలము, ఆస్తిని వస్తువును వివరించుటను, డిమాండుచేయుట, ఈ లాంటివనులలో ఏదయినా వ్రాత పొరబాట్లు వున్నదను కారణమున ఆక్షేపణ చేయకూడదు. అట్టిపొరబాటు వాటి అమలును బాధించకూడదు. రూల్సుకు

విరుద్ధముగా వుంఖచర్యలుతప్ప యితర లోపములుమీద మాత్రమే కోర్టువారు దానిని కొట్టి వేయరాదు.

(2) ఈ ఆక్టు అధికారముక్రింద వసూలుచేయబడిన మొత్తములను, చెల్లింపులను, గురించి కలుగు నష్టపరిహారముకు ఏ కోర్టులోగాని ఏదావాగాని తేబడకూడదు. అయితే ఆక్టుకు రూల్సుకు విరుద్ధముగా జరిగివుండిన సందర్భములో పై అడ్డులేదు.

(3) ఈ ఆక్టు, రూల్సు, రిగులేషన్సు, యొక్క నిబంధనల ప్రకారము జరిపిన జప్తు, విక్రయము, బిల్లు, నోటీసుషెడ్యూలు నమునా సమన్సు డిమాండు నోటీసు జప్తు వారంటు వస్తువులపట్టి, తయారుచేయుటలో గాని యితర చర్యలోగాని ఏదయినా పొరపాటు క్రమలోపము, జరిగిన దను కారణమువల్ల మాత్రమే అవిచెల్లకుండాపోకూడదు. అట్టిపొరపాటు చేసినవారు హద్దుమీరి నడచినట్లు తలచబడకూడదు. అయితే ఏదయినా అక్రమము అన్యాయము, గలిగిన ఎవరుగాని ప్రతిఫలము పరిహారము పొందుటకు పైచెప్పినది అడ్డులేదు.

112. సెక్షన్ — గవర్నమెంటువారు ఈఆక్టును అమలు జరుపుటకు పనులు నెరవేర్చుటకు అవసరమగు రూల్సును చేయుటకు అధికారముగలరు.

113. సెక్షన్ — (1) ఈ ఆక్టుక్రింద చేయబడు రూల్సును అతిక్రమించిన వారికి నేరస్థాపన అయినయెడల రు 100 లు. వరకు జుల్మానాశిక్ష, నేరమును వరుసగా చేయుచునే యుండిన సందర్భములో అట్లు జరుగుచుండు ప్రతిరోజుకు రు 15 లు కు జాస్తిలేని జుల్మానా శిక్షకు పాత్రులగునట్లు గవర్నమెంటువారు రూల్సును చేయవచ్చును.

(2) ఈ ఆక్టుననుసరించి రూల్సును చేయుటలో ముందుగా ప్రకటనచేసి అమలు జరుపునట్లు వుత్తరువు చేయవలెను.

(3) అట్టిరూల్సు నంతయు గజటులో ప్రకటించబడి అమలు పరచబడవలెను.

114. సెక్షన్ — (1) ఈఆక్టు, రూల్సుకు, లోబడి పంచాయితీవారు, ఇన్స్పెక్టరు అంగీకారముతో తమపనులు చేయుటకు అదనపురూల్సు చేయవచ్చును.

(2) అట్లు పంచాయితీవారు చేసిన అదనరూల్సును అతిక్రమించిన ఎవరుగాని రు 15 లు కు మించని పంచాయితీవారు నిర్ణయించిన మొత్తమును అపరాధముగానూ, నేరము యింకనూ జరుగుచునేవుండు నెడల రోజుకు 5 రుపాయిలుకు జాస్తిలేని జుల్మానానూ చెల్లించవలసినట్లు రూల్సు చేయవచ్చును.

(3) పైచెప్పినట్లు పంచాయితీవారు అదనపురూల్సు చేయుటకు దానిని అమలులో వుంచు తేదినిగురించి విధులను గవర్నమెంటువారు చేయవచ్చును.

115. సెక్షన్— (1) ఈఆక్టు 1వ షెడ్యూలులో కనుపరచిన నిబంధనలు ఆవిధులననుసరించి చేయబడిన వుత్తరువులు నిరాకరించుసదరువిద్ధుల నిబంధనలుక్రిందచేయబడిన వుత్తరువు మేరకు జరుపవలసినది జరుపుటకు తప్పిపోవువారు, సదరుషెడ్యూలులో చెప్పబడిన జుల్మానా శిక్షకు పాత్రులుగా నుండవలెను.

(2) 2-వ షెడ్యూలులో చెప్పబడిన దానిని దానిక్రింద చేయబడిన రూల్సును వుత్తరువు

లను ఆరూల్సుప్రకారం చేయవలసిన పనులను తప్పిపోవు ఎవరుగాని, అట్టినేరము వరుసగాజరు పుచునేవుండు ఎవరుగాని ఆషెడ్యూలులో చెప్పబడిన శిక్షకు పాత్రులగుదురు.

116. సెక్షన్—(1) ఈ ఆక్టులనుసరించి దానిరూల్సు ననుసరించి పంచాయితీ మెంబరుగా వుండుటకు హక్కులేదనిగాని హక్కు పోయినదనిగాని తెలిసియుండియు దానిని వ్యవహరించినయెడల అట్టివారు రు 200 లు వరకు జుల్మానాశిక్షకు పాత్రులగుదురు.

(2) ఈ ఆక్టుయొక్క యిందలి రూల్సుకింద పంచాయితీప్రెసిడెంటు, ఆకింగు ప్రెసిడెంటు -వైసుప్రెసిడెంటు వుద్యోగమును కలిగివుండుటకు పనులను చెలాయించుటకు తనకు హక్కులేదని తెలిసిన్ని వ్యవహరించునట్టి ఎవరుగాని వెయ్యి రూపాయలు వరకు జుల్మానా శిక్షకు పాత్రులగుదురు.

(3) ప్రెసిడెంటు వైసిడెంటు ఆక్టింగు ప్రెసిడెంటుగా వుండి తనస్వాధీనములో వుంచుకొనివుండినపంచాయితీతాలూకు డాక్యుమెంట్లను, లెఖ్ఖను, యితరఆస్తిని తనతర్వాతవుద్యోగములోకి రాబడినవారికి, ఒప్పగించుటకు అనగా, ప్రెసిడెంటు తనకాలపరిమితి అంత్యము కాగానే, వైసుప్రెసిడెంటు ప్రెసిడెంటు కోరినవారు తప్పిపోయినవారు వెయ్యి రూపాయలు వరకు జుల్మానాకు పాత్రులగుదురు.

117. సెక్షన్— పంచాయితీయొక్క వుద్యోగి నవుకరి, పంచాయితీవల్ల, లేదా దానితరవునచేసికొన్న కాంట్రాక్టుతో, పనిలో స్వంతముకు ఏదయినా వాటాను, హక్కును ప్రత్యక్షముగాగాని పరోక్షముగాగాని బుద్ధిపూర్వకముగా పొందినయెడల అట్టివారు ఇం॥ పి॥ కో॥ 168 సెక్షనుకింద నేరస్తుడుగా తీర్మానించ బడవలెను. అయితె ఏదయినా కంపెని సందర్భములో డైరెక్టరుగా వున్నయెడలతప్ప, షేరు హోల్డరుకు పంచాయితీకి చేసుకొను ఖరారులు ఈసెక్షను అడ్డులేదు.

118. సెక్షను— కార్యనిర్వహణ అధికారిని, లేదా ఆయనవల్ల ఏదైనా పనికొరకు నియమించబడువారిని ఏ దైనా స్థలములో కట్టడము, భూమిలో ప్రవేశించి యీఆక్టు పనులు జరుపుటకు అటంకము కలుగజేసినవారు ఇం॥ పి॥ కో. 341 సెక్షనుకింద నేరస్తుడుగా తీర్మానించ బడును.

119. సెక్షను — పంచాయితీని, దాని ప్రెసిడెంటును, కార్యనిర్వహణ అధికారినిమెంబరునుగాని యీ ఆక్టు, రూల్సు వుత్తరువుకింద వారుజరుపు ఏచర్యగాని నెరవేర్చునప్పుడు ఆటంకపరుచు లేదా బాధించు ఎవరుగాని రు 500లు వరకు జుల్మానా శిక్షకుపాత్రులగుదురు.

120. సెక్షను — పంచాయితీవల్ల దాని కార్యనిర్వహణ అధికారివల్ల లేదా వారివుత్తరువుల ననుసరించి మరి ఎవరివల్లగాని ప్రదర్శింపబడు నోటీసును, వేయబడిన ఏదయినాగుర్తును ఎవరుగాని అధికారము లేకుండా తుడిచివేసిన లేదా కనుబడకుండాచేసి ఎవరుగాని రు500లు వరకు జుల్మానా శిక్షకు పాత్రులయ్యెదరు.

121. సెక్షన్ — యీ ఆక్టు, రూల్సు, నోటీసుకింద ఎవరికైనా ఏదయినా సమాచారము కోరబడి దానిని తెలుపుటకు తప్పిపోవు లేదా బుద్ధిపూర్వకముగా అబద్దపు సమాచారము తెలుపు ఎవరుగాని రు 100 కు వరకు జుల్మానా శిక్షకు పాత్రులగుదురు.

## —: 8 వ అధ్యాయము—అదన నిబంధనలు :—

122. సెక్షన్ – (1) మొట్ట మొదటిసారిగా పంచాయితి ఏర్పాటుచేయబడు పంచాయితీలకు యీ కింది హంశములు వర్తింపవలెను.

(2) పంచాయితీ నిర్మాణముకు ఇన్‌స్పెక్టరు జారీచేసిన వుత్తరువులో నిర్ణయమైన తేదిలో క్రొత్త మెంబర్లను ప్రెసిడెంటునూ ఎన్నుకొనుటకు గాను ఎన్నిక అధికారి ఏర్పాట్లను చేయవలెను. అయితే ఏకారణమువల్లగాని ఎన్నికలు పూర్తిచేయుటకు సాధ్యముకాని యెడల అట్టినిర్ణయతేదిని వాయిదాలు వేయుటకు ఇన్‌స్పెక్టరుకు అధికారము గలదు.

(3) పై సబుసెక్షను ననుసరించి ఎన్నుకొనబడిన మెంబర్లయొక్కయు ప్రెసిడెంటు యొక్కయు లేదా ఆకస్మిక ఖాళీల వంచర్భములో వారి స్థానములో ఎన్నుకొనబడిన మెంబర్ల యొక్కయు వుద్యోగకాలము ఇన్‌స్పెక్టరు నిర్ణయించిన సంవత్సరములో నిర్ణయతేదిని అంత్యము కావలెను. అట్టినిర్ణయ సంవత్సరము అదేజిల్లాలో ఏదైనా పంచాయితీకి మరు సటి సామాన్యఎన్నికలు జరుపవలసిన సంవత్సరముగా గాని, అట్టి ఎన్నికలకు వెంబడి తర్వాతి సాధారణ ఎన్నికలు జరుగవలసిన సంవత్సరముగా గాని వుండవలెను. అట్టినిర్ణయ తేది డిశంబరు 31 లోపుగా వుండవలెను.

123 సెక్షన్ – పంచాయితీ స్వాధీనములోయుండు, దానిచే పోషింపబడు అన్నిరోడ్లు, మార్కెట్టులు, బావులు, చెరువులు, రిజర్వాయర్లు నీటి ప్రవాహములు, జాతి మతంతో నిమి త్తము లేకుండా అందరునూ వుపయోగించుటకు, అనుభవించుటను వీలుగా వుండవలెను.

124 సెక్షన్ – యీఆక్టు, రూల్సు, అదనరూల్సు ననుసరించి పంచాయితీకి రావల సిన అన్నిరుసుములు వసూలును పంచాయితీకి యుక్తమనితలచు షరతులమీద మూడు సంవ త్సరములకు మించకుండా కవులుకు యిచ్చుటకు పంచాయితీకి అధికారముగలదు.

125 సెక్షన్ – (1) ఇన్‌స్పెక్టరు పంచాయితీ కోరినమీదటగాని, యితర విధముగా గాని ప్రకటనద్వారా పంచాయితి గ్రామముకు లేదా అందలిభాగముకు మునిసిపల్ ఆక్టుయొక్క ఏభాగమైననూ దానికి అన్వయించులాగు అమలులో వుంచులాగు ప్రకటించవచ్చును.

(2) అట్టి ప్రకటననిబంధనలు ఆప్రదేశముకు దానికి సంబంధించిన కార్యములకు ముఖ్యహంశములకు బాధలేకుండా మార్పులతో అమలును అర్థముచేసుకో వలెను.

(3) పై చెప్పిన నిబంధనలకు భంగములేకుండా మునిసిపల్ కౌన్సిలు చెయిర్‌మేను కార్యనిర్వహణ అధికారి వీరలకుఅన్వయించు సూచనలన్నియు పంచాయితీకి, ప్రెసిడెంటుకు కార్యనిర్వహణ అధికారికిచేయబడిన సూచనలుగానూ నౌకర్లకు అదేసూచనగానూ హద్దుల కునూ అదేసూచనగానూ అర్థముచేసి నడుపుకోవలెను.

126. సెక్షన్ – గవర్నమెంటువారు ప్రకటనద్వారా దానిలో నిర్బంధింపబడిన షర తులు విచారణ అధికారములకు లోబడి, ఏపంచాయితీ, లేదా పంచాయితీ తరగతికి సంక్ర మింప జేయబడిన ఏపనినిగాని డిస్ట్రిక్టుబోర్డుకు ట్రాన్స్ఫరు చేయబడి వారివల్ల నడుపబడ వలెనని వుత్తరువు చేయవచ్చును.

127. సెక్షన్ — (1) గవర్నమెంటువారు పత్రికటనద్వారా ఏస్థానిక ప్రదేశములకుగాని పంచాయితీ ప్రదేశములకుగాని (రూల్సుచేయుటకు గల అధికారముతప్ప) మిగత యీఆక్టు కింద వానికిగల అధికారములను గాని చలాయించుటకు అధికారిని నియమించి అధికారము యివ్వవచ్చును. అట్టి అధికారమును తీసివేయవచ్చును.

(2) ఇన్‌స్పెక్టరుగాని కలెక్టరుగాని ప్రకటనద్వారా ఏస్థానిక ప్రదేశములోగాని పంచాయితీలోగాని తమకు సంక్రమించియుంచు అధికారమును చలాయించుటకు ఎట్టి వుద్యోగినైననూ నియమించి అధికారమును ఒప్పగించవచ్చును. మరిన్ని దానిని తీసివేయవచ్చును.

(3) పై 1—2 సబుసెక్షన్ల ననుసరించి ఒప్పగించబడిన అధికారమువారు చలాయించుటలో వారిచర్యలు అధికారము యివ్వబడువారి రివిజన్ అధికారముకులోబడి యుండవలెను. అట్టిఅధికారము పొందినవారిచర్యలు వినుర్కచేయుటకు గవర్నమెంటుకు కూడా అధికారము కలిగి వుండవలెను.

(4) యీఆక్టు రూల్సువల్ల ఇన్‌స్పెక్టరుకు లేదా కలెక్టరుకు యివ్వబడిన ఎట్టిఅధికారమునైననూ వారివల్ల నియమించబడిన వుద్యోగి చలాయించుట రూల్సుకులోబడి యుండవలెను. అందుమీద పైవిచారణ అధికారము గవర్నమెంటువారికి వుండవలెను.

128. సెక్షన్ — (1) గవర్నమెంటువారు తమ యిష్టముమేరకు ఎప్పుడుగాని తమంతట తామేగాని, ఎవరిదరఖాస్తు మీదగాని.

A. ఇన్‌స్పెక్టరువల్ల, కలెక్టరువల్ల, లేదా వారు సెక్షన్‌ప్రకారము అధికారము ఒప్పగించిన యితరులవల్ల-

B. గవర్నమెంటువారివల్ల అధికారము యివ్వబడిన ఏఅధికారివల్ల లేదా వారికింద అధికారము పొందినవారివల్ల-

(C) ఏ యితర అధికారి వుద్యోగివల్ల చేయబడిన ఏవుత్తరువులు, రికార్డులు, సరిగా చట్టసమ్మతముగా వున్నదా? అని తృప్తిపడుటకుగాను తెప్పించి పరిశీలించవచ్చును. వారికి తోచిన విధముగా వుత్తరువులను చేయవచ్చును.

(2) పై చెప్పబడిన తమకుగల అధికారమును గవర్నమెంటువారు యితరఅధికారుల వల్లగూడా చలాయించునట్లు చేయవచ్చును.

129 యీ ఆక్టు ప్రారంభకాలములో చట్టములో, రూల్సులో, వుత్తరువులో మరిఏవిధముగ గాని అమలులోవుండిన సూచనలు, యీ ఆక్టుకింద ఏర్పాటుచేయబడినట్లు సూచనలుగా వుండవలెను.

130. సెక్షన్ — ఒకపంచాయితీకిన్ని స్థానికవర్గముకున్నూ మధ్య యీ ఆక్టు కింద ఏదైనా వివాదములు రాబడి, వారిలో వారు పరిష్కారము చేసుకొనుటకు వీలుపడలేదని గవర్నమెంటు వారికి తోచిన యెడల వారు దానిని విచారణకు ఎత్తుకొని వారే తీర్పుచేయవచ్చును. లేదా రిపోర్టు చేయుటకు ఒకమధ్యవర్తికి లేదా జాయింటు కమిటీకి పంపవచ్చును.

(2) పై విధమైన రిపోర్టు గవర్నమెంటుకు అందిన మీదట వారు పరిశీలించి యుక్తమని తోచిన రీతిగా తీర్మానించవచ్చును.

(3) అట్టి తీర్పును గవర్నమెంటువారు ఎప్పుడుగాని తిరుగా సవరణచేయవచ్చును. ఆవల వారికి తోచినప్పుడు తీర్పును రద్దుగూడా చేయవచ్చును. అట్టి తీర్పుకు వుభయ సంస్థలు బద్ధపడి యుండవలెను. ఏకోర్టులోగాని దావా చెల్లనేరదు.

(4) పైన చెప్పిన తగాదా మధ్యలో ముఖ్యమైన సబు(ఫ్రరేవు ఆధికారివర్గము వారుగా వుండు సందర్భములో సెంట్రల్ గవర్నమెంటువారి వుత్తరువు కొరకు పంపవలెను.

131. సెక్షన్ — (1) యీ ఆక్టు ప్రారంభకాలములో వుండిన పంచాయితీలను యీ ఆక్టుకింద నియమించబడిన పంచాయితీలను యీ ఆక్టుకింద పునర్నిర్మాణముచేయు సందర్భములో కింద షెడ్యూళ్ళలోని విధుల మేరకు వుండవలెను.

(2) సదరు విధులను సవరించుటకు రద్దుచేయుటకు గవర్నమెంటుకు అధికారము గలదు. పంచాయితీకోర్టు అధికారము.

132. సెక్షన్ — (i) ఒక ప్రదేశమునకు యీ ఆక్టు కింద నియమించబడిన పంచాయితీ, సదరు హద్దులలోని పంచాయితీకోర్టుగా భావించబడవలెను. దాని మెంబర్లు వైసు ప్రెసిడెంటు పంచాయితీ కోర్టుయొక్క అదే వుద్యోగులుగా భావించబడవలెను

(2) A పంచాయితి అంత్యము, లేదా రద్దుకాబడినప్పుడు. తిరుగా నిర్మించబడు వరకు దాని ప్రెసిడెంటుగానూ మెంబరుగానూ వుండవలెను.

B. పంచాయితీ కోర్టుకు ఎన్నుకొనుటకు అర్హతగల ఆహద్దులలోని ముగ్గురిని ఇన్స్పెక్టరు మెంబర్లుగా నియమించవలెను.

(3) యీ ఆక్టు ప్రారంభ కాలముకు పూర్వము ఆహద్దులలో వుండు గ్రామకోర్టు. పంచాయితీకోర్టు, విచారణాధికారము నిలిచిపోవలెను. గ్రామకోర్టు, ఆక్టు 9 A 9 B సెక్షన్ల అర్థము మేరకు యీ ఆక్టు పంచాయితీ అట్టికోర్టుకు బదులుగా స్థాపించబడిన పంచాయితీ కోర్టుగా భావించబడవలెను.

(4) యీ ఆక్టు పంచాయితీ అమలులో వుండు ప్రదేశములో, పంచాయితీకోర్టు ఆక్టు 6, 7, 8, 9, సెక్షన్ నిబంధనలు వర్తించవు.

(b) ఇన్స్పెక్టరు, ఏపంచాయితీ కోర్టుయొక్కగాని ప్రెసిడెంటు వైసుప్రెసిడెంటు లేక మెంబర్లను. వారు అసమర్థత, డ్యూటీలోపము, దుర్నడత, యింకా యితరన్యాయమైన కారణములు మీద తొలగించవచ్చును.

(c) పంచాయితీకోర్టు ఆక్టు 9 సెక్షన్లోని నిబంధనలు పైన 2 వ క్లాజులో చెప్పిన సందర్భములో ఆ పంచాయితీకోర్టుయొక్క ప్రెసిడెంటు దాని మీటింగులకు అధ్యక్షుడుగా వుండవలెను. హాజరులేని పక్షమున, హాజరుగానుండు మెంబర్లు తమలో ఒకరిని ప్రెసిడెంటుగా ఎన్నుకోవలెను.

(b) పంచాయితీకోర్టు విచారణ అధికారము (13 సెక్షన్లో) రు 50 లకు బదులు రు 100 లు అని చేర్చుకోవలెను.

(5) గవర్నమెంటువారు ప్రకటనద్వారా ఈ ఆక్టు సెక్షన్కింద నియమించిన పంచాయితీకోర్టుకు సివిలు, క్రిమినలు అధికారములు యివ్వవచ్చును.

133. సెక్షన్ — రిజిస్ట్రేషన్ ఆక్టులోవుండు దానితో నిమిత్తములేకుండా, గవర్నమెంటువారి తనిఖీకిలోబడి, ఇన్స్పెక్టరు జనరల్ రిజిస్ట్రేషన్వారు రిజిస్ట్రేషన్ చేయవలసిన దస్తావేజులు విషయములో సదరు ఆక్టుకింద సబ్‌రిజిస్ట్రారుకు వుండు అధికారములను చలాయించుటకుగాను సదరు హద్దులలో సబ్‌రిజిస్ట్రారు ఆఫీసు లేనివిషయములో పంచాయితీ వారికి సదరు ఆక్టు అధికారములు యివ్వవచ్చును.

## —: 1 షెడ్యూలు,—సాధారణచర్యలకు శిక్షలు :—

సె 79 A పబ్లికు రోడ్డులో గోడకట్టుట, కంచెవగైరా వేయుట — రు 100 లు
B. రోడ్డులో గుంటచేయుట, యితరవస్తులు వుంచుట — రు 50 లు
C. రోడ్డులోరాళ్ళుతవ్వుట — రు 5 లు
D. మురుగుకాలవమీద చట్టవిరుద్ధముగా కట్టడములు — రు 200 లు
E. పంచాయితి ఆస్తిలో పర్మిషను లేకుండాచెల్లునాటుట — రు 200 లు
F. పంచాయితి ఆస్తిలోని చెట్లను పర్మిషన్ లేకుండా కొట్టుట — రు 200 లు
సె 81 ప్రైవేటుమార్కెటును, పర్మిషన్ లేకుండా వుంచుట — రు 500 లు
సె 82 ప్రైవేటు మార్కెటులో పర్మిషన్ లేకుండా రుసుములు విధించుట రు 100 లు
సె 84 పర్మిషన్ లేకుండా మార్కెటులో వస్తువులువిక్రయము చేయుట — రు 20 లు
సె 85 పబ్లికురోడ్డులో పర్మిషన్ లేకుండా వస్తువిక్రయించుట — రు 10 లు
సె 87 పబ్లికురోడ్డుప్రక్కన బండ్లునిలుపు స్థలము ఏర్పరచుట — రు 50 లు
సె 88 లైసెన్సు లేకుండా బండ్లదొడ్డి ఏర్పరచుట — రు 200 లు
సె 90 రూల్సుకు భిన్నముగా వధశాల వెలుపల పశువధచేయుట — రు 200 లు
విక్రయముకు పర్మిటులేకుండా జంతు వధచేయుట — రు 200 లు
సె 91 లైసన్సు వుండవలసిన పనికి, లైసన్సు లేకుండా ఒక ప్రదేశమును వాడుట — రు 100 లు
సె 92 చట్ట విరుద్ధముగా ఫ్యాక్టరీ వర్కుషాపు ఏర్పరచుట. — రు 1000 లు
సె 95 కట్టడముకు వేసిన నెంబర్లు అక్రమంగా తుడిచి వేయుట — రు 50 లు
నెంబర్లు తిరుగా వేయమని కోరినప్పుడు వేయకపోవుట — రు 20 లు
సె 123 పబ్లికురోడ్డు చెరువు, బావి వుపయోగించువారిని ఆటంకం పెట్టుట. రు 100 లు

పై నేరములకు, అందులో చెప్పబడిన మొత్తముకు జాస్తిలేకుండా కోర్టువారు జుల్మానా విధించవచ్చును.

## ‡ యీ ఆక్టుకింద చేయబడిన రూల్సు. ‡

1. రూలు—యీ ఆక్టు మాటలలో "పాతఆక్టు" అనగా 1920 లోకలుబోర్డుఆక్టుకు అన్వయము "పంచాయితీ" అనగా పాతఆక్టును అనుసరించి చేయబడి, యీ ఆక్టు అమలులోకి వచ్చునప్పుడు వుండు పంచాయితీ అని అర్థము.

రూలు—2, యీ ఆక్టు ప్రారంభములో పాతఆక్టును అనుసరించి ఒకగ్రామముగా

వుండుప్రతి స్థానిక ప్రదేశమున్ను యీ ఆక్టుకింద ఒకగ్రామముగా ప్రకటించబడినట్లుభావించవలెను. పంచాయితీ, యీ ఆక్టుకింద చేసినట్లు భావించవలెను.

అయితే పాతఆక్టుక్రింద ఒకగ్రామముగా 500 గాక జాస్తిగాని జనసంఖ్యగలరెవిన్యూ గ్రామమును మినహాయించిన పిమ్మట గ్రామ జనసంఖ్య 500 లకు తక్కువకాని రెవిన్యూ గ్రామమైనను చేరియుండు సందర్భములో ఇన్‌స్పెక్టరు యీ ఆక్టు అములుకు రాగానే సాధ్యమైనంత త్వరలో అట్టి రివిన్యూ గ్రామమును ఆగ్రామమునుండి మినహాయించవలెను. అయితే సమీపములో నుండు కారణమువల్ల అట్లు చేయుటకు వీలులేదని అయనతలచిననేతప్ప. 3 వ సెక్షన్ ప్రకారము యీ ఆక్టుకొరకు దానిని ఒక గ్రామముగా ప్రకటించవలెను.

3. రూలు— పాతఆక్టు మేరకు అమలలోవుండి యీ ఆక్టు ప్రారంభములో అమలులో వుండు పంచాయితీ మెంబర్ల సంఖ్య యీ ఆక్టుకింద ఎన్నుకోబడిన మెంబర్లుగా భావించవలెను అయితే పాతఆక్టుకింద మెంబర్లు 15 కు జాస్తిగావుండిన విషయములో, యీ ఆక్టుకింద దాని సంఖ్య 15 గా తీర్మానించవలెను.

4. రూలు— (1) యీఆక్టు ప్రారంభములో మెంబరుగా వుండువారు (దాని ప్రెసిడెంటు. గ్రామఅధికారి మినహాయించి) యీఆక్టుకింద ఎన్నుకొనబడిన పంచాయితీ మెంబరుగా భావించవలెను. గవర్నమెంటువారు నిర్ణయించు తేదివరకు లేదా నిర్ణయము లేనియెడల, వారి పూర్వపుమెంబరు పదవి ప్రకారం అంత్యము కావలసిన కాలమువరకు వారుపుద్యోగములో వుండవలెను,

(2) యీ ఆక్టు ప్రారంభములో పంచాయితీ ప్రెసిడెంటుగా నుండిన మెంబరు, యీఆక్టుకింద మెంబరుగా వున్నట్లు భావించవలెను.

(3) యీ ఆక్టు ప్రారంభములో పంచాయితీ మెంబరుగావుండిన గ్రామఅధికారి మెంబరుపదవిని నిలిచిపోయినట్లు భావించవలెను.

5. రూలు—(1) పాత ఆక్టుక్రింద షెడ్యూలుజాతికి యివ్వబడిన మెంబరు స్థానములు ఈఆక్టుక్రింద యిచ్చినట్లు భావించవలెను,

(2) యితరజాతికి గాను పాతఆక్టులో స్థానములును ప్రత్యేకించు పద్ధతి ఈ ఆక్టు అములుకు రాగానే నిలిచిపోవలెను. అయితే ఈఆక్టు ప్రారంభములో అట్టి ప్రత్యేదస్థానముకువుండు మెంబరు విషయములో ఈ రూలు బాధించదు,

6. రూలు— (1) ఈ ఆక్టు ప్రారంభముకు చేయబడి అమలులోయుండు వార్డులు విభజన ఈ ఆక్టుకింద చేసినట్లు భావించవలెను. అయితే అట్టివిభజన ఈ ఆక్టు 9-వ సెక్షన్ ప్రకారము లేనియెడల. ఇన్‌స్పెక్టరు ఈ ఆక్టు ప్రారంభమైన తర్వాత సాధ్యమయినంత త్వరలో 9-వ సెక్షన్ ప్రకారము విభజన చేయావలెను.

(2) యీఆక్టు సె 9 ను నిబంధనలక్రింద ఒకగ్రామము వార్డులుగా విభజింపవలసియుండి యీ ఆక్టు ప్రారంభముకు ముందు అట్లు విభజంపబడని యడల, ఇన్‌స్పెక్టరు యీ ఆక్టు ప్రారంభముకు పిమ్మట సాధ్యమైనంత త్వరలోఆగ్రామమును వార్డులుగావిభజింపవలెను.

(3) యీ ఆక్టు ప్రారంభమునకు పిమ్మట ఇన్‌స్పెక్టరు పై 4-వ రూలుక్రింద ఎన్నుకొనబడినట్లు భావింపబడిన మెంబర్లలో ఏ మెంబరు ఏ వార్డుకు ప్రతినిధిగా నుండవలెనో తీర్మానించవలెను.

రూ 7 లు. యీ ఆక్టు ప్రారంభములో వుండిన పంచాయితీ ప్రెసిడెంటు, వైసు ప్రెసిడెంటు, 4-వ రూలులో చెప్పినతేదివరకు ఆ వుద్యోగమును కలిగివుండవలెను.

రూ 8 లు. (1) ఈ ఆక్టు ప్రారంభములో వుండునట్టి లేదా, 4, వ రూలులో చెప్పిన తేదీకి పూర్వము కలిగిన ప్రెసిడెంటు లేదా వైసుప్రెసిడెంటు ఖాళీస్థానమును ఈ అను మేరకు ఎన్నికలమూలముగా భర్తీచేయవలెను.

(2) పంచాయితీయొక్క ఎన్నుకొనబడిన మెంబరు వుద్యోగము ఖాళీ కాబడినప్పుడు ఈ ఆక్టు మేరకు ఎన్నికలమూలముగా భర్తీచేయవలెను.

(3) పైరూలు ననుసరించి ప్రెసిడెంటుగా, వైసుప్రెసిడెంటుగా, ఎన్నుకొనబడిన మనిషి 4-వ రూలులో చెప్పిన తేదీవరకు మాత్రము ఉద్యోగములో నుండవలెను.

వివరణము (1) ఈ ఆక్టు ప్రారంభములో పంచాయితీ మెంబరుగా ఉద్యోగములో నున్నవాడు 4-వ రూలుక్రింద మెంబరు అయినపక్షమున అతడి స్థానము పాతఆక్టు మెంబర్ల మొత్తము 15 ను మించిన సందర్భములోతప్ప, ఈ ఆక్టు ప్రారంభములో ఖాళీఅయినట్లు భావించవలెను. ఈ ఆక్టు ప్రారంభములో పంచాయితీ మెంబరుగావుండిన గ్రామాధికారి స్థానము ఈ ఆక్టు ప్రారంభమునందు ఖాళీ అయినట్లు భావించవలెను.

(3) యీ ఆక్టు ప్రారంభమునకు ముందు ఎవరుగాని, ఎన్నుకొనబడని బాప్తు, ప్రెసిడెంటు, వైసుప్రెసిడెంటు, లేదా మెంబరు యొక్క వుద్యోగము ఈ ఆక్టు ప్రారంభములో ఖాళీ అయినట్లు భావించవలెను.

రూ 9 లు — పాత ఆక్టుననుసరించి రద్దు చేయబడిన లేదా ఆపీ ఉంచబడిన, పంచాయితీలు ఈ ఆక్టు మేరకు తిరుగాఏర్పడవలెను.

రూ 10లు. పంచాయితీ పాతఆక్టును అనుసరించి మొదటిసారి ఏర్పరచబడిఆయాక్టు సె240ను కింద నియమించబడిన స్పెషల్ ఆఫీసరు యీ ఆక్టు ప్రారంభములో అట్టి ఉద్యోగములో వుండు సందర్భములో పంచాయితీ ఆక్టు సె 122 ను క్రింద తిరుగా ఏర్పరచవలెను.

రూ 11 లు. (1) పంచాయితీ- తరఫున వుండు యావత్తు ఆస్తియున్నూ, ఈ ఆక్టు ప్రారంభము పిమ్మట గవర్నమెంటువారి వుత్తరవుకులోబడి, ఈ ఆక్టుననుసరించి చేయబడినట్లు పంచాయితీకి వుండవలెను,

(2) ఈ ఆక్టు ప్రారంభములో పంచాయితీకి రావలసిన అన్నిబాకీలు, యితర మొత్తములు ఈ ఆక్టుక్రింద బాకీవున్నట్లే పంచాయితీకి వుండి రాబట్టుకోవచ్చును.

(3) పాత ఆక్టును అనుసరించి పంచాయితీమీద లేదా, దాని వర్గముమీద జరుగు

యావత్తుచర్యలు అని ఈ అక్టుకు విరుద్ధముగా లేనియెడల ఈ అక్టుక్రింద వున్నట్లే అమలు జరుగవలెను.

రూ12లు. ఈ ఆక్టు ప్రారంభములో పంచాయితీవారు విధించబడిన పన్నులు. శిస్సులు ఈ ఆక్టు అమలులోకి రాబడిన పిమ్మట గవర్నమెంటువారు వేరు విధముగా వుత్తరువు చేసిననే తప్ప. ఈ అక్టుక్రింద పంచాయితీలచే విధించబడినట్లు వుండవలెను.

రూ 13. లు ఈ ఆక్టుకు పూర్వము అధికారులు జరిపిన చర్యలన్నియు అవి దీనికి విరుద్ధముగా వున్ననే తప్ప. ఈ అక్టుక్రింద తీసికొనబడిన చర్యలుగా భావించబడవలెను.

శ్రీ సత్యనారాయణ ప్రెస్, మండపేట, తూర్పు గోదావరి జిల్లా.

శ్రీ శంకరప్రబోధము:—రచన - శ్రీస్వామి తత్వానంద. హరిజన ప్రబోధ
మున కుపకరించు ఏకాంకనాటిక.

"తోడిమానవులందరియందును దైవాంశను గురితింపజాలక కొంద
రిని అస్పృశ్యులనుచు వెలిబెట్టునరుడు జ్ఞానికాజాలడు" అను దివ్య
ప్రబోధముగావించు ఉత్తమగ్రంధరాజము. వెల 5 అణాలుమాత్రం.

శ్రీ విద్యాంధతమోభాస్కరము:—రచన-శ్రీస్వామితత్వానంద "చదువుల
తోడను, కర్మకలాపములతోడను, పండితచర్చలతోడను మోక్ష
మును సాధింపగలమని అహంకరించు" వారికి గుణపాఠమునేర్పు
ఉత్తమమైన ఏకాంక నాటిక. వెల ఏడు అణాలు మాత్రమే

ఆదిమవాసులు:—రచన - శ్రీచిరాప్రూరి నాగభూషణాచార్యులు
బి. ఏ. బియిడి.

ఆర్థికమంత్రులగు శ్రీబెజవాడ గోపాలరెడ్డిగారి పరిచయముతో వెలు
వడినది. ఎరుకల, యానాది, లంబాడి, దొమ్మర, ఖోందు, సవర,
గడబ, కోయ మున్నగు ఆదిమవాసుల సమగ్రచరిత్ర. ఇందు ఆదిమ
వాసులను ఉద్ధరించుటకు చక్కని సూచనలు గలవు. డాక్టరు
అయ్యప్పన్, ఎం. ఎ. పి. హెచ్.డి. డాక్టరు గిడుగు వెంకటసీతాపతి
ఎం. ఏ. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య మున్నగు విద్యావేత్తలు
గ్రంధప్రాశస్త్యమును గురించి సదభిప్రాయము లొసగియున్నారు.
ఆంధ్రప్రభ, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, చిత్రాంగి, విజయవాణి, భార
తీయ వైశ్యమున్నగు పత్రికలు గ్రంధముపై చక్కని రివ్యూలొసగి
యుండిరి. మద్రాసు టెక్స్టుబుక్కు కమిటీవారిచే గ్రంథాలయము
లన్నిటియందును ఉండతగినదని అప్రూవ్ కాబడి ఫోర్టుసెంటుజార్జి
గెజట్ లో ప్రకటింపబడినది. ఎల్లరు చదువతగినది. వెల రు 3—8—0

వసాయపనిముట్లు ఉత్పత్తిదారులు—వారిస్థితిగతులు. వెల రు 0—8—0

పంచాయితీరాజ్యం— వెల రు 2—8—0

☞ పై గ్రంధములకొరకు ఈచిరునామాకు వ్రాయుండి.

శ్రీ కోట వెంకటేశ్వర్లు
వీరభద్రగ్రంధమాల
శ్రీ తత్వానందశిల్పాశ్రమము
మంగళగిరి (P. O.) గుంటూరుజిల్లా.